అపరాధ పరిశోధన అనుబంధం—154

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఆటవిక రాజ్యం

రచన: సుంకరి రాంప్రసాద్

## ప్రాణం విలువ?

రచన: వసుంధర

## అడవి దొంగలు

రచన: కె. వి. రమణ

## దెయ్యాల బండి

రచన: అపర్ణా నైటింగేల్

అన్వేషణ - నాల్గవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—154
అక్టోబరు, 1986
వెల. రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు



కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీటు, మద్రాసు-1.

# ఆటవిక రాజ్యం

సుంకరి రాంప్రసాద్

రాత్రి బాగా పొద్దు పోయింది.

చీకటి మరింత చిక్కబడటంతో, బిక్కు, బిక్కు మంటూ యిక వుండలేక చుక్కలు కూడా పక్కలు చేరే వేళ.

నల్లని పసిఫిక్ సముద్ర జలాలను చీల్చుకుంటూ రాయంచలా వయ్యారంగా దూసుకుపోతూంది కొలంబియా. సకల సదుపాయాలతో నూరుమంది యాత్రికులు హాయిగా ప్రయాణించగల ఆ మినీ లగ్జూరియస్ ప్యాసింజర్ స్టీమర్, చిలీలోని వాలివియా రేవునుండి బయలుదేరింది.

దక్షిణ అమెరికా ఖండంలో నైరృతితీరాన సన్నగా, పొడుగ్గా తీగలా ఉండే దేశమే చిలీ. ఆ దేశానికి దక్షిణ దిక్కులో వందల సంఖ్యలో వ్యాపించి వున్నాయి చిన్న చిన్న దీవులు.

దోనాన్ దీవుల సముదాయంగా పిలువబడే ఆ దీవులు సహజసిద్ధమైన ప్రకృతి సౌందర్యానికి కాణాచులు.

అందమైన ఆ దీవులకు విహారయాత్రలకోసం ఒక్క చిలీ దేశస్థులే గాక, పెరూ, అర్జెంటీనా, ఉరుగ్వే, బ్రెజిల్ మొదలగు పొరుగు దేశాలనుండి కూడా యాత్రికులు వస్తూంటారు. వారి కోసం కొన్ని విహార నౌకలను కూడా చిలీ ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

అలాంటి ఒక విహార నౌకే కొలంబియా.

తమకు కేటాయింపబడ్డ కేబిన్‌లలో వెచ్చగా పడుకుని వున్నారు ఆ నౌకలోని కొందరు యాత్రికులు. షిప్ డెక్ మీద కుర్చీలలో కూర్చుని, రాత్రంతా స్కాచ్ సేవిస్తూ నిషా పూర్తిగా నరాలకు ఎక్కాక, లేచి కాబిన్‌లోనికి వెళ్ళే ఓపిక లేక, అలా....ఆ డెక్‌మీదే మత్తుగా వాలిపోయారు మరికొందరు ప్రయాణీకులు.

నీలాకాశంలోని చుక్కలన్నింటినీ ఒక్కచోటే ప్రోగేసినట్లు నల్లని సంద్రంలో విద్యుద్దీప కాంతులతో వెలిగిపోతూంది ఆ విహార నౌక.

తెరచాప స్తంభం ప్రక్కనున్న తన కేబిన్‌లోనుండి పైకి వచ్చాడు ఆ షిప్ కెప్టెన్ విలియమ్స్. ఆవులిస్తూ బద్ధకంగా వళ్లు విరుచుకున్నాడు. చుట్టూ పరకాయించి చూశాడు.

కొలనులోనికి జలకాలాడటానికి దిగిన మత్తగజాల గుంపులా వున్నాయనుకున్నా డతడు దూరంగా నల్లని గుట్టల్లా కన్పిస్తున్న దోనాన్ దీవులను చూస్తూ.

సరిగ్గా అప్పుడే....వున్నట్లుండి షిప్‌లోని దీపాలన్నీ ఆరిపోయాయి. అంతా కటిక చీకటి. కన్ను పొడుచుకున్నా యేమీ కనిపించలేదతడికి.

ఆ షిప్‌లో కాస్త మెలకువగా వున్నవారు గాబరాగా లేచి కూర్చున్నారు. కాని, ఏం జరిగిందో,

యేమిటో యెవరికీ యేమీ అర్థం కాలేదు.

పదిహేను నిమిషాల తరువాత మళ్ళీ మామూలుగా దీపాలు వెలిగాయి.

కరంట్ యెందుకు ఫెయిలయిందో చూడటానికి, జనరేటర్ రూమ్‌కు హుటాహుటిని వెళ్ళాడు కెప్టెన్ విలియమ్స్. కాని, జనరేటర్ ఆపరేటర్ కనిపించలేదతడికి. జనరేటర్ మామూలుగానే పనిచేస్తూంది.

అయితే కనిపించకుండా మాయమైంది ఒక్క ఆపరేటర్ మాత్రమే కాదని, ఓడ సిబ్బందిలోని మరో ఇద్దరు సెయిలర్స్, ముగ్గురు ప్రయాణీకులు, మొత్తం ఆరుగురు వ్యక్తులు అదృశ్యమయ్యారని, వారితోపాటే కొంత విలువైన సామగ్రి కూడా మాయమైందని తెలిసేసరికి, ఓడలో కలకలం ప్రారంభమయింది.

ఆ తరువాత ఎంత ప్రయత్నించినా, వారి ఆచూకీ గాని, కనీసం వారు ఎలా అదృశ్యమయ్యారో గాని, ఎవ్వరూ తెలుసుకోలేక పోయారు.

## 2

"పసిఫిక్ మహాసముద్రంలో దోనాన్ దీవులకు సమీపంగా ప్రయాణిస్తున్న ఓడలోని మనుష్యులు విచిత్రంగా అదృశ్యమవుతున్నారు. వారితోపాటు యెంతో విలువైన సామగ్రి కూడా మాయమవుతుంది.

కేవలం నెలరోజులలో పదిహేను ఓడలలోని వ్యక్తులు, కొన్ని మిలియన్ డాలర్ల విలువచేసే సామగ్రితో సహా అదృశ్యమయ్యారు.

చిలీ ప్రభుత్వపు రహస్య గూఢచారి విభాగానికి సైతం అంతుచిక్కని ఈ దోనాన్ దీవులలోని రహస్యం ఏమిటి?

ఎవరు చేస్తున్నారిదంతా?

సముద్రంలో ఓడలు ప్రయాణిస్తూండగానే మంత్రం వేసినట్టు అందులోని వ్యక్తులు, సామాగ్రి మాయమౌ తున్నారంటే.... ఇది మనుష్యులకు సాధ్యమా అన్న అనుమానం వస్తూంది.

మనుష్యులు కాకుంటే.... ఎవరా అదృశ్య శక్తి?"

"ట్రాష్!"

చదువుతున్న న్యూస్ పేపర్‌ను టీపాయ్ మీదకు గిరవాటు వేస్తూ అన్నాడు గోవర్.

అతడి వంక నవ్వుతూ చూశాడు లాంబ్.

"య్యాస్ లాంబ్! నేను నమ్మను. దోనాన్ దీవుల గూర్చి ఈ పత్రికల వాళ్ళు గోరంతల్ని కొండంతలు చేస్తున్నారు. అయినా ఈ ఇరవై ఒకటవ శతాబ్దంలో యేదో అదృశ్యశక్తి, మనుషుల్ని మాయం చేస్తుందని కాకమ్మ కథలు చెబుతున్నారంటే—ఓహ్!"

"ఏమో గోవర్ అది నిజమే నేమో!"

"అంటే.... దీనిని నీవు నమ్ముతున్నావా?"

"ఏం? నమ్మకూడదా!"

"నిజాన్ని నమ్మితే తప్పులేదు ఫ్రెండ్! కాని, ఇలాంటి కథలను...."

"ఇది కథ కాదు గోవర్."

"నిజమే అయితే యెవరా అదృశ్యశక్తి?"

"అది తెలియకనే ఈ ముసుగులో గుద్దులాట."

"అయితే ఆ రహస్యమేదో మనం తెలుసుకుందాం."

"గోవర్....!"

"య్యాస్ లాంబ్! మనమూ ఒకసారి ప్రయత్నిస్తే తప్పేమిటి? జస్ట్ మనం దోనాన్ దీవులకు పిక్నిక్

వెళ్తున్నాం అనుకో."

గోవర్ కళ్ళలోని పట్టుదలను చూసి నెమ్మదిగా తలాడించాడు లాంబ్.

గోవర్ ఒక నిర్ణయానికి వచ్చాడంటే ఎంత రిస్క్ చేసైనా ఆ పని చేసితీరతాడని లాంబ్ కు బాగా తెలుసు.

లాంబ్, గోవర్ మంచి స్నేహితులు. ఓషనాలజీ ప్రధాన పాఠ్యాంశంగా పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తున్న విద్యార్థులు వారు. తమ పాఠ్యపుస్తకాలలో దోనాన్ దీవుల గురించి తెల్సుకుంటూ చదువుకున్నారు వారు.

కొన్ని వందల సంఖ్యలో వ్యాపించి వున్న ఆ దోనాన్ దీవులలో మానవ సంచారం వున్నది ఒక్కే, ఒక్క దీవిలోనని, మిగిలిన దీవులు భయంకర క్రూర మృగాలతో నిండిన దుర్గమారణ్యాలనీ, వాటిలోనికి ప్రవేశించడమంటే మృత్యుద్వారంలో అడుగు పెట్టడమేనని వారికి తెలుసు.

దోనాన్ దీవులకు వచ్చే యాత్రికులుకూడా మానవ సంచారం వుండే ఆ ఒక్క దీవికి మాత్రమే వెళతారు.

తమ సత్యాన్వేషణను ఆ దీవినుండే ప్రారంభించాలని నిశ్చయించుకున్నాడు గోవర్.

వారు ఆ రోజు రాత్రే దోనాన్ దీవులకు ప్రయాణమయ్యారు.

# 3

తన ఎదురుగా కూర్చున్న ఇద్దరు యువకుల వంక అర్థంగా చూశాడు గ్రాహమ్ పాల్.

దోనాన్ దీవులలో మానవ సంచారంగల దీవిలో ఒక రోమన్ కేథలిక్ చర్చి వుంది. పురాతనమైన ఆ చర్చిలోని పాస్టరే.... గ్రాహమ్ పాల్.

అత్యంత ప్రాచీనమూ, నిగూఢమూ అయిన దోనాన్ దీవుల గురించి అంతో, ఇంతో వివరంగా తెలిసిన వ్యక్తి గ్రాహమ్ పాల్ ఒక్కరే.

చిలీ ప్రభుత్వ గూఢచారులు సైతం, దోనాన్ దీవులకు సంబంధించిన తమ పరిశోధనలో ఆ మతాధికారిని సంప్రదించి, అతడి సలహాలు తీసుకున్నారు.

"మీరు అనవసరంగా కోరి ప్రమాదాన్ని తెచ్చుకుంటున్నారేమో బాబూ" అన్నాడు పాల్.

అతడి కళ్ళల్లో కరుణ రసం ఉట్టిపడుతూంది. అతడి గొంతు మెత్తగా, మార్దవంగా వుంది.

ఆరడుగుల దేహం. విశాలమైన ఫాలం. వెండిలా మెరిసే నిడుపాటి గెడ్డం. తెల్లగా, స్వచ్ఛంగా, ముట్టుకుంటే మాసిపోతాయా అన్నట్లుండే వస్త్రాలలో.... స్వర్గంనుండి దిగివచ్చిన దేవదూతలా వున్నాడు గ్రాహమ్ పాల్.

అతడివంక గౌరవంగా చూసాడు గోవర్.

"లేదు ఫాదర్! ఈ ప్రయత్నంలో వెనుకంజ వేసే ప్రసక్తి లేదు. ఎలాగైనా ఆ దోనాన్ దీవుల రహస్యం ఛేదించాలి" దృఢంగా పలికింది గోవర్ గొంతు.

"కాని... ఈ ప్రయత్నంలో...."

"మా ప్రాణాలు పోయినా పర్వాలేదు ఫాదర్!"

"ఎందుకా మొండి పట్టుదల బిడ్డా?"

"మొండి పట్టుదల కాదు ఫాదర్ చిలీ దేశ పౌరులుగా ఇది మా కర్తవ్యం.

ఈ నెలరోజులలో కొన్ని వందలమంది మాయమయ్యారు. ఏమయ్యారు వారంతా? చనిపోయారా? చనిపోయివుంటే వారి శవాలో లేక అస్థికలో మనకు

అర్థమవ్వాలి కదా!

లేదు బ్రతికి వుంటే— వారంతా ఎక్కడ ఉన్నట్లు? వారంతా నా బంధువులో, స్నేహితులో కాకపోవచ్చు. కాని, నా దేశ పౌరులు కారా? వారి కుటుంబ సభ్యులు వారికోసం విలపించటంలేదా?

ఇది నా ఒక్కడి సమస్య కాకపోవచ్చు. కాని మొత్తం జాతికి సంబంధించిన సమస్య ఇది. అందుకే ఈ సమస్యా పరిష్కారానికి ప్రయత్నించడం నా బాధ్యతగా భావిస్తున్నాను." ఆవేశంగా అన్నాడు గోవర్.

అతడి భుజాన్ని అనునయంగా తట్టాడు ఫాదర్ పాల్.

"వెల్ డన్ మై బాయ్! దేవుని పుత్రునివలె పరుల కొరకు ప్రాణములైనను యిచ్చుటకు సిద్ధపడుచున్నావు. ప్రభువు నిన్ను సర్వదా రక్షించుగాక!"

చేయెత్తి మనసారా దీవించాడు పాల్.

అంతవరకూ మౌనంగా, ప్రేక్షకునిలా వున్న లాంబ్ మొదటిసారిగా పెదవులు విప్పాడు.

"యిక చెప్పండి ఫాదర్ దోనాన్ దీవుల గురించి. మీరు చెప్పే, మీకు తెలిసిన అతి చిన్న విషయంకూడా మా ప్రయత్నంలో మా కెంతగానో సహకరించవచ్చు."

లాంబ్ వంక చురుగ్గా చూశాడు పాల్.

స్తబ్దంగా పడివుండి, ఉన్నట్లుండి ఒక్కసారిగా, మెరుపు వేగంతో శత్రువుపై ఎటాక్ చేసే కొండచిలువ గుర్తుకువచ్చింది అతడికి లాంబ్‌ను చూస్తే, ఎందుకో.

ఆ తరువాత సుమారు గంటన్నరసేపు జరిగింది వారి మధ్య సంభాషణ.

దోనాన్ దీవుల గురించి తనకు తెలిసిన విశేషాలను

పూసగుచ్చినట్లు వివరించి, వారు తీసుకోవాల్సిన జాగ్రత్తలనుకూడా చెప్పాడు పాల్. అక్కడక్కడ తనకు వచ్చిన సందేహాలను అడగసాగాడు గోవర్. లాంబ్ మాత్రం మౌనంగా వారి మాటలను ఆలకించసాగాడు.

## 4

సంధ్యారుణ కాంతిలో దోనాన్ దీవులు పాటలి వర్ణాన్ని పులుముకుంటున్నాయి.

ఒక చిన్న దీవి ఒడ్డునే సముద్ర జలాలలో నెమ్మదిగా ప్రయాణిస్తూంది ఒక చిన్న ఫిషింగ్ బోట్. సముద్ర జలాలు ఆ దీవుల మధ్య పాయలుగా ప్రవహించటం చేత, కెరటాల ఉధృతం లేక ప్రశాంతంగా వుంది. దీవికి, దీవికి మధ్య సన్నని నదీ పాయలా వుంది నల్లని సముద్రం.

బోట్‌లో ముందువైపు కూర్చుని బలంగా తెడ్లు వేస్తున్నాడు లాంబ్. చేతిలోని చిన్న చేపల వలను సముద్రంలోనికి విసిరాడు గోవర్ అతడి కళ్ళుమాత్రం నలుదిక్కులా పరిశీలనగా చూస్తున్నాయి. చూడటానికి చేపలు పట్టుకొనే పల్లెవాళ్ళలా వున్నారు వారు.

మోకాళ్ళదాకా వుండే ట్రౌజర్స్, ముతక బనియన్, తలపై ఖర్జూరపు ఆకులతో నేసిన పెద్ద, పెద్ద టోపీలూ అచ్చంగా లాటిన్ అమెరికన్ పల్లెవాసుల్లాగానే వున్నారు వారు.

ఒక్కొక్క దీవిని దాటుకుంటూ, వారు ప్రయాణం కొనసాగిస్తున్నారు. ఉదయంనుండి, సాయంత్రంవరకూ నిర్విరామంగా కొనసాగింది వారి ప్రయాణం. కాని అంత వరకూ ఒక్క మనిషి కూడా వారికి కనిపించలేదు.

ఏపుగా, ఎత్తుగా పెరిగిన పచ్చని తోటలూ, పచ్చని ఆకాశంలో మెరిసే తారల్లా, విరిసిన రంగు రంగుల అడవి

పూలూ, గాలివాటున వచ్చి మత్తెక్కించే వాటి సౌరభమూ, తీరం వెంబడి గుంపులు గుంపులుగా యెగిరే తెల్లని సీ గల్స్. కనులవిందు చేస్తున్న దోనాన్ దీవుల అందాలను చూస్తూ వారు తమ్ము తామే మరచిపోయారు.

ఓ ప్రక్క సంధ్య చీకట్లు క్రమ్ముకుంటుంటే, అప్పుడు వారికి కాలమూ, గమ్యమూ గుర్తుకు వచ్చాయి. అప్పుడు అర్థమయింది వారికి ఆ దీవులెందుకంత ప్రమాదభరితమైనవో.

"దోనాన్ దీవులు ఒక పద్మవ్యూహంలాంటివి. కొన్ని వందల సంఖ్యలో చిన్న, చిన్నవిగా వ్యాపించిన ఆ దీవుల మధ్యకు ఒకసారి ప్రవేశిస్తే, మరలా తిరిగిరావడం అన్నది సామాన్యమైన విషయంకాదు. ఓ విధంగా అసాధ్యమేమో!

అక్కడనుండి చూస్తే, మనకు అన్ని దీవులూ ఒకేలాగ కన్పిస్తాయి. కానీ ఒక మార్గాన్ని యెన్నుకొని ప్రయాణిద్దామంటే అది త్రిప్పి, త్రిప్పి, తిన్నగా మళ్ళీ యింకో చక్రబంధం లోనికి ప్రవేశపెడుతుంది. అలా, అక్కడికక్కడే ఆ దీవులమధ్యే తిరగడం తప్పించి బయటపడే మార్గం కన్పించదు.

కొన్ని రోజులు గడిచేసరికి దిక్కుతోచక, మార్గం కానరాక మనకు పిచ్చెక్కినట్లు అవుతుంది. ముఖ్యంగా, దోనాన్ దీవుల మధ్యకు సాహసించి యెవరూ రాక పోవడానికి కారణం ఇదే."

వారికి అకస్మాత్తుగా ఫాదర్ పాల్ అన్న మాటలు గుర్తుకు వచ్చాయి.

"అంటే దారీ, తెన్నూ లేక తాము అలా ఆ దీవుల మధ్య తిరుగుతూ....ఆకలి, దప్పులతో మాడి చావ

వల్సిందేనా!"

ఆ ఊహాకే వారు భయంతో సన్నగా వణికిపోయారు. ఆ అడవిలో యెక్కడో యేదో పక్షి వికృతంగా అరిచిన ధ్వని. తెడ్డువేస్తున్న లాంబ్ ఒక్కక్షణం తెడ్లువేయటం ఆపి చెవులు రిక్కించాడు. మొదటి పక్షికూతకు బదులుగా మరో పక్షికూత వినిపించింది. ఆ తరువాత మరొక పక్షి. దానికి సమాధానమిస్తూ మరొకటి. ఇలా ద్వీపం నలు దిక్కులా ఒకదాని తరువాత ఒకటిగా పక్షికూతలు విని పించాయి.

ఎందుకో ఆ కూతలు అసహజంగా అనిపించాయి లాంబ్‌కు. అతడు సాలోచనగా నొసలు చిట్లించాడు. సరిగ్గా రెండు నిమిషాల తరువాత గుర్తుకు వచ్చింది అతడికి... ఆ కూతలేమిటో!

"య్యస్....అవే సందేహంలేదు" అనుకున్నాడతడు.

ఈజిప్పులోని స్త్రీలు రెండు పెదవుల మధ్య చూపుడు వేలునూ, మధ్య వేలునూ వుంచి....ర్....ర్....ర్....ర్ మంటూ ఒక విచిత్రమైన శబ్దం చేస్తారు. అది వినడానికి అచ్చం ఒక పక్షి వికృతంగా అరచినట్లే వుంటుంది.

తమ ప్రియతమ నాయకుడు చనిపోయినప్పుడు విషా దంతోనూ, తమ మగవారు యుద్ధభూమికి వెళ్తున్నప్పుడు ఉత్తేజంతోనూ...ఈజిప్టు స్త్రీ గొంతుల్లాలు చేసే వింత ధ్వనులివి.

"ఎక్కడో ఆఫ్రికా ఖండంలో వినిపించాల్సిన ఈ ధ్వనులు ఇక్కడ లాటిన్ అమెరికాలో వినిపించడ మేమిటి" అని అనుకున్నాడతడు.

తను ఒకవేళ భ్రమపడ్డానేమో అన్న సందేహం మొలకెత్తింది అతడి మనసులో. ఏదో తెలియని అనీజీ

నెన్‌ను ఫీలవుతున్నారు వారు. ఒకరి నొకరు చూసుకున్నారు బేలగా.

అదే క్షణంలో వారి ఫిష్ బోటు చుట్టూ వున్న సముద్రజలాలలో చిన్న కదలిక యేర్పడింది. ఏమిటా అని చూసారు వారు.

నల్లని సముద్ర జలాలను చీల్చుకుంటూ నెమ్మదిగా పైకి వస్తున్నాయి నాలుగు ఆకారాలు. ఒక్క క్షణం పాటు అవి యేమిటో వారికి అర్థంకాలేదు.

మసక చీకటిలో అస్పష్టంగా కనిపిస్తున్న ఆ ఆకారాల వంక అచేతనులై చూస్తూ వుండిపోయారు వారు.

అప్పుడు వినవచ్చాయి వారికి గుండెలను జలదరించే వికృతమైన నవ్వులు. ఆ నవ్వుతున్నది ఆ ఆకారాలేనని గ్రహించడానికి వారికి రెండు క్షణాలు పట్టింది. అప్పటికి ఆ ఆకారాలు నీళ్ళలోనుండి పూర్తిగా పైకి వచ్చాయి.

నల్లని కారునలుపు దేహాలు. పొడవుగా భుజాల మీదకు వ్రాలుతున్న జడలు కట్టిన జుత్తు, మెడలో రంగు రంగుల పూసల పేర్లు, ముఖాన్ని మరింత వికృతం చేస్తూ పెట్టబడ్డ రంగు, రంగుల బొట్లూ, చేతుల్లో ఆ చీకట్లో సైతం తళ, తళ మెరుస్తున్న గండ్రగొడ్డళ్ళతో సముద్రంలోనుండి వచ్చిన జల భూతాల్లా వున్నారు వారు.

కాంగో అడవుల్లో మాత్రమే కనిపించే అనాగరిక ఆటవికజాతి మనుష్యులు వారు. ఇక్కడ దోనాన్ దీవుల్లో తమ కళ్ళ యెదురుగా కన్పించేసరికి మూర్ఛ వచ్చినంత పనయింది లాంబ్‌కు.

వారు వికృతంగా అరచుకుంటూ ఒక్క వుదుటున ఆ ఫిషింగ్ బోట్ పైకి దూకారు. ఆ అదురుకు ఎండుటాకులా

ఊగిపోయింది ఆ చిన్నపడవ. వారిని ఎదుర్కొనడానికి కూడా ఆ మిత్రులకు అవకాశం చిక్కలేదు.

లాంబ్ నూ, గోవర్ నూ పెద్ద పెద్ద అడవితీగలతో పెడరెక్కలు విరిచికట్టి, వారిని ఈడ్చుకుంటూ ఒడ్డుకు ఈడుకుంటూ పోయారు వారు.

ఈ ఆటవికులు ఎవరో, ఎందుకు తమను బంధించారో అర్థంగాక సతమతమవసాగారు ఆ యువకులు.

ఒడ్డుకు చేరగానే వారి కళ్ళకు నల్లని గుడ్డలను గంతలు కట్టి ఆ దీవి లోపలికి నడిపించుకుపోయారు వారు.

అలా నడుచుకుంటూ కొన్ని గంటలు ప్రయాణించారు వారు. తరువాత వెదురు బొంగులతో అల్లిన బల్లకట్టు లాంటి దానిమీదకు ఎక్కించారు.

తాము నీటిపాయలుగుండా మరో దీవికి ప్రయాణిస్తున్నామని గ్రహించారు ఆ మిత్రులు. ఎక్కడికో చూడటానికి వారి కళ్ళకు గంతలు కట్టి వున్నాయి. గంతలు లేకున్నా పద్మవ్యూహం లాంటి ఆ దీవులలో ఎన్ని మలుపులని గుర్తు పెట్టుకోగలరు వారు?

అలా మరికొన్ని గంటల ప్రయాణం తరువాత వారు బల్లకట్టును దిగి మరలా నడకను ప్రారంభించారు. సుమారు అరగంట గడిచాక వారి కళ్ళకున్న గంతలను విప్పదీసారు ఆ ఆటవికులు.

కొన్ని గంటలసేపు కళ్ళకు గంతలు కట్టబడివుండటం చేత, కొన్ని క్షణాలవరకూ వారికి యేమీ కనిపించలేదు. మెల్లగా కళ్ళను నులుముకొని చుట్టూ పరీక్షగా చూశారు వారు.

అప్పుడు కనిపించిన దృశ్యం వారిని ఆశ్చర్యచకితులను

చేసింది. తాము ఒక్కసారిగా యే పదిహేనవ శతాబ్ది లోనికో వెళ్ళిపోయామా అనిపించింది వారికి ఆ క్షణాన.

వారికి ఎదురుగా పెద్ద చలిమంట వేసివుంది. ఆ సెగడు చుట్టూ చేరి ఉత్సాహంగా నృత్యం చేస్తున్నారు కొన్ని వందలమంది స్త్రీ, పురుషులు. వారంతా పూర్తిగా నగ్నంగా వున్నారు. ఒక్క మొలలకు మాత్రం అచ్ఛాదనగా చిన్న తోలు పటకాలాంటిది ధరించారు. మెడలో విచిత్రమైన పూసలతో చేసిన హారాలు ధరించారు.

వారి మధ్య ఒక అందమైన యువతి వుంది. ఆమె కూడా పూర్తిగా నగ్నంగానే వుంది. అయితే ఆమె ఆటవిక స్త్రీ కాదు. పొట్టిగా, దృఢంగా, పచ్చని బంగారు ఛాయతో మెరుస్తోంది ఆమె శరీరం.

ఆ యువతి శరీరంనిండా సన్నని ఇనుపచువ్వలు గ్రుచ్చి వున్నాయి. ఆ ఇనుపచువ్వల చివర గుడ్డలను వత్తులుగా చుట్టి ముట్టించారు. వంటినిండా మంటలతో ఆమె జ్వాలా సుందరిలా వుంది.

మామూలు మనుష్యులైతే ఆ ఇనుపచువ్వలు కల్గిస్తున్న బాధకు, ఆ మంటల వేడికి తాళలేక మూర్ఛపోయి వుండేవారు. కాని ఆమె ఏదో మత్తులో ఉన్నట్లు ఊగుతుంది. ఆమె కళ్ళు మత్తుగా, ఎర్రగా కలువ పూవుల్లా వున్నాయి.

ఆ దృశ్యాన్ని చూస్తూనే భయంతో కంపించిపోయారు వారు. పోస్టు గ్రాడ్యుయేషన్‌లో ఓషనాలజీని మెయిన్‌గా తీసుకున్నా, లాంబ్ మొదట హిస్టరీలో గ్రాడ్యుయేషన్ చేశాడు. అంత బీభత్సకరమైన జ్వాలా నృత్యం యెవరు చేస్తారో అతడికి బాగా తెలుసు.

ఎప్పుడో పదిహేను, పదహారవ శతాబ్దులలో మంగో లుల రాజ్యంలో మతాధికారులు వుండేవారు. వారిని షామాన్ లని పిలిచేవారు. మంగోలుల దైవమైన గోబీ ఎడారి దేవతను ఆవహింపచేయడానికి తమ శిష్యురాండ్ర చేత ఆ జ్వాలా నృత్యం చేయించేవారు ఆ షామాన్ లు.

ఒక్కొక్క సంఘటన గుర్తుకు వస్తుంటే లాంబ్ తల గిర్రున తిరగసాగింది. ఎక్కడి కాంగో అడవులలోని ఆటవికులు, ఎక్కడి ఈజిప్టులోని స్త్రీ గొరిల్లాలు, ఎక్కడి మధ్య ఆసియాలోని మంగోలుల జ్వాలానృత్యం అన్నీ నాగరిక ప్రపంచం మరచిపోయిన సనాతన, అతి ప్రాచీన నాగరికతా జాతులే.

వీళ్ళంతా కట్టకట్టుకొని ఒక్కసారిగా దోనాన్ దీవుల్లో యెలా ప్రత్యక్షమయ్యారు.

లాంబ్ ఇలా ఆలోచనలలో మునిగి, తేలుతూ వుండగానే వారి వంటిమీద దుస్తులు ఊడదీయబడ్డాయి. వారికికూడా మొలలకు చిన్న తోలు పటకాలను ఆచ్ఛాదనగా ధరింపచేశారు.

నృత్యం పరాకాష్టతకు చేరుకున్నదనడానికి సూచనగా డ్రమ్స్ వేగంగా మ్రోగసాగాయి. గుండెలు జలదరించేలా ఒక్కసారిగా కొమ్ము బూరలు మ్రోగాయి.

ఆటవికులంతా నృత్యం చేయటం ఆపి, ఆ జ్వాలా సుందరికి సాష్టాంగపడి నమస్కరించారు. వెనుకనుండి యెవరో విసురుగా ముందుకు త్రోయడంతో లాంబ్, గోవర్ లు కూడా ముందుకు బోర్లాపడ్డారు.

ఆ తరువాత వారిని తీసుకొని ఒక పెద్ద గోతిలో దించారు. పది అడుగుల లోతు, పన్నెండడుగుల వెడల్పు, ఆరడుగుల పొడవు వుంటుంది ఆ గోయి. ఏనుగులను

వేటాడడానికి ఆటవికులు ఉపయోగించే హంటింగ్ పిట్ అది.

ఆలివ్ ఆకులతో అల్లిన చిన్న బుట్టలో యేవో పళ్ళను యిచ్చారు వారికి. ఆ రాత్రి ఆ పళ్ళను తింటూ అలా ఆ గోతిలోనే చేరబడ్డారు ఆ మిత్రులు. శారీరకంగా, మానసికంగా పూర్తిగా అలసిపోయిన వారిని నిద్రాదేవత తొందరగానే కరుణించింది.

## 5

మరునాడు ఉదయం వారిద్దరినీ మరో చిన్న దీవికి తీసుకొని వెళ్ళారా ఆటవికులు. చుట్టూ పెట్టని గోడల్లా వ్యాపించిన యెత్తయిన కొండలు. వాటి మధ్య విశాలమైన మైదానం. అందులో మోకాటి ఎత్తువరకు ఎదిగిన పచ్చని పైరు.

విరిసిన తెల్లని పూలతో పచ్చగా కళ కళలాడుతున్న ఆ పైరు యేమిటో కొన్ని క్షణాలవరకూ వారికి అర్థం కాలేదు. అర్థం అయిన మరుక్షణం యెవరో ఛెళ్ళున కొరడాతో వెన్నుమీద చరిచినట్లయింది వారికి.

అవి మామూలు పంట పొలాలు కావు గంజాయి మొక్కలు. ఆ పంట విలువ కొన్ని కోట్ల డాలర్లు వుంటుందేమో!

తమని తీసుక వచ్చింది ఆ పొలాలలో పనిచేయించడానికేనని గ్రహించారు వారు. విశాలమైన ఆ పొలంలో అక్కడక్కడ వంగి పనిచేస్తున్న ముప్ఫయి, నలభై మంది అమెరికన్ యువకులు కన్పించారు వారికి.

అందులో పనిచేస్తున్న యెవరికీ మొలకు చుట్టబడ్డ తోలుపటకా తప్ప వంటిమీద మరో ఆచ్ఛాదన లేదు.

సూర్యుని లేత ఎండలో వారి శరీరాలు ఎర్రగా మెరు స్తున్నాయి.

పదిమంది ఆటవికులు గుర్రాలపై స్వారీ చేస్తూ వారిపై అజమాయిషీ చేస్తున్నారు. వారి చేతులలో పొడవాటి చర్మపు కొరడాలు ఉన్నాయి.

అక్కడ, ఆ అజ్ఞాత ప్రదేశంలో తోటి అమెరికన్ యువకులను చూడగానే గోవర్ కు ప్రాణం లేచివచ్చి నట్లయింది. వారి వంక చేయి ఊపుతూ 'హేయ్' అంటూ ఉత్సాహంగా అరిచాడు.

అంతే! గుర్రంపైనున్న ఆటవికుడు ఒక్క గెంతులో గుర్రాన్ని వారి దగ్గరకు ఉరికించాడు. అతడి చేతిలోని చర్మపు కొరడా బలంగా గోవర్ వీపును తాకింది. కొరడా చర్మాన్ని తాకినంత మేరా చర్మం చీరుకుపోయి ఎర్రని రక్తపు చారిక యేర్పడింది. బాధతో అరచిన గోవర్ గొంతు ఆ కొండలలో ప్రతిధ్వనించింది.

చేస్తున్న పనిని ఒక్కక్షణం ఆపి, గోవర్ వంక జాలిగా చూశారు ఆ అమెరికన్ యువకులు. కట్టలు తెగి వస్తున్న కోపాన్ని అపుకోవడానికి విఫలయత్నం చేశాడు లాంబ్. ఉద్రేకంతో బిగుసుకుంది అతడి కుడిచేతి పిడికిలి. అప్రయత్నంగానే అతడు అడుగు ముందుకు వేశాడు.

అంతే! ఆ ఆటవికుని కొడిశాలు బలంగా అతడి గుండెలను తాకింది. బాధగా అరుస్తూ వెనక్కి తూళ్ళి పడ్డాడతడు.

వికటంగా నవ్వుకుంటూ, విలాసంగా గుర్రాన్ని అద లిస్తూ వెళ్ళిపోయాడు ఆ ఆటవికుడు.

అక్కడ పనిచేస్తున్నంతసేపూ ఒకరితో, ఒకరు మాట్లాడుకోకూడదని.... మళ్ళీ మాటలతో వారికి చెప్ప

నవసరం లేకపోయింది.

కుండెలోని కోపాన్నీ, గొంతులోని సుఖాన్నీ, పళ్ళ బిగువున అణచుకొని, మెల్లగా పనికి ఉపక్రమించారు వారు.

సరిగ్గా సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చినంతవరకూ ఆగకుండా పనిచేశారు వారు. చమటతో వారి శరీరాలు తడిసి ముద్దలయిపోయాయి.

ఒక ఆటవికుడు కొమ్మూబూరా ఊదగానే అందరూ పనిని ఆపి గట్టున ఉన్న చెట్ల నీడను చేరారు. పెద్ద, పెద్ద రాతి బానలలో వున్న మంచినీళ్ళతో ముఖమూ, చేతులూ కడుక్కున్నారు. మండుతున్న ఎండలో మాడి పోయిన వారి దేహాలకు చన్నీళ్ళు తగలగానే ప్రాణం లేచివచ్చినట్టయింది.

చిన్న, చిన్న మట్టిపాత్రాలలో రెండేసి ముండిన జొన్నరొట్టెలూ, ఇంత బార్లీ జావ, ఇన్ని ఉడకబెట్టిన యేవో అడవిదుంపలూ వేసి ఆ అమెరికన్ యువకులకు అందించారు ఆ ఆటవికులు.

ఆకలి రుచి ఎరుగదంటారు. ఆ నికృష్ట ఆహారాన్నే ఆత్రంగా, ఆబగా తినసాగారు ఆ మెరికన్ యువకులు.

వారి ఎదురుగానే కూర్చుని బాగా వ్రేల్చిన అడవి కోడిమాంసాన్నీ, తేనెలో ముంచిన బెర్రీపండ్లను లొట్టలు వేసుకుంటూ తినసాగారు ఆ ఆటవికులు.

భోజనం పూర్తి అయినాక, కేవలం ఒక్క అరగంట మాత్రం విశ్రాంతి యివ్వబడింది వారికి. ఆ తరువాత మళ్ళీ సూర్యాస్తమయం వరకూ వంచిన నడుం యెత్తకుండా పొలంలోపడి పనిచేయడమే.

సాయంత్రం మళ్ళీ మామూలుగా వారిని ముందు

రోజా బంధించిన గోతిలోకి చేర్చారు.

అలా రెండు రోజులు గడిచేసరికి వారికి పిచ్చెక్కినట్లయింది. బానిసలలా ఇలాంటి నికృష్టపు బ్రతుకు గడిపే కన్నా ఒక్కసారి చావడం మేలనిపించింది గోవర్ కు. అన్నింటినీ మించి తమ ఈ దుస్థితికి కారణం తన ఆవేశమే అన్న ఆలోచన అతడిని మరింత కృంగదీయసాగింది.

వారిద్దరిలో లాంబ్ కాస్త ఆలోచనాపరుడు. అతడు సమయం కోసం ఎదురుచూస్తున్నాడు.

# 6

మూడవనాటి అర్థరాత్రి....

అంతవరకూ పడుకున్నట్లు నిద్రనటిస్తున్న లాంబ్ మెల్లగా కళ్ళు తెరిచాడు. చుట్టూ పరకాయించి చూశాడు. అంతా నిశ్శబ్దంగా వుంది.

పది అడుగుల లోతున్న ఆ గోతిలో ఉంచబడ్డ ఆ ఖైదీలు యొక్కడికి తప్పించుకుపోతారులే అన్న నిర్లక్ష్యంతో కాపలాకు నియమింపబడ్డ ఆటవికులు ఆదమరచి నిద్రపోయారు.

లాంబ్ నెమ్మదిగా గోవర్ ను తట్టిలేపాడు. ఆశ్చర్యంతో తనవంక చూస్తున్న గోవర్ ను మాట్లాడవద్దని సైగచేశాడు. తన మెడలోని అడవి తీగెల హారాన్ని పైకితీశాడు. అరంగుళాల పొడవున్న దృఢమైన కర్ర ముక్కలు బలమైన ఆ అడవితీగలో అక్కడక్కడా జొనిపి వున్నాయి. ఆ కర్రముక్కలు ఒక కొన సూదిగా చెక్కబడ్డాయి.

బుల్లెట్స్ తో కూడిన చైన్ లా వుంది ఆ హారం. ఆ రోజు మధ్యాహ్నం ఆ హారాన్ని వేసుకున్న లాంబ్ ను

చూసి, పిచ్చివాణ్ని చూసినట్లు హేళనగా నవ్వారు ఆ ఆటవికులు.

కాని, గత రెండు రోజులుగా లాంబ్ ఆ కర్ర ముక్కలను సేకరించి ఆ దృఢమైన హారాన్ని తయారు చేసే ప్రయత్నంలో వున్నాడనీ, ఆ హారంసాయంతోనే ఆ రాత్రి ఆ గోతిలోనుండి తప్పించుకొనే ప్రయత్నం చేస్తాడనీ యేమాత్రం ఊహించినా ఆ ఆటవికులు లాంబ్‌ను అక్కడి కక్కడే పోగులు పెట్టేవారు.

లాంబ్ ఆ కర్రముక్కలను హారంనుండి పైకితీశాడు. గోతియొక్క గోడకు చేసిన రంధ్రాలలో ఆ ముక్కలను బలంగా జొనిపాడు.

గత రెండు రోజులుగా రాత్రులందు.... ఆ గోతిలోని గోడకు లాంబ్ సన్నగా ఉలిలా వున్న రాతిముక్కతో రంధ్రాలు చేస్తుంటే యెందుకో అనుకున్నాడు గోవర్.

గోతిలో నిలువుగా రెండు వరుసలలో కర్రలను ఫిక్స్ చేసేసరికి లాంబ్ చెమటతో పూర్తిగా తడిసిపోయాడు. తరువాత అడవితీగను ఒక కర్రముక్క కొసకు ముడివేసి, రెండు కర్రముక్కల వరుసలనూ కలుపుకుంటూ చుట్టుకుంటూ పోయాడు.

నేలనుండి ఆరడుగుల వరకూ గోతిలో గోడకు... నిచ్చెనవేసినట్లు అమరింది ఆ త్రాటి అల్లిక. అంతవరకూ ముందు పైకి ఎగబ్రాకగలిగితే, మిగిలిన నాలుగు అడుగుల గోతి అంచునూ చేతికి పట్టుచిక్కించుకుని, పుల్ అప్స్ తీసినట్లు శరీరాన్ని గోతి బయటకు చేరవేయవచ్చు. అదీ లాంబ్ ఆలోచన.

లాంబ్ వంక ప్రశంసాపూర్వకంగా చూశాడు గోవర్. ముందుగా లాంబ్ నెమ్మదిగా ప్రాకుకుంటూ పైకి

యెక్కాడు. గోతిలోనుండి బయటపడ్డాక, చుట్టూ చూసి, కాపలా మనుషులు యింకా నిద్రపోతున్నారని ధృవపరచుకున్నాక గోవర్‌ను పైకిరమ్మని సైగ చేశాడు.

ఒక వేళ కాపలా కాస్తున్న ఆటవికులలో ఎవరైనా తెలివిమీద వుంటే....గోతిలోనుండి బయటకు రావడానికి ప్రయత్నిస్తున్న మొదటి వ్యక్తిమీదే ఎటాక్ చేస్తాడు. అందుకనే ఆ రిస్క్ యేదో తనే తీసుకోందామని....గోతిలోనుండి మొదట తనే వచ్చాడు లాంబ్.

అయితే, ప్రమాదం అతడూహించినట్లుగా కాక మరో వైపునుండి ఎదురయింది వారికి.

మొదట లాంబ్ ఎక్కుతున్నప్పుడే, అతడి బరువుకు కాస్త చితికివున్న అడవితీగ, గోవర్ మూడు అడుగులు పైకి యెక్కేసరికి తెగి ముక్కలయిపోయింది. నిస్సహాయంగా క్రిందకు జారిపోయాడతడు.

గోతిలో వుండిపోయిన మిత్రుని వంక ఆందోళనగా చూశాడు లాంబ్. వారికి ఏం చేయాలో తోచడంలేదు. బోనులో చిక్కిన పెద్దపులిలా గోతిలో తిరుగుతున్నాడు గోవర్.

ఒక్కొక్క క్షణం గడుస్తున్నకొద్దీ వారిలో టెన్షన్ పెరిగిపోసాగింది.

ఏదో ఒకటి చేయాలి. కాపలా వ్యక్తులకు తెలివి రాకముందే యేదో ఒకటిచేసి గోవర్‌ను తప్పించాలి.

లాంబ్ మస్తిష్కం చురుగ్గా పనిచేయ సాగింది. నిద్రపోతున్న ఒక ఆటవికుని ప్రక్కన పడివున్న పొడవైన ఈటెను చూడగానే అతడి మెదడులో యేదో మెరుపు మెరిసినట్లయింది.

సుమారు తొమ్మిది అడుగుల పొడవుంది ఆ ఈటె.

నెమ్మదిగా ప్రాకుతుంటూ వెళ్ళి చప్పుడు చేయకుండా ఆ ఈటెను పట్టుకువచ్చాడు లాంబ్.

గోతిలో ఆత్రంగా యెదురుచూస్తున్న గోవర్‌కు ఆ ఈటెను అందించి, ఆ తరువాత ఏం చేయాలో సైగలతో చెప్పాడు. అతడు చెప్పినది అర్థమయ్యేసరికి ఆశ్చర్యంతో గోవర్ కళ్ళు పెద్దవయ్యాయి.

లాంబ్ చెప్పినది చాలా రిస్క్‌తో కూడిన ఫీట్. కాని ఆ గోతిలోనుండి బయటపడటానికి వారికి మరో మార్గం కనిపించలేదు. ఈటెను చేతిలోనికి తీసుకొని గోతియొక్క చివరకు నడిచాడు గోవర్.

అతడు కాలేజ్ రేస్‌లో పోల్‌వాల్టు జంప్‌లో ఫస్టు. తొమ్మిది అడుగుల కర్ర సాయంతో పన్నెండడుగుల గోడను దూకడం అతడికి కష్టమైన పనేమీ కాదు. అదీ గాక ఆ గోతి ఎత్తు కేవలం పది అడుగులే.

అయితే యిక్కడ రెండు సమస్యలు వున్నాయి.

మొదటిది పోల్‌వాల్టు జంప్‌కు ముందుగా పరుగెత్తడానికి స్థలం వుండాలి. యిక్కడ గోతి పొడవు కేవలం పన్నెండు అడుగులే వుంది. ఆ పన్నెండు అడుగుల స్థలంలోనే పరుగెత్తడం, ఈటెను ఏటవాలుగా భూమిలోనికి జొనపడం, ఆ ఆధారంతో గాలిలోకి లేచి సరిగ్గా గట్టు మీదకు దూకడం, ఇవన్నీ మాటలతో చెప్పినంత సులభం కాదు, చేసి చూపించడం.

యిక రెండవది: గట్టుమీద దూకేటప్పుడు ఏమాత్రం చప్పుడయినా కాపలా మనుషులు లేస్తారు. దానితో ఇంత శ్రమా బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది.

అలా చప్పుడు కాకుండా వుండాలంటే గోవర్ గట్టు మీదకు దూకకముందే గాలిలోనే లాంబ్ అతడిని పట్టు

కోవాలి. అదే సమయంలో క్రిందపడి శబ్దం చేయకుండా ఈ పెన్ కూడా పట్టుకోవాలి.

సర్కస్ ఫీట్ కంటేకూడా కష్టతరమైన ఈ ప్రయత్నం వారిద్దరికీ కూడా అగ్నిపరీక్ష వంటిదే. వారిద్దరూ ఒకరినొకరు ఒక్కక్షణంపాటు చూసుకున్నారు. ఆత్మవిశ్వాసాన్నంతా కూడదీసుకొని తమ, తమ స్థానాల్లో నిలుచున్నారు.

లాంబ్ నిలుచున్న స్థలాన్ని, తన పొజిషన్ని తమ మధ్య దూరాన్ని, మనసులోనే అంచనా వేసుకున్నాడు గోవర్. రెండు చేతులనూ ముందుకుచాచి సిద్ధంగా నిలబడ్డాడు లాంబ్.

రేకలా గోవర్ ముందుకు కదలి, గాలిలోనికి లేవడం అతడిని లాంబ్ ఒడిసి పట్టుకోవడం.... అంతా ఒక్కక్షణంలో జరిగిపోయింది. గుండెలమీదనుండి కొండంత బరువు క్రిందకు దిగినట్లు ఫీలయ్యారు వారు.

నెమ్మదిగా చీకటిలో అడుగులు వేస్తూ చెట్లచాటుకు జారిపోయారు వారు. తమ అడుగుల చప్పుడు కాపలా వ్యక్తులకు వినిపించనంత దూరం వచ్చేశామని నిర్ధారణ చేసుకున్నాక వారు పరుగెత్తడం ప్రారంభించారు

ముళ్ళకంపలు గీసుకుంటూ చర్మాన్ని చీలుస్తున్నా, రాళ్ళు తగిలి, కాలి వేళ్ళు చితికి రక్తాలు కారుతున్నా, ఆయాసంతో గుండెలు ఎగిసి, ఎగిసి పడుతున్నా, వారు పరుగెత్తడం మానలేదు.

పరుగు ఆపడమంటే ప్రాణాలమీదకు కొని తెచ్చుకోవడమేనని తెలియని పిచ్చివాళ్ళుకారు వారు.

సూర్యోదయం అవుతూండగానే వారు తప్పించుకున్నారన్న వార్త ఆటవిక గూడెంలో దావానలంలా

వ్యాపించింది. వెంటనే పదిమంది ఆటవికులు రెండు జట్లుగా విడిపోయి వారికోసం అన్వేషణ ప్రారంభించారు.

# 7

సూర్యోదయమయ్యే సమయానికి ఆ దీవి ఒడ్డుకు చేరుకున్నారు వారు. కేవలం పది, పదిహేను అడుగుల దూరంలో వారికి నల్లని సముద్రపు పాయ కన్పిస్తూంది. ఒక ముళ్ళపొద చాటున కూర్చుని 'ఏం చేయాలా' అని ఆలోచిస్తున్నారు వారు.

"ఏం చేద్దాం లాంబ్? ఇక్కడ మనం ఆలోచిస్తూ కూర్చుంటే.... ఆ ఆటవికులు వచ్చేస్తారు."

"అదే ఆలోచిస్తున్నా గోవర్, ఈ సరికి మనం తప్పించుకున్నామన్న వార్త వారికి తెలిసిపోయే వుంటుంది. అంటే మనకోసం వెదకటం ప్రారంభమయ్యే వుంటుంది."

"అయితే ఏం చేద్దామంటావు?"

"చేయడానికైనా, మానడానికైనా మనకు ఒకటే మార్గం వుంది గోవర్."

గోవర్ అర్థంకానట్లు లాంబ్ వైపు చూశాడు. చిన్నగా నవ్వుతూ గోవర్ చేయిపట్టుకొని పైకిలేచాడు లాంబ్.

"ఈ కాలువగుండా గ్రుడ్డిగా ఈదుకుంటూ పోవడమే. మన అదృష్టం బాగుంటే ఈ దీవుల చక్రబంధంనుండి బయటపడవచ్చు కమాన్ ఫ్రెండ్."

వారు రెండు అడుగులు ముందుకు వేశారో లేదో 'తు.... ర్ .... ర్ ....' మంటూ వినవచ్చింది ఒక వికృత ధ్వని.

అంతే ...ఒకదాని తరువాత ఒకటిగా కొన్ని వందల పక్షులు అరచినట్లు ఆ వికృత ధ్వనులతో ఆ దీవి

మార్మోగిపోయింది.

అడుగు ముందుకు పడక శిలావిగ్రహాల్లా వుండిపోయారు వారు. తలపైకెత్తి ఆ ధ్వనులు వచ్చిన దిక్కుగా నిశితంగా చూశాడు లాంబ్.

ఏపుగా పెరిగిన చెట్లకొమ్మలమీద యేర్పరచబడ్డ మంచెలమీద నిలబడి వున్నారు కొందరు యువతులు. పెదవులమధ్య రెండు వేళ్ళనుపెట్టి ఆ విచిత్ర శబ్దాలను చేస్తున్న వారిని చూసేసరికి వారు ఈజిప్టు దేశానికి చెందిన ఆటవిక యువతులని అర్థమైపోయింది అతడికి.

"అంటే తన అంచనా తప్పుకాదన్నమాట" అనుకున్నాడతడు. అయితే అతడికి అర్థంకానిది ఒక్కటే.

'ఇన్ని విభిన్న దేశాలకు చెందిన ఆటవిక జాతులను ఒక్కటిగా కలిపింది ఎవరు? అసలు వారిని ఏ లక్ష్యంతో కలిపాడు!'

అతడి మనసు ఆలోచిస్తున్నా .... అతని కాళ్ళు మాత్రం చురుగ్గా సముద్రంవైపు పరుగెత్తాయి.

తమది విఫల యత్నమనీ, వారి కళ్ళబడ్డాక, యిక తాము దొరికిపోవడం తథ్యమనీ వారికి తెలుసు. కాని యింకా యేదో చిన్న ఆశతో వారు తమ ప్రయత్నాన్ని కొనసాగిస్తున్నారు.

వారు నీటిలో దుమికి పెద్ద, పెద్ద బారలువేస్తూ ఈద సాగారు. కేవలం ఒక్క ఫర్లాంగు దూరం ఈదుకుంటూ పోయివుంటారు వారు. అంతే!

ఒక్కసారి చుట్టూ చూసిన వారిలో చెప్పలేని నిస్పృహ చోటుచేసుకుంది.

"వుయ్ ఆర్ ఫినిష్డ్ ఫ్రెండ్" అన్నాడు లాంబ్ గోవన్ వంక బాధగా చూస్తూ.

నాలుగు ప్రక్కలనుండి ఒక్కసారి పదిమంది ఆట వికులు సముద్రంలోనుండి తేలివచ్చారు. కొన్ని క్షణాలలో వారిని చుట్టుముట్టారు.

వారిని బందీలనుచేసి వెనక్కు తీసుకొనిపోయారు. అయితే ఈసారి మొదటి ఆటవిక గూడేనికిగాక వేరే ప్రదేశానికి తీసుకొనిపోయారు.

# 8

అది....ఆటవిక రాజదర్బారు.

రాతి పలకలను పేర్చి చేయబడ్డ ఎత్తయిన వేదిక. దానిమీద రాతితో నేచేయబడ్డ ఎత్తయిన పీఠం. ఆ పీఠంపైన అరవై యేళ్ళ వృద్ధుడు కూర్చొని వున్నాడు. నడుముకు లేడి చర్మంతో చేసిన గౌనులాంటిది ధరించాడు. పూసల పేర్లు, ముఖాన బొట్లూ అన్నీ మిగిలిన ఆటవికుల లాగానే వున్నాయి. తలపై మాత్రం పక్షి ఈకలతో చేసిన కిరీటంలాంటిది ధరించాడు.

"బహుశా....అతడు ఆటవికుల నాయకుడు అయి వుంటాడు" అనుకున్నారు వారు.

అతడు చేయి సైగ చేయగానే, గోవర్, లాంబ్ లను ఆ సభలో ప్రవేశపెట్టిన ఆటవికుడు....వారి భాషలో యేదో చెప్పాడు.

చుట్టూ పేర్చబడ్డ రాతిపలకలమీద కూర్చున్న ఆట వికులు కళ్ళు విప్పార్చుకుని వినసాగారు.

"తాము తప్పించుకున్న విధానం నాయకుడికి చెబు తున్నాడని" ఊహించారు వారు.

రోటిలో తలపెట్టాక రోకటిపోటుకు భయపడటం యెందుకన్నట్లు నిర్భయంగా నిలబడ్డారు వారు.

నాయకుడు వారి వంక చూస్తూ చిన్నగా తల పంకిం

చాడు. అతడు చేసైగ చేయగానే పదిమంది యువతులు ముందుకు వచ్చారు. వివిధ దేశాలకు చెందిన వారు.

వారు ఒక్కొక్కరు తమ మెడలోని పూసల దండను తీసి ఒక రాతి ఫలకంమీద వుంచారు. ఒక ఈజిప్టు యువతి తన మెడలోని పూసలదండను రాతిఫలకంమీద వుంచుతూ లాంబ్ వైపు చూసి కన్నులను అరమోడ్చింది.

ఆమె యెందుకు సైగ చేసిందో అర్థంకాలేదు అతడికి. కాని అప్రయత్నంగానే ఆ పూసల దండను మాత్రం గుర్తుపెట్టుకున్నాడతడు. అది తెల్లని పూసలతో చేసిన దండ.

ఆ యువతు లందరూ తమ దండలను అక్కడ వుంచాక, ఒక ఆటవికుడు వచ్చి గోవర్ నూ, లాంబ్ నూ వాటిలో చెరి ఒక దండ తీసుకొమ్మని సైగ చేసి చెప్పాడు.

తమకు యేదో కఠిన శిక్షపడుతుందని భావించారు వారు. కాని ఈ పూసల దండల భాగోతం యేమిటో వారికి అర్థం కాలేదు.

అయినా వారు చెప్పాక తప్పదు కాబట్టి చెరి ఒక దండనూ తీసి పట్టుకున్నారు. లాంబ్ చేతిలోని తెల్ల పూసల దండనుచూసి ఆ ఈజిప్టు యువతి కళ్ళు విచిత్రంగా మెరిశాయి.

వారిద్దరినీ చెరి ఒక గుడిసెలోనికి చేర్చి తలుపులు మూశారు ఆ ఆటవికులు.

చీకటి పడ్డదాకా వారి గురించి పట్టించుకున్నవారే లేకపోయారు. మధ్యాహ్నం మాత్రం యేదో యింత ఆహారం వారికి అందించబడింది.

ఆ గుడిసెలలో ప్రవేశించినప్పుడే వారు వాటికి యేర్పాటు చేయబడ్డ కట్టుదిట్టమైన కాపలాను గమనిం

వారు. యిక తప్పించుకోవడం అసాధ్యమని తెలుసు వారికి.

అందులో ఇప్పుడు ఇద్దరూ ఒక్కచోట లేరు కూడానూ. అందుకే దేవునిమీద భారం వేసి, క్షణాలు లెక్కపెడుతూ కూర్చున్నారు వారు.

సరిగ్గా చంద్రోదయమయ్యే సమయానికి తలుపు తోసుకుంటూ లోపలకు ప్రవేశించింది ఆ ఈజిప్టు యువతి. ఆమెను చూడగానే ఉత్సాహంగా లేచాడు లాంబ్.

ఏదో అడగబోతున్న అతడిని మాట్లాడవద్దని కళ్ళతోనే వారించింది ఆమె. చేతిలోని బుట్టలోని పళ్ళను చూపిస్తూ తినమన్నట్లు సైగ చేసింది. ఆ బుట్టలోనే చిన్న రాతిగిన్నెలో ఉన్న పాలను త్రాగబోయాడు లాంబ్. వద్దన్నట్లు సైగ చేసిందామె.

ఆమె సంజ్ఞను అర్థంచేసుకొని, వాటిని త్రాగినట్లు నటించాడు అతడు. లాంబ్‌ను చేయిపట్టుకొని ఆ గుడిసెలో ఒక మూలనున్న మంచంపైకు తీసుకువెళ్ళిందామె. తనను కౌగలించుకొమ్మన్నట్లు సైగ చేసింది.

ఎందుకో ఆ యువతి ముఖం చూస్తుంటే తనకు మేలే చేస్తుంది అనిపించింది అతనికి. అందుకే మారు మాట్లాడకుండా ఆమె చెప్పినట్లు చేయసాగాడు.

కొన్ని క్షణాలలో వారిద్దరూ నగ్నంగా తయారయ్యారు. ఒకరినొకరు పాముల్లా అల్లుకుపోయారు. ముందుగా నటన అని ప్రారంభించినా, నిండుగా, బలంగా తన శరీరానికి తాకుతున్న ఆమె అవయవాల స్పర్శకు అతడిలో కోరిక సన్నగా రేగసాగింది.

పట్టలేని తమకంతో ఆమె ఎర్రని పెదవులను గాఢంగా ముద్దుపెట్టుకున్నాడతడు. కోరికతో కన్నులు అరమోడ్పు

లవుతుంటే లతలా అతడిని అల్లుకుపోయిందామె.

ఎన్ని క్షణాలు అలా తీయగా దొర్లిపోయాయో! ఏయే మధుర లోకాల్లో వారు విహరించివచ్చారో.

రసకేళిలో అలసిన అతడు ఆమె నిండయిన గుండెల మధ్య తల వాల్చి సేద తీర్చుకోసాగాడు. చెదిరిన అతడి ముంగురులను సవరిస్తూ అతడి తలను ప్రేమగా తన గుండెలకు హత్తుకుంది ఆమె.

అదే సమయంలో ఒక శ్రావ్యమైన నాదం విన వచ్చింది వారికి. ఎవరో ఒక సన్నని తీగెను కొన గోటితో మీటుతున్న ధ్వని 'ట్రింగ్ .... ట్రింగ్ ....' మంటూ ఒకే రిథమ్‌లో వినబడసాగింది.

లాంబ్ మెదడు మెల్ల మెల్లగా ఆ ధ్వని తరంగాల వైపు ఆకర్షితమవ్వసాగింది. అదే క్షణంలో ఆ యువతి ఆటవిక భాషలో యేదో అనసాగింది.

లాంబ్ తల మొద్దుబారసాగింది. కొన్ని క్షణాల తరువాత ఆ నాదం ఆగిపోయింది. ఆ యువతి మంచం దిగి గుడిసె బయటకు వెళ్ళి, మళ్ళీ లోపలకు వచ్చింది.

## 9

"అమ్మయ్యా! వాళ్ళు వెళ్ళిపోయారు" అంది ఆమె తేలిగ్గా నిట్టూరుస్తూ.

ఆమె మాటలను వింటూనే ఉలిక్కిపడ్డాడు లాంబ్. అప్పుడామె మాట్లాడినది ఆటవిక భాష కాదు. కొంచెం యాసతో కూడిన ఇంగ్లీషు.

తన వంక ఆశ్చర్యంగా చూస్తున్న లాంబ్‌ను చూసి చిన్నగా నవ్విందామె.

"నాకు ఇంగ్లీషు వచ్చు."

ఇంకా ఆమె వంక నమ్మలేనట్లే చూడసాగాడతడు.

ఆమె మెల్లగా నడిచి వచ్చి లాంబ్ ప్రక్కనే మంచం మీద కూర్చుంది.

"జన్మతః ఈజిప్టు దేశీయులమైనా, నేను చిన్నతనం నుండీ పెరిగిందీ, చదువుకున్నదీ ఇంగ్లాండ్‌లోనే. మా నాన్నగారు గొప్ప పేరుమోసిన ప్రకృతి వైద్యుడు. డాక్టర్ మోజస్ పేరు చెబితే లండన్‌లో తెలియని వారు లేరు.

ఆయన యెప్పుడూ మూలికలతోనూ, ఆకు పసరుల తోనూ యేవో ప్రయోగాలు చేస్తూ ఉండేవారు.

ఒకరోజు ఉన్నట్లుండి నన్ను తీసుకొని దోనాన్ దీవులకు ప్రయాణమయ్యారు. తన పరిశోధనకు కావలసిన అద్భుతమైన కొన్ని మూలికలు దోనాన్ దీవులలో లభించే అవకాశం వుందట.

మేము మొదటగా ఫాదర్ గ్రాహాంపాల్‌ను కలుసు కున్నాం. మా నాన్నగారి కోరిక విన్నవెంటనే ఆయన యెంతో కలవరపడ్డారు.

"డాక్టర్ మోజస్! మీరు అనుకుంటున్నట్లుగా దోనాన్ దీవులు ప్రకృతి ప్రసాదించిన దివ్యౌషధాలకు నిలయాలు కావు. అవి....మనుష్యుల ప్రాణాలను పొట్టను పెట్టుకొనే రాక్షస దీవులు."

అంటూ ఆ దీవులకు వెళ్ళవద్దని మా నాన్నగారిని యెంతగానో వారించారు ఫాదర్ పాల్.

కాని, మా నాన్నగారు తన మొండి పట్టుదలను విడువలేదు. తను చేస్తున్న పరిశోధన యేమిటో చెప్పే సరికి, ఫాదర్ పాల్ మారు మాట్లాడలేకపోయారు."

"ఏమిటా పరిశోధన" ఆత్రంగా అడిగాడు లాంబ్.

"ఫాదర్ పాల్ కూడా అచ్చం నీలాగే ప్రశ్నించారు"

అంది ఆమె నవ్వుతూ. ఒక్క క్షణం ఆగి మళ్ళీ చెప్పడం ప్రారంభించింది ఆమె.

“అది వశీకరణ విద్య. మన ఆధునికులం ఈ రోజు బ్రెయిన్ వాష్ అంటున్నాం. ప్రాచీన ఈజిప్టు గ్రంథాలలో ఎక్కడో ఈ వశీకరణ శక్తిని ప్రసాదించే రససిద్ధి గురించి చదివారట మా నాన్నగారు. అప్పటినుండి ఆ రససిద్ధి కోసం అహోరాత్రాలూ శ్రమించసాగారు ఆయన.

తానొకటి తలిస్తే, దైవమొకటి తలుస్తాడంటారు. దోనాన్ దీవులలోనికి మూలికల సేకరణకోసం వెళ్ళిన మేము సముద్రపు దొంగలయిన ఈ ఆటవికుల చేతికి చిక్కాం.”

“సముద్రపు దొంగలా!” ఆశ్చర్యంగా అడిగాడతను.

‘ఈమాత్రం ఊహించలేదా!’ అన్నట్లు లాంబ్ వంక విచిత్రంగా చూసిందామె.

“మరి! దోనాన్ దీవుల సమీపంలోనికి వచ్చిన ఓడలలోని సరకులనూ, మనుష్యులనూ మాయం చేస్తున్నది ఎవరనుకున్నావు?” అంది ఆమె లాంబ్ వంక సూటిగా చూస్తూ.

“సరకులను దొంగిలించారంటే అర్థముంది. మరి మనుష్యులను ఎందుకు కిడ్నాప్ చేస్తున్నట్లు....?”

ఓహో! హెరాయిన్ పండించడానికి, వారికి బానిసలలా పనిచేసే కూలీలు కావాలి కదూ!

ఒక్కొక్క సందేహం మంచు తెరలా విడిపోతున్నట్లుగా అనిపించసాగింది లాంబ్ కు.

అడవిలో ఎండుటాకులమీద అడుగుల చప్పుడు వినబడకుండా, మృగాలను వేటాడగలిగే ఆటవికులకు, చడీ

చప్పుడు చేయకుండా ఓడలోని సరకులను, మనుష్యులనూ మాయం చేయటం ఒక లెక్కలోని విషయం కాదు.

కాకుంటే ముందుజాగ్రత్త కోసం షిప్‌లోని జనరేటర్‌ను ముందుగా ఆపేస్తున్నారన్నమాట. నీటిలో తేలి చీకటిలో తమ పనిని చక్కగా చక్కబెట్టుకుని తిరిగి నీటిలోకి వెళ్ళిపోతున్నారు.

అయితే....కొండల్లో, కోనల్లో హాయిగా, స్వేచ్ఛగా బ్రతికే ఈ కొండజాతివారు, నాగరిక ప్రపంచంమీద చేస్తున్న ఈ దాడులన్నీ తమ స్వబుద్ధితోనే చేస్తున్నారంటే అది నమ్మశక్యం కాని విషయం.

వారి వెనుక, వారిని నడుపుతున్న యేదో నాగరిక హస్తం వుండితీరాలి.

'ఎవరు....? ఎవరా నాగరిక రాక్షసుడు....?'

ఉన్నట్లుండి యేదో తీవ్రాలోచనలో మునిగిపోయిన లాంబ్ భుజాలను పట్టుకొని కుదిపింది ఆమె.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"అహాఁ....ఏం లేదు" అన్నాడు లాంబ్ సరిగ్గా సర్దుకుని కూర్చుంటూ.

"అన్నట్లు, ఇంతకూ మీ నాన్నగారు ఆ వశీకరణ శక్తిని సాధించారో, లేదో చెప్పనే లేదు" అన్నాడతడు ఆమె వంక సాలోచనగా చూస్తూ.

"సాధించారు కదా" అంది ఆమె చక్రాల్లాంటి కళ్ళను గుండ్రంగా త్రిప్పుతూ.

"మమ్మల్ని బంధించిన ఆ ఆటవికులు మా నాన్నగారిని ఆ వశీకరణ రసాన్ని కనిపెట్టమనీ, లేకుంటే నన్ను చంపేస్తామనీ బెదిరించారు.

నాకోసం, నా ప్రాణాలను కాపాడటంకోసం.... మా నాన్నగారు నిద్రాహారాలు మాని మరీ శ్రమించారు. చివరకు యెలాగైతే నేం — ఆ రససిద్ధిని సాధించారు.

"ఆ రసాన్ని నేనొకసారి చూడటానికి వీలు అవుతుందా?" అన్నాడు లాంబ్ ఆత్రంగా.

"ఎందుకు కాదు?"

"ఎప్పుడు?"

"ఎప్పుడు కావాలంటే అప్పుడు. కా వా ల ం టే ఇక్కడే.... ఈ క్షణమే."

లాంబ్ నమ్మలేనట్లు చూశాడు ఆమె వంక. ఆమె మెల్లగా మంచంమీదనుండి లేచింది. వడుచుకుంటూ వెళ్ళి, ఇంతకు క్రితం లాంబ్‌ను త్రాగవద్దని వారించిన రాతి చిప్పలోని పాలలాంటి ద్రవాన్ని తీసుకు వచ్చి అతడికి చూపింది.

"ఇదా!" ఆశ్చర్యంగా అన్నాడతడు.

"ఆం....ఇదే! ఎన్నో అద్భుతమైన మూలికల మిశ్రమం ఇది.

కామంటే ఈ మూలికా రసాన్ని సేవించిన కొద్ది క్షణాలలో ఆ సేవించిన మనిషిలో విపరీతమైన కామం బయలుదేరుతుంది.

వారు వెంటనే స్త్రీ సంభోగంలో పాల్గొనాలి. లేకుంటే కోరికతో పురి ఎక్కిన నరాలు మరింత ఉత్తేజితమై మెదడులోని రక్తనాళాలు చిట్లి, వారికి మరణమే సంభవిస్తుంది.

అలా ఆ స్త్రీ పురుషులు మైథున క్రీడలో మునిగి ఉన్నప్పుడు, చాటునుండి సన్నని తీగను మీటుతూ ఒక రకమైన ధ్వని ప్రకంపనాలను వారికి వినిపింపచేస్తారు.

మూలికారసం ప్రభావంచేత చైతన్యం కోల్పోయిన మెదడులోని పాత జ్ఞాపకాలన్నీ చెరిపివేయడానికి అదొక ప్రక్రియ.

అదే సమయంలో అతను సంభోగిస్తున్న స్త్రీ.... ఆటవిక భాషలో...మంద్ర స్వరంతో ఇలా చెబుతుంది.

'ఈ ప్రపంచంలో నీకు తెలిసింది నేను ఒక్కతె నే. నీవు చేసేదీ, చూసేదీ, బ్రతికేదీ.... ఈ క్షణంనుండీ అంతా నాకోసమే. నీవు నా దాసుడివి. బానిసవు. నేను ఏం చెప్పినా, మారుమాట్లాడకుండా నీవు ఆచరిస్తావు, ఆచరిస్తావు, ఆచరిస్తావు.'

ఇలా ఈ తతంగమంతా వరుసగా మూడు రాత్రులు జరుగుతుంది. నాలుగవనాటి ఉదయం నుండీ ఆ వ్యక్తి ఆమెకు పూర్తిగా బానిసైపోతాడు."

ఆమె చెప్పినదంతా వినేసరికి అంత రాత్రిలో కూడా అతడి నుదుట చెమట పట్టింది.

"అంటే....బందీలుగా తెచ్చిన నాగరికులందరినీ ఈ వశీకరణ విద్యతో బానిసలుగా మారుస్తారన్నమాట."

లాంబ్ మాటలకు....ఆమె తల అడ్డంగా ఊపింది.

"ఉహుం....కారు. అందరిమీదా ఆ విద్యను ప్రయోగించరు. ముందుగా బందీలను గంజాయి తోటల్లో పనికి నియమిస్తారు. అక్కడ జీవచ్ఛవాల్లా పడివుంటూ, సజావుగా పని చేసుకుపోయినంతవరకూ వారి జోలిపట్టరు.

కాని, వాలా యెవరైనా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తే, వారిని ఈ వశీకరణ శక్తిద్వారా బానిసలుగా మారుస్తారు."

"అంటే....రాత్రి....ఆమె స్థానంలో మరొక స్త్రీ ఉండివుంటే ఈపాటికి తనుకూడా ఆ వశీకరణ శక్తికి

బానిసై వుండేవాడన్నమాట" అనుకున్నా డతడు.

ఆమె కంక కృతజ్ఞతగా చూశాడు లాంబ్.

"ఎందుకు నన్ను రక్షించావు?" అతడి గొంతు ఆర్ద్రంగా పలికింది.

"ఎందుకో నిన్ను చూశాక, నీవు తప్పించుకోవడానికి చేసిన ప్రయత్నం గురించి విన్నాక....నిన్ను రక్షించాలని పించింది.

బహుశా....నన్నూ, మా నాన్నగారిని ఈ రాక్షసుల బారినుండి నీవు రక్షించగలవేమోనన్న ఆశతో నేమో!"

ఆమె అరచేతిని ప్రేమగా తన చెక్కిలికి ఆనించు కున్నాడతడు.

ఇద్దరు యువతీ, యువకుల మధ్య, ప్రేమ ఎందుకు జనిస్తుందో. ఎక్కడ మొదలవుతుందో చెప్పలేమనడానికి వారి జంటే ఒక ప్రత్యక్ష సాక్ష్యం.

వారి మధ్య పరిచయం అయి కొన్ని గంటలుకూడా కాలేదు. అది ఆకర్షణ కాదు. పోనీ, కామం అందా మంటే అది కొన్ని క్షణాల క్రితమే చాలా యాంత్రి కంగా వాళ్ళ మధ్య జరిగిపోయింది.

అతడిని రక్షించడం కోసం ఆమె తన శరీరాన్ని అర్పించింది. నిజం తెలిశాక అతడు ఆమెకు తన మనసునే అర్పిస్తున్నాడు.

"నీ పేరు....?" ఆమె కళ్ళలోనికి చూస్తూ అన్నా డతడు.

"ఇప్పుడా అడగటం?" అంది ఆమె కొంటెగా నవ్వుతూ.

"నా దానవని తెలిసింది ఇప్పుడేగా" అన్నాడు లాంబ్ మరింత చిలిపిగా.

ఆమె సిగ్గుతో తల దించుకుంది.

అతడి ఎదుట అర్థనగ్నంగా తిరుగాడినప్పుడు రాని సిగ్గు, అతనితో ఆ తీయని అనుభవాన్ని పంచుకున్నప్పుడు రాని సిగ్గు....

'నా దానివి' అన్న అతడి మాట విన్న వెంటనే సిగ్గు ఆమెను నిలువెల్లా ముంచెత్తింది.

"నీ....రా...." అంది ఆమె నెమ్మదిగా ఒక్కొక్క అక్షరాన్నీ ఒత్తి పలుకుతూ.

ఆమెను ప్రేమగా కౌగిలిలోనికి తీసుకున్నాడు. పెదవులతో సుతిమెత్తగా ఆమె చెక్కిలిపై వ్రాస్తూ మత్తుగా యిలా అన్నాడతడు.

"నీరా....ఐ లవ్ యూ."

"ఐ....టూ....లాంబ్" అంటూ అతడిని లతలా పెనవేసుకుపోయింది ఆమె.

# 10

నాల్గవ రోజు ఉదయం....గోవర్, లాంబ్ నాయకుని ముందు హాజరు పర్చబడ్డారు. ఓరకంటితో గోవర్ వంక చూశాడు లాంబ్.

నిరాసక్తంగా శూన్యంలోనికి చూస్తున్నాడు గోవర్. అతడి కళ్ళు నిస్తేజంగా వున్నాయి.

"హా! గోవర్ వారి వశీకరణ శక్తికి లోబడిపోయాడన్నమాట" అనుకున్నాడు లాంబ్.

మరుక్షణం అతడుకూడా నిరాసక్తంగా శూన్యాంలోనికి చూడసాగాడు. వారిద్దరినీ చూసిన నాయకుడు సంతృప్తిగా తలాడించాడు.

ఆ ఆటవిక స్త్రీలు సైగచేయగానే గోవర్, లాంబ్ ఆ నాయకుడికి సాష్టాంగపడి నమస్కరించాడు.

పట్టలేని ఆనందంతో పగలబడి నవ్వాడు ఆ నాయకుడు.

"సింహాలలాంటి యువకులు ఆ మందు దెబ్బకు చిట్టెలుకలయిపోయారు" అనుకున్నా డతడు మీసం మెలివేస్తూ.

నాయకుడు చేసైగ చేయగానే వారిద్దరినీ అక్కడి నుండి తీసుకుపోయారు. ఆ క్షణంనుండీ వారి దినచర్య పూర్తిగా మారిపోయింది.

వారిని స్వేచ్ఛగా వదిలేశారు ఆ ఆటవికులు. గత జీవితాన్ని పూర్తిగా మరచిపోయి, పసిపాపల్లా వారేం చెబితే అది చేసే స్థితిలో వుండే ఆ నాగరిక యువకులు యెక్కడికీ పోలేరనీ వారికి తెలుసు.

ప్రతిరోజూ వారిద్దరకూ, తమ ఆటవిక ఆయుధాలను ప్రయోగించటం, సముద్రంలో చప్పుడుకాకుండా ఈదడం, తాళ్ళసాయంతో షిప్ మాదిరిగా చేయబడ్డ ఒక పెద్ద చెక్క యింటిపై ఎగబ్రాకటం, అందులోని సామానులను, మనుష్యులను మోసుకుంటూ మళ్ళీ నీటిలోకి దిగటం....లాంటి విద్యలన్నీ నేర్పసాగారు ఆటవికులు. ఎ ట్రయినింగ్ ఫర్ పైరేట్స్.

తన అస్తిత్వాన్ని పూర్తిగా కోల్పోయిన గోవర్ వారు చెప్పినదంతా మారు మాట్లాడకుండా చేసేవాడు. కాని, అన్నీ తెలిసి, ఏమీ తెలియనట్లు నటించడం లాంబ్ కే యెంతో కష్టంగా వుంది.

ముఖ్యంగా తన ప్రాణ స్నేహితుడు గోవర్ తనతో ఎవరో పరాయివాడిలా ప్రవర్తించడం....అతడికి భరించలేనంత కష్టంగా వుంది.

కాని....కర్తవ్యం అతడిని వెన్ను తట్టేది.

'సమయం వచ్చేటంతవరకూ తను ఇలాగే నటించాలి. తప్పదు' అనుకునేవా డతడు.

కత్తిమీద సాములాంటి ఈ జీవితంలో అతనికి మనశ్శాంతి నిచ్చే ఆశాకిరణం....ఒక్క నీరాయే.

ప్రతిరోజూ రాత్రి నీరా అతని కుటీరానికి వచ్చేది. రాత్రి చాలా పొద్దుపోయేవరకూ వారు ఎన్నో విషయాలు మాట్లాడుకునేవారు. అవన్నీ ఆ రాక్షస దీవులనుండి బయటపడటం గురించే.

అయితే అది ఎంత కష్టతరమో అతడికి బాగా తెలుసు. తనూ, నీరా, ఎక్కడున్నాడో కూడా తెలియని ఆమె తండ్రిని వెతికి పట్టుకొని మతిలేని గోవర్న్‌ను తీసుకొని అంతుపట్టని ఆ దీవులనుండి బయటపడటమంటే

"అది సాధ్యమయ్యే పనేనా" అనిపించేది అతడికి. కాని, ఎక్కడో ఏదో ఆశ మిణుకు, మిణుకు మనేది.

## 11

ఆ రోజు ఆటవికుల దేవత జాతర.

చీకటి పడేకొద్దీ ఆ ద్వీపంలో కోలాహలం రెట్టింపయింది. ఆటవికులంతా రంగు, రంగుల పూసల హారాలనూ, పక్షి ఈకలను ధరించారు.

ఎండు సొరకాయ బుర్రలలో పులియబెట్టిన ద్రాక్ష సారాయిని చిత్తుగా త్రాగారు వారంతా. మత్తులో వారి శరీరాలు జోగుతున్నాయి. వారంతా దేవతా విగ్రహం వున్నచోటుకు చేరుకున్నారు.

పదిహేను అడుగుల ఎత్తు వుంటుంది ఆ దేవతా విగ్రహం. సింహం శరీరం, మనిషి తల. పక్షి రెక్కలతో చూడటానికి యెంతో విచిత్రంగా వుంది ఆ గ్రహం.

దానిముందు పెద్ద సెగడు వుంది. అందులోనుండి ఎర్రని మంటలు విరజిమ్ముతున్నాయి. ఎలుగుబంటి చర్మంతో చేసిన నల్లని అంగీని ధరించిన షామాను (పూజారి) ఆ మంట ముందు నిలబడి యేవో మంత్రాలను చదువుతున్నాడు.

లేడీ, దుప్పి, కణుజా, ఎనుబోతూ, అడవి గుర్రం ఇలా జాతి కొక్క జంతువు చొప్పున ఆ దేవతకు బలి యిచ్చారు. బలి పశువుల మెడలనుండి కారుతున్న రక్తాన్ని పెద్ద, పెద్ద రాతి చిప్పలలో పట్టి దానినే తీర్థంగా ఆ ఆటవికులకు పంచారు షామాను శిష్యులు.

ఆ తరువాత ఆ జంతు కళేబరాలను మండుతున్న ఆ సెగడులో వేశారు. కాలుతున్న మాంసం వాసన ఆ ప్రాంతాన్నంతా కమ్మేసింది.

షామాన్ తన చేతిలోని శంఖాన్ని గట్టిగా ఊదాడు. చర్మపు డోల్లూ, కొమ్ము బూరలూ ఒక్కసారిగా మ్రోగటం ప్రారంభించాయి.

కర్ణ కఠోరంగా విన్పిస్తున్న ఆ సంగీతానికి అనుగుణంగా మరింత వికృతంగా నాట్యం చేయసాగారు వారు. వారి చేతులలోని ఈటెలు ఒక్కసారిగా పైకి లేచాయి. నాట్యం చేస్తూనే వారు పరుగెత్తుకుంటూ వచ్చి ఆ సెగడును చుట్టుముట్టారు.

ముందుగా నాయకుడు తన చేతిలోని ఈటెను ఆ సెగడులో గ్రుచ్చాడు. మరుక్షణం, మిగిలినవారంతా తమ, తమ ఈటెలను ఆ మంటలో గ్రుచ్చారు.

మంటలో బాగా కాలి, వ్రేల్చి వున్న జంతువుల మాంసపు ఖండాలు వారి ఈటెలకు గ్రుచ్చుకున్నాయి ఆనందంగా అరుచుకుంటూ, ఆ కాలిన మాంసాన్ని

ఆబగా తినసాగారు.

కావల్సినంత మదిర .... మాంసం .... ప్రక్కనే మిస, మిసలాడుతున్న మగువలు .... ఇంకేం కావాలి వారికి. ఆ రాత్రంతా వారు అలా .... ఆడుతూ, పాడుతూ .... ఆనందంగా గడిపేస్తారు.

స్త్రీ, పురుషులు జంటలుగా ఏర్పడి నాట్యం చేయసాగారు. నీరా, లాంబ్ లు ఒక జంటగా ఏర్పడ్డారు. సారాయి మత్తులో అంతా తూలుతున్నారు.

తమను యెవరూ గమనించటం లేదని నిశ్చయించుకున్నాక వారు మెల్లగా చీకట్లోకి నడిచారు. ఒకవేళ యెవరైనా చూసినా "కోరికను ఆపుకోలేని జంటలే" అనుకుంటారు.

అక్కడనుండి బయటపడ్డాక వారు అడవిలో పరుగెత్తడం ప్రారంభించారు. వారి లక్ష్యం తప్పించుకుపారిపోవడం కాదు—నీరా తండ్రి డాక్టర్ మోహన్ ఉనికిని తెలుసుకోవడం.

రెండు రోజుల క్రితం ఇద్దరు ఆటవికులు మాట్లాడుకుంటున్న మాటలను ఆలకించాడు లాంబ్. నీరా పుణ్యమా అని అతడికీ కొంత ఆటవిక భాష వచ్చింది. ఆపైన రోజూ ఆటవికులు యిస్తున్న ట్రయినింగ్ అతడికి మరింత సహాకరించింది.

'ఆ దీవికి ఉత్తరాన అద్భుతమైన వన మూలికలు వున్నాయనీ, వాటి గాలి సోకితే అసలు రోగాలే రావని' అన్నాడొకడు.

'ఆ ప్రాంతం కేసు ఎత్తితే నాయకుడు తల తీయిస్తాడు. ఎక్కడయినా నోరు జారేవు జాగ్రత్త' అని మందలించాడు మరొకడు.

ఆటవికులకు కూడా తెలియకూడని ఆ రహస్య ప్రదేశంలోని ప్రత్యేకత ఏమిటి?

ఒకసారి మాటల సందర్భంలో నీరా అంది: 'వశీకరణ పసరును యెక్కడినుండో నాయకుడే తెస్తాడు. ఆ ప్రదేశం యెవ్వరికీ తెలియదు.'

నాయకుడు వశీకరణ పసరును తెచ్చే స్థలమూ, పరులెవరికీ తెలియకూడని ఉత్తర దిక్కులోని అద్భుత మూలికల వనమూ ఒక్కటే అయితే, నీరా తండ్రిని దాచిన స్థలమూ అదే అయి వుండాలి.

అందుకే వారు ఉత్తర దిక్కుగా వేగంగా పరుగెడుతున్నారు.

# 12

ఏపుగా ఎదిగిన ఆలివ్, ఓక్, సాల్ వృక్షాలూ, వాటి బ్రాన్ములకు ప్రాకిన చిత్ర, విచిత్రమైన లతలూ, చుట్టూ పొదలూ, లతా నికుంజాలూ ....ఎంతో మనోజ్ఞంగా వుంది ఆ ప్రదేశం.

ఆ వనం మధ్య నిర్మింపబడ్డ విశాలమైన కుటీరం ముందున్న పెద్ద బండపై కూర్చుని వున్నారు ఇద్దరు ఆటవికులు. వారికి దూరంగా గూడెంలో అమ్మవారి జాతరలో మ్రోగుతున్న చర్మపు డోళ్ళ శబ్దం వినిపిస్తూంది.

ఆ ఆనందంలో పాలు పంచుకోలేని తమ దురదృష్టానికి వగస్తున్నారు వారు.

"పనికిమాలిన ఈ కాపలా పని తగలకుంటే హాయిగా జాతరలో చిందు లేస్తూ వుండేవారం ఈపాటికి" బాధగా నిట్టూరుస్తూ అన్నాడొకడు.

అతడి వంక జాలిగా చూశాడు రెండవవాడు. డప్పుల మోత వింటున్న కొద్దీ....ఒక్కసారి జాతరను చూసి

రావాలన్న కోరిక క్షణ, క్షణానికీ వారిలో అధికం కాసాగింది.

అకస్మాత్తుగా వారిలో ఒకడికి అద్భుతమైన ఆలోచన వచ్చింది. మెరుస్తున్న కళ్ళతో తన సహచరుడ్ని చూశాడు.

"ఈ ముసలివాడ్ని కాపలా కాయడానికి ఇద్దరు యెందుకురా? నీ విక్కడే ఉండు. నేను వెళ్ళి ఒకసారి కన్నులారా జాతరను చూసి వస్తాను. నేను వచ్చాక నీవు జాతరకు వెళ్ళుదువు గాని, అప్పుడు నేను కాపలా ఉంటాను."

అతడి ఆలోచనకు ఆనందంగా తలూపాడు రెండవ వాడు. ఘొంకున మాకుకుంటూ అడవిలోనికి పరుగెత్తాడు.

అంతవరకూ ఒక పొద చాటున దాక్కుని, ఆ ఇద్దరు ఆటవికుల మాటలనూ ఆలకిస్తున్నారు లాంబ్, నీరా. లాంబ్ మస్తిష్కం చురుగ్గా పనిచేయసాగింది.

"మళ్ళీ ఆ ఆటవికుడు వచ్చేలోగానే తాము యేదో ఒకటి చేయాలి. వారి మాటలనుబట్టి డాక్టర్ మోజస్ వుంటున్నది ఈ కుటీరంలో నేనని తెలుస్తూంది."

సరిగ్గా రెండు నిమిషాల తరువాత అతడి మెదడుకు తట్టిందొక అద్భుతమైన ఆలోచన. ఒక్కసారి తన ఆకారం వంక చూసుకున్నాడు. జాతర సందర్భంగా అతడి శరీరం నిండా వింత, వింత రంగులను పులిమారు. మెడలో పూసల పేర్లూ, మొలకు కట్టుకున్న చిన్న చర్మపు గోచీ. అచ్చం ఆటవికుడిలాగానే వున్నాడతడు.

ఒక నిశ్చయానికి వచ్చినట్లు అతడు పొదల చాటు నుండి బయటకు నడిచాడు. కడుపును రెండు చేతులతో పట్టుకొని బాధగా అరుస్తూ....ఆ ఆటవికుడ్ని సమీ

పించాడు.

ఇప్పుడే వెళ్ళిన తన మిత్రుడు గోడవు కొట్టిన బంతిలా అప్పుడే వచ్చేశాడేమిటా అని ఆశ్చర్యపోయాడు. లాంబ్ ను తన సహచరుడిగానే భ్రమిస్తున్నాడతడు.

మోకాళ్ళమీద ముఖాన్ని దాచుకున్నాడు లాంబ్. గొంతులో బాధను కొనితెచ్చుకుంటూ మెల్లగా అన్నాడతడు.

"అకస్మాత్తుగా తనకు కడుపునొప్పి పట్టుకుందనీ, గూడెంవరకూ వెళ్ళలేనని తాను అక్కడ కాపలా ఉంటానని అతడిని జాతర చూడటానికి వెళ్ళమని" చెప్పాడు లాంబ్.

జాతరపట్ల ఆకర్షణ ఆ ఆటవికుడ్ని గ్రుడ్డివాణ్ని చేసింది. లాంబ్ మాటలను నమ్మి, మిత్రుని స్థితికి విచారిస్తూనే అతడు జాతరవైపు బయలుదేరాడు.

ఆ ఆటవికుడు కనుమరుగయ్యాక, నీరా పొదలలో నుండి పైకి వచ్చింది. వారిద్దరూ కలసి ఆ కుటీరాన్ని సమీపించారు.

జాతరను చూడటానికి వెళ్ళిన ఆటవికులు, ఒకరినొకరు చూసుకొని నిజాన్ని గ్రహించి, తిరిగి వచ్చేసరికి ఎంత లేదన్నా ఒక గంట పడుతుందని, ఆ గంటలోపలే తమ పని పూర్తిచేసుకోవాలనీ లాంబ్ కు తెలుసు.

నీరా మెల్లగా తలుపుతట్టి, తండ్రిని పిలిచింది. నిద్రపోతున్న మోజస్.... కూతురు గొంతు విని ఉలిక్కిపడి లేచాడు. ఒక్కక్షణంపాటు కలో....నిజమో అతడికి అర్థంకాలేదు.

కాని....తలుపు దగ్గర కూతురు స్వరం స్పష్టంగా వినిపిస్తూండేసరికి ఒక్క ఉదుటున పక్కమీదనుండి లేచి

తలుపులను తెరిచాడు. ఎదురుగా యువకో అపరిచిత యువకుని ప్రక్కన నిలబడి వున్న నీరాను చూసేసరికి ఆనందంతో అతడి కళ్ళు చెమర్చాయి.

"నాన్నా!" అని బావురుమంటూ తండ్రి గుండెలపై వ్రాలిపోయి వెక్కి వెక్కి యేడ్వసాగింది నీరా. ఆమె తల నిమురుతూ కొన్ని క్షణాలసేపు అలాగే వుండిపోయాడతడు.

కాసేపటికి ఆ తండ్రీ, కూతుళ్ళిద్దరూ తేరుకున్నారు. లాంబ్‌ను తండ్రికి పరిచయం చేసిందామె. వారు ముగ్గురూ కలసి ఆ అదృశ్య దీవులను గూర్చి చర్చించుకున్నారు. కాని, ఎంత ఆలోచించినా ఆ దీవులనుండి బయటపడే మార్గం కన్పించలేదు వారికి.

చివరకి మోజస్ ఇలా అన్నాడు.

"లాంబ్! ఈ దీవులనుండి తప్పించుకోవడానికి నాకు ఒకే మార్గం కన్పిస్తూంది."

"ఏమిటది డాక్టర్" ఆత్రంగా అన్నాడు లాంబ్.

"ఈ దీవులలో జరుగుతున్న గంజాయి, నల్లమందు వ్యాపారాన్ని గురించీ, సముద్రపు దొంగతనాల గురించీ ఎలాగైనా చిలీ ప్రభుత్వానికి తెలియజేయాలి. ప్రభుత్వ వావికాదళం రంగంలోనికి దిగి ఈ చీడపురుగుల్ని అన్నింటినీ ఏరి పారేయాలి. అప్పుడే మనకు విముక్తి" బాధగా నిట్టూరుస్తూ అన్నాడు మోజస్.

మోజస్‌ను జాగ్రత్తగా వుండమని చెప్పి, లాంబ్, నీరాలు వెళ్ళిపోవడానికి ఉద్యుక్తులయ్యారు. ఒక్క నిమిషం వారిని ఆగమని చెప్పి, చిన్న భరిణెను తీసుకు వచ్చాడు మోజస్. దానిని లాంబ్‌కు యిచ్చాడు.

"లాంబ్! ఈ భరిణలోని మూలికాభస్మం చాలా

ప్రమాదకరమైనది. ఒండెడు ద్రవంలో చిటికెడు భస్మాన్ని కలిపినా చాలు. ఆ ద్రవాన్ని త్రాగినవారంతా తెలివితప్పి పడిపోతారు. మళ్ళీ పన్నెండు గంటలవరకూ ఆ మత్తులో నుండి లేవలేరు. మోతాదు మించిందా ప్రాణాలకే ప్రమాదం. జాగ్రత్తగా వుంచు. దేనికైనా పనికొస్తుంది."

మోజెస్ వంక కృతజ్ఞతగా చూశాడు లాంబ్. అతడి దగ్గర శలవు తీసుకొని అడవిలోనికి నడిచారు వారు. లాంబ్ మనసులో ఒకటే ఆలోచన.

"ఈ దీవుల రహస్యాన్ని .... చిలీ ప్రభుత్వానికి తెలియజేయాలి. కాని ఎలా?....ఎలా?"

లాంబ్, నీరాలు వెళ్ళిపోయిన పది నిమిషాలకు తిరిగి వచ్చారు ఆ ఆటవికులు. ఎవరో తమను మోసం చేశారన్నది వారికి స్పష్టంగా తెలుస్తూంది. ఆత్రంగా వచ్చి కుటీరంలోనికి తొంగి చూశారు. నిద్రపోతున్న మోజెస్‌ను చూశాక వారి గుండెలు చల్లబడ్డాయి.

తాము మోసం చేయబడ్డామన్న విషయాన్ని వారు తమలోనే దాచుకున్నారు. అది బయటపెడితే కాపలా వదలి వెళ్ళినందుకు వారికి విధించబోయే శిక్షేమిటో వారికి తెలుసు. అది: మరణశిక్ష.

గూడెం చేరిన లాంబ్, నీరాలూ యేమీ ఎరగనట్లు జాతరలో చిందులేస్తున్న మిగిలిన జంటల్లో కలసిపోయారు.

## 13

ఆ రోజు నుండీ లాంబ్ మనసునిండా అదే ఆలోచన "ఎలా ఈ రహస్యాలను బయట ప్రపంచానికి తెలియజేయడం?" అతడు తన ప్రయత్నాలను ప్రారంభించాడు.

ఒక జింక చర్మాన్ని సంపాదించి, శుభపరచి ఉంచాడు. దీర్ఘ చతురస్రాకారంలో కత్తిరించాడు. ఇప్పుడది ఆటవికులు మొలకు ధరించే చర్మపు గోచీలా వుంది. ఆటవికులు ముఖాలకు రాసుకునే రంగులను చిన్న, చిన్న రాతిచిప్పలలో సేకరించి వుంచాడు. రెండు మూడు పక్షి ఈకలను కూడా సిద్ధం చేసుకున్నాడు.

అన్నీ సమకూర్చుకున్నాక, ఒక రాత్రి అంతా నిద్ర పోయాక గుడిసెలో కూర్చుని ఆ చర్మపు ముక్కపై, పక్షి ఈకను రంగులలో ముంచి నెమ్మదిగా వ్రాయడం ప్రారంభించాడు.

అతడు వ్రాస్తున్నది.... చిలీ దేశపు అధ్యక్షుని పేర సంబోధించబడ్డ లేఖ. అందులో ఆ అదృశ్యదీవులలో జరుగుతున్న చట్టవిరుద్ధమైన కార్యకలాపాల గురించీ, తనకు తెలిసినంతలో ఆ దీవుల పై సరిగ్గ కస్వరూపం గురించి వివరంగా వ్రాశాడు.

డాక్టర్ మోజస్ సూచన ప్రకారం, ప్రభుత్వ నావికాదళం ఒక పెద్ద పటాలంతో బయలుదేరి ఆ దీవులను ముట్టడిస్తేగాని ఈ అదృశ్య దీవులను ఆక్రమించడం సాధ్యంకాదని స్పష్టం చేశాడతడు.

ఆ చర్మపు ముక్కను మామూలుగా తన మొలకు ధరించాడు. అప్పటినుండీ....'ఎప్పటికయినా అవకాశం రాకపోతుందా, ఆ చర్మపు లేఖను బాహ్య ప్రపంచానికి అందించకపోతానా' అని ఆత్రంగా ఎదురుచూడసాగాడు.

సరిగ్గా పదిరోజుల తరువాత అతడి నిరీక్షణ ఫలించింది. ఆ రోజు రాత్రి తొలి జాములో వారికి సంకేతం అందింది. 'పసిఫిక్ సముద్రంలో దోనాన్ దీవులకు సమీ

పంగా యేదో నాక వస్తుంది' వెంటనే ఆ ఆటవికులు ఆ ద్వీపంనుండి బయలుదేరారు. ఈసారి వాళ్ళతో పాటు గోవర్, లాంబ్ లుకూడా వున్నారు.

గోవర్ కూ, లాంబ్ కూ ఇది మొదటి అనుభవం కనుక వారు తీసుకోవల్సిన జాగ్రత్తలను మరోసారి చెప్పి వారిని హెచ్చరించారు ఆ ఆటవికులు.

సముద్రపు జలాలలో నిండా మునిగి, చేపపిల్లల్లా ఈదుకుంటూ వారంతా షిప్ దగ్గరకు చేరుకున్నారు. ఆ చీకటిలో వాళ్ళు మరింత నల్లగా జలభూతాల్లా వున్నారు. ఇద్దరు ఆటవికులు తమ భుజాలపై వున్న ఉడుములను చేతులలోనికి తీసుకున్నారు. వాటి మూతులకు తేనెను రాసి....షిప్ బాడీపై వదిలారు. అవి చక, చాకా ప్రాకుకుంటూ పైకి యెక్కాయి.

ఉడుములు షిప్ డెక్ ను చేరుకున్నాయని నిశ్చయించుకున్నాక వాటి నడుములకు కట్టబడ్డ త్రాళ్ళను ఎవరో లాగుతున్నారని గ్రహించగానే ఆ ఉడుములు షిప్ డెక్ ను గట్టిగా పట్టుకున్నాయి. యిక పదిమంది మనుషులు కూడా ఆ పట్టును విడిపించలేరు. దానినే ఉడుంపట్టు అంటారు.

మొదటగా ఇద్దరు ఆటవికులు ఆ త్రాళ్ళను పట్టుకొని పైకి ఎగబ్రాకారు. డెక్ పైకి చేరుకున్న వెంటనే అక్కడ వున్న డ్రమ్స్ చాటుకు డైవ్ చేశారు. డెక్ మీద చిందరవందరగా పడి వున్న సామానుల చాటు నుండి మెల్లగా ప్రాకుకుంటూ ఇంజన్ రూమ్‌ను సమీపించారు.

ఇద్దరు సెయిలర్స్ వున్నారు ఆ ఇంజను రూములో. మెల్లగా గదిలోనికి ప్రవేశించి, ఒక్కసారిగా చిరుత

పులుల్లా ఆ శెయిలర్స్ మీదకు దూకారు ఆ ఆటవికులు. ఒక చేత్తో వారి నోళ్ళను మూస్తూ, మరొక చేతితో బలంగా వారి మెడనరాలపై గుద్దారు.

మెడనరాలు కమిలిపోయి, మనిషిని పెరలైజ్ చేసే పురాతనమైన టెక్నిక్ అది. స్పృహతప్పి పడిపోయిన శెయిలర్స్‌ను క్రింద పడుకోనబెట్టి, జనరేటర్‌ను సమీపించారు.

జనరేటర్ స్విచ్ ఆఫ్ చేసిన వెంటనే ఒక్కసారిగా షిప్ అంతా అంధకారం అలుముకుంది. ఏం జరిగిందో తెలియక, షిప్ అంతా హాహాకారాలు మొదలయ్యాయి.

అప్పటికే డెక్ మీదకు చేరుకొని, డ్రమ్స్ వెనుక దాక్కొని వున్న ఆటవికులు మెరుపువేగంతో కదిలారు. కొందరు స్టోర్ రూమ్‌మీద దాడిచేశారు.

డెక్ మీద కూర్చుని వున్న ప్యాసెంజర్లలో బలమైన యువకులనూ, అందమైన యువతులనూ ముందే డ్రమ్స్ చాటున కూర్చుని గమనించి, గుర్తుపెట్టుకోవడంచేత మరి కొందరు చప్పుడు కాకుండా ఆ ప్యాసెంజర్ల చెంతకు చేరారు.

అరచేతులతో మెడలపై చరిచి వారిని పెరలైజ్ చేయడం....క్రిందకు వ్రాలిపోతున్న వారిని భుజాలకెత్తుకొని త్రాడు సాయంతో క్రిందికి దిగిపోవడం, అంతే!

అడవిలో ఎండుటాకులమీద సైతం పాదాల చప్పుడు కాకుండా నడవగలిగే ఆటవిక జాతివారిది. కనీసం వారి అడుగుల చప్పుడు కూడా యెవరికి వినిపించలేదు.

సరిగ్గా పదిహేను నిమిషాలలో వారి దోపిడీ పూర్తయిపోయింది.

షిప్ సిబ్బంది ఎలర్టు అయి, ఆ చీకటిలో తడుము కుంటూ జనరేటర్ రూముకు చేరుకొని, జనరేటర్‌ను ఆన్ చేసేలోపల ఆ ఆటవికులు సముద్రంలోకి వురికి దోనాన్ దీవుల పొదల్లోనికి చొచ్చుకుపోయారు.

పోయిన సామగ్రిని, అదృశ్యమయిన ప్యాసెంజర్లను లెక్క చేయసాగాడు షిప్ కెప్టన్ ఎడ్మండ్స్.

స్టోర్ రూమును చెక్ చేస్తున్న కెప్టన్ ఎడ్మండ్స్ దృష్టిని అక్కడ పడివున్న చర్మపు ముక్క ఆకర్షించింది. నీళ్ళల్లో తడిసినట్లు వుంది అది. కాని దానిమీద వ్రాయ బడ్డ రంగు రంగుల అక్షరాలు మాత్రం మిల, మిలా మెరుస్తున్నాయి.

అది ... లాంబ్ వ్రాసిన చర్మపు లేఖ.

స్టోర్ రూముకు మిగిలిన ఆటవికులతో పాటు దోపిడీకి వచ్చిన అతడు కావాలని ఆ చర్మపు లేఖను అక్కడ జారవిడిచాడు. తాము ముఖాలకు పూసుకునే ఆ రంగులు నీటిలో తడిసినా చెరగవని అతడికి తెలుసు.

కెప్టెన్ ఎడ్మండ్స్ ఆ లేఖను చేతిలోనికి తీసు కున్నాడు. అది చదువుతున్నకొద్దీ ఆశ్చర్యంతో అతడి కళ్ళు పెద్దవయ్యాయి. అదృశ్యదీవులలో జరుగుతున్న దురాగతాలను చదువుతూ భయంతో వణికిపోయాడతడు.

ఆ లేఖ చివర....లాంబ్ ఒక అభ్యర్థనను కూడా వ్రాశాడు. "ఈ లేఖ ఎవరికి లభించినా దయచేసి దీనిని చిలీదేశపు అధ్యక్షునికి చేరేలా చూడండి. ఈ లేఖపై కొన్ని వందలమంది జీవితాలు ఆధారపడి వున్నాయి."

కెప్టెన్ ఎడ్మండ్స్....ఆ లేఖను ఫస్టు సెక్రటరీ టు ది ప్రెసిడెంట్ ఆఫ్ చిలీకు అందజేశాడు. అతడికి మొదట ఆ సెక్రటరీతో ఇంటర్ వ్యూ దొరకటమే కష్టమై

పోయింది.

కాని.... దోనాన్ దీవులకు సంబంధించిన ఒక రహస్య సమాచారం తన దగ్గరుందని చెప్పడంతో అతడు ఆ సెక్రటరీని కలుసుకో గలిగాడు.

సెక్రటరీ తీసుకువచ్చిన ఆ చర్మపు లేఖను చదివిన చిలీ దేశపు అధ్యక్షుడు దిగ్భ్రమ చెందాడు.

## 14

తూరుపు తల్పంపై అరుణుడు బద్ధకంగా కళ్ళు విప్పుచు కుంటున్న వేళ. దినకరునికి సుప్రభాతం పలుకుతున్నాయా అన్నట్లు అడవి అంతా పక్షుల కిలకిలారావాలతో నిండి పోయింది.

ఆ రోజు ఉదయంనుండీ దోనాన్ దీవులలో ఒక విధమైన సంచలనం బయలుదేరింది. అన్ని దీవులలోని ఆటవికులూ కట్టకట్టినట్లుగా గుంపులుగా బయలుదేర సాగారు. ప్రతి ఒక్కరూ రాత్రికి కావాల్సిన ఆహారాన్ని మూటకట్టి పట్టుకున్నారు.

చిన్న, చిన్న డింగీలలోనూ, తెప్పలలోనూ ప్రయాణిస్తూ ఒక క్రొత్త దీవిని చేరుకున్నారు. ఆ దీవిని చూడటం లాంబ్ కూ, గోవర్ కూ అదే మొదటిసారి.

నీరా, చేయి పట్టుకుని లాంబ్ నడుస్తున్నాడు. ఇంకొక యువతి గోవర్ ను నడిపిస్తూంది. అత్యంత ప్రాచీనమైన దుర్గమారణ్యం ఆ దీవి అంతటా పరచుకొని వుంది.

'ఆ రోజు దేవదూత వస్తాడట. ఆ ఆటవికులను ఉద్దేశించి ప్రసంగిస్తాడట' అదీ సంరంభానికి కారణం.

నీరా కూడా ఒకసారి ఆ దీవిని చూసింది. కాని దేవదూతను చూడటం ఆమెకూ ఇదే మొదటిసారి అవుతుంది. వారి మనస్సుల్లో యేదో ఉత్కంఠ.

వారంతా ఒక ఎత్తయిన కొండను సమీపించారు. అది చిన్న సైజు పర్వతంలా వుంది. వివిధ రకాలయిన చెట్లూ, పొదలూ ఆ కొండనిండా గుబురుగా పెరిగి వున్నాయి.

ఆటవికులంతా ఆ పర్వత పాదంలో గుమికూడారు. కొంతమంది గొడ్డళ్ళతో పెద్ద, పెద్ద ఎండు మ్రానులను నరికి పెద్ద గుట్టగా పోశారు. చీకటిపడే సమయానికి ఆ మ్రానులకు చెకుముకి రాళ్ళతో నిప్పును చేసి ముట్టించారు. వారంతా ఆ మంట చుట్టూ చేరారు.

సన్నని పొగమంచు దట్టంగా అంతా వ్యాపించి వుంది. మంచుతో చల్లబడుతున్న దేహాలకు చలిమంట వేడెక్కిస్తూంది.

తాము తెచ్చుకున్న ఆహారాన్ని తిని, హాయిగా తలా కాస్త దాక్షాసవాన్ని పుచ్చుకున్నారు వారు.

రాత్రి తొలిజాము గడిచింది. ఒక్కసారిగా ఎదురుగా నున్న కొండమీద భేరీ నాదం వినిపించింది. మరుక్షణం నాగస్వరం విన్న నాగుల్లా ఆ ఆటవికులంతా చివుక్కున తలలెత్తి ఆ కొండవైపు చూశారు.

ఒక్కసారిగా ఆ కొండమీద మెరుపు మెరిసినట్లయింది. కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతి ఒక్కసారిగా జ్వాలా పుష్పంలా విచ్చుకుంది. ఆ తరువాత తెల్లని దట్టమైన పొగ ఆ శిఖరంనుండి ఆకాశానికి ఎగిసింది.

ఆ శ్వేత ధూమంలోనుండి వస్తున్న ఆజానుబాహుడ్ని చూడగానే ఆ ఆటవికులు హాహాకారాలు చేశారు. నేలపై మోకరిల్లి నమస్కరించారు.

అతడు పచ్చగా బంగారంలా మెరుస్తున్న పొడవైన అంగీని ధరించాడు. తలపై వజ్రాల కిరీటం ధగ, ధగ

లాడుతూంది. తెల్లగా వెండిలా మెరుస్తున్న గడ్డం గుండెలపై జీరాడుతుంది. అతడి కుడిచేతిలో బంగారు దండం వుంది. నెమ్మదిగా నడుచుకుంటూ కొండ దిగ సాగాడు అతడు.

నీరవ నిశీధిలో, తెలిమంచు తెరలను తొలగించుకుని, పసిడికాంతులీనుతూ .... దివినుండి దిగివచ్చిన దేవదూత లాగానే వున్నాడతడు.

కొండనుండి దిగివచ్చి అక్కడున్న ఎత్తయిన శిలా వేదికపై నిలుచున్నాడతడు. మంటల వెలుగులో ఇప్పు డతని రూపం స్పష్టంగా కన్పిస్తూంది. అతని ముఖం వంక చూశారు లాంబ్, నీరాలు.

అంతే! కరంట్ షాక్ తగిలినట్లయింది వారికి.

ఆ దేవదూత ఎవరో కాదు. గ్రాహం పాల్. ఎవరి నైతే దోనాన్ దీవులలో ప్రవేశించడానికి.... అందరూ సలహాలను అడుగుతుంటారో.... ఆ పాస్టర్ .... ఫాదర్ గ్రాహంపాల్ అతడు.

"ఇతడా .... ఈ ఆటవికుల్ని అందరినీ కలిపి ఈ అత్యాచారాలు చేయిస్తున్నది? ఇతడా అందమైన ఈ దోనాన్ దీవులను రాక్షస దీవులుగా మార్చింది?"

ఎంతో దయామయుడిలా తమను ఆ దోనాన్ దీవుల లోనికి వెళ్ళవద్దని వారించిన ఫాదర్ గ్రాహం పాల్ ఈ అక్రమాలన్నింటినీ చేయిస్తున్నాడంటే నీరా నమ్మలేక పోతూంది.

"ఎలా....? ఎలా ఇతడు ఈ ఆటవికులనందర్నీ వశ పరచుకున్నాడు?" లాంబ్ మెదడును తినేస్తున్న సందేహం అది.

అతడి సందేహానికి సమాధానం చెబుతున్నట్లుగా

గ్రాహం పాల్ తన ప్రసంగాన్ని ప్రారంభించాడు.

"బిడ్డలారా! దేవుని తరఫున మీకు ఆశీస్సు లందిస్తున్నాను.

ప్రపంచంలోనే అత్యంత ప్రాచీనమైన నాగరికత గల తెగలకు చెందిన వారు మీరంతా.

అలాంటి మిమ్మల్ని, ఒక శతాబ్దం క్రితం నాగరిక వాసులమని విర్రవీగే ఈ ఆధునికులు బంధించి తమ దేశాలకు తీసుకొనిపోయి బానిసలుగా మార్చి తమ సేవలకు వినియోగించుకున్నారు.

ఆనాడు మీ పూర్వీకులకు జరిగిన అన్యాయానికి ప్రతీకార చర్య.... ఈ దోనాన్ దీవులలో.... ప్రాచీన ఆటవిక రాజ్య స్థాపన.

ఆఫ్రికా ఖండంలోని ఈజిప్షియన్‌లు, మధ్య ఆసియాలోని మంగోలులు, దక్షిణ అమెరికాలోని రెడ్ ఇండియన్‌లు.... ఇలా ఆయా జాతులవారంతా పూర్వం ఆ ఖండాలను ఏకచ్ఛత్రాధిపత్యంతో ఏలిన వారే.

మరి.... ఇప్పుడు వీరంతా యెందుకు అనామకుల్లా పడి వున్నారు? మొన్న, మొన్న కన్ను తెరిచిన ఈ ఆధునిక వాసులు మిమ్మల్ని, మీ నాగరికతనూ అట్టడుగుకు అణిచివేశారు.

అందుకే ఈ ప్రతీకారం.

ఏ ఆధునికులు మిమ్మల్ని బానిసలుగా చూశారో.... ఆ ఆధునికుల్ని పట్టి బంధించి, మన బానిసలుగా మార్చుకోవడమే మన లక్ష్యం!

మన ఈ ప్రయత్నానికి దేవుని దీవెన ఉంది.

విజయీభవ!"

తన ప్రసంగాన్ని ముగించి, గ్రాహం పాల్ మళ్ళీ

కొండమీదకు వెనుతిరిగిపోయాడు. గూడెం నాయకుడు అతిడిని అనుసరించాడు.

గ్రాహాంపాల్ ఉపన్యాసం విన్న వెంటనే తన సందేహాలన్నీ పటాపంచలయినట్లనిపించింది లాంబ్‌కు.

"గత చరిత్ర చెప్పి, నాగరికులమీద ప్రతీకారం అన్న సాకుతో ఈ ఆటవికుల్ని అందరినీ లోంగదీసుకున్నాడన్నమాట" అనుకున్నాడు లాంబ్.

మరునాడు రాత్రి.... దోనాన్ దీవుల మధ్యకు చొచ్చుకొని వచ్చాయి మూడు మర పడవలు.

ఓడలలో దొంగలించిన సామగ్రిని, గంజాయితో నింపబడిన సంచులనూ ఆ మర పడవలలోనికి ఎక్కించారు ఆ ఆటవికులు.

"ముందు రోజు రాత్రి గ్రాహాంపాల్ రాకలోని అంతరార్థం ఇదన్నమాట" అనుకున్నాడు లాంబ్ బోట్స లోనికి సామానులను చేరవేస్తూ.

అతని మనసునిండా ఒకటే ఆలోచన.

తన ఉత్తరం చిలీ ప్రెసిడెంట్‌కు చేరిందా? దాని నతడు సీరియస్‌గా తీసుకున్నాడా? తీసుకుంటే తాను సూచించినట్లు దోనాన్ దీవులమీద ఎటాక్ ప్రారంభం కావాలి.

ఆ అదృష్ట దినం కోసం ఎదురు చూస్తున్నాడు అతను.

## 15

సరిగ్గా మూడు రోజుల తరువాత అతడి నిరీక్షణ ఫలించింది.

చిలీ దేశపు రక్షణశాఖ నౌక 'స్టీల్ వేల్' దోనాన్ దీవులను సమీపించిందన్న వార్త ఆ దీవులలో కార్చిచ్చులా వ్యాపించింది. ఆ ద్వీపవాసులందరూ ఆయుధా

లతో సిద్ధమయ్యారు.

అంత పెద్ద నౌక.... ఆ దీవులమధ్య నున్న చిన్న కాలువలోనికి రాలేదని వారికి తెలుసు. సైనికులు వస్తే చిన్న చిన్న స్టీమ్ బోట్స్‌లో రావాలి. దోనాన్ దీవుల సముదాయంలోనికి ఆ బోట్స్ వచ్చిన మరుక్షణం ... పద్మవ్యూహంలాంటి ఆ దీవులమధ్య దారి తప్పడం ఖాయం. దారి తప్పిన ఆ సైనికులను మట్టుపెట్టడం వారికి చిటికలమీద పని అదీ ...ఆ ఆటవికుల భరోసా.

అయితే ఈసారి వారు ఊహించినట్లుగా ముట్టడి భూతలం మీదినుండి జరుగలేదు. గగన తలంమీదనుండి సాగింది.

విమాన వాహక నౌక అయిన 'సీల్ వెల్' నుండి ఒక్కసారిగా మూడు విమానాలు పైకి ఎగిరాయి. ఆకాశంలో గ్రద్దలా చక్కర్లు కొడుతున్న వాటి వంక విచిత్రంగా చూశారు ఆ ఆటవికులు.

గగన తలంలో ఒక నిర్ణీతమైన ఎత్తుకు చేరుకున్నాక ఆ విమానాలకున్న ఎమర్జన్సీ డోర్స్ తెరవబడ్డాయి. వీపులకు పారాచ్యూట్ కిట్స్‌తో ఒక్కరొక్కరుగా క్రిందకు దూకారు చిలీ దేశపు సైనికులు.

శూన్యంలో కొన్ని అడుగులు అలా డెస్పరేట్‌గా క్రిందకు జారాక ఒక్కసారిగా వారి వీపులకున్న పారాచ్యూట్స్ విచ్చుకున్నాయి.

రంగు, రంగు బుట్టలను పట్టుకొని ఆకాశంనుండి దిగుతున్న ఆ సైనికులను చూసి ఆటవికులు విభ్రాంతి చెందారు.

పారాచ్యూట్స్ క్రిందకు వ్రాలాయి. భుజాలకున్న వాటి బెల్టులను విప్పదీసుకుంటున్నారు సైనికులు.

నేలమీదకు వ్రాలిన సైనికులను చూడగానే ఆ

ఆటవికులకు ధైర్యం వచ్చింది. గట్టిగా అరుచుకుంటూ వారిని చుట్టుముట్టారు.

మరుక్షణం ఆ సైనికుల చేతుల లోని స్టెన్‌గన్స్ భయంకరంగా గర్జించాయి. గుండెల్లో గుళ్ళు దూసుకు పోతుంటే బాధగా అరుస్తూ .... పిట్టల్లా, నేలకూల సాగారు ఆ ఆటవికులు.

ఒక చెట్టుచాటునుండి ఇదంతా చూస్తున్న లాంబ్ కళ్ళు చెమర్చాయి.

ఒక నరరూప రాక్షసుని స్వార్థానికి, అతడి వికృత ఆలోచనలకూ అమాయకులైన ఈ ఆటవికులు బలైపో తున్నారు.

కాని ఈ మారణకాండ తప్పదని అతడికి తెలుసు. నాగరిక ప్రపంచంమీద నిలువెల్లా క్రోధాన్ని, పగనూ పెంచుకున్న ఆ ఆటవికుల్ని సమూలంగా నాశనం చేయక పోతే.... భవిష్యత్‌లో వారి వక్రపు ఆలోచన ప్రభా వంతో ప్రపంచంలోని మొత్తం ఆటవిక జాతులంతా నాగరికులమీద దాడులు చేసే ప్రమాదం వుంది.

లాంబ్ ప్రక్కనే అతడిని ఆనుకొని నీరా నిలబడి వుంది.

వారికి పది గజాల దూరంలో నున్న కుటీరంలో గోవర్‌తో సహా బ్రెయిన్ వాష్ చేయబడ్డ అమెరికన్ యువకులంతా స్పృహ తప్పి పడివున్నారు.

చిలీదేశపు రక్షణ నౌక దోనాన్ దీవులను సమీ పించిందన్న వార్త తెలిసిన వెంటనే డాక్టర్ మోజన్ ఇచ్చిన భస్మాన్ని దాహాసవంలో కలిపి ఆ అమెరికన్ యువకుల చేత త్రాగించాడు లాంబ్.

అలా వారిని స్పృహ తప్పించకపోతే, మతిలేని

నితిలో వారు కూడా ఆ ఆటవికులతో పాటుగా ఆ సైనికులను ఎదుర్కొని మరణించి వుండేవారని అతడికి తెలుసు.

సైనికుల చేతిలో చావగా మిగిలిన ఆటవికులు ప్రాణ భీతితో వెనక్కు పరుగెత్తారు. అడవికి అడ్డంపడి శర వేగంగా పరుగెత్తుతూ ఒడ్డుకు చేరుకున్నారు. సముద్రంలో మునిగి పారిపోదామని వారి ఆశ.

కాని.... అప్పటికే స్టీమ్‌బోట్లతో ఆ దీవులను చుట్టుముట్టారు సైనికులు. ఒకటీ.... రెండూ కాదు.... ఏభయి స్టీమ్‌బోట్లు ఆ దీవులలోని అన్ని కాలువలను కవర్ చేస్తుంటే ఒక్క ఆటవికుడు కూడా ఆ చక్రబంధంలో నుండి తప్పించుకుపోలేక పోయాడు.

చనిపోయినవారు పోను, మిగిలిన ఆటవికులు సైనికులకు లొంగిపోయారు. బానిసలుగా బ్రతుకుతున్న అమెరికన్ యువకులను తీసుకొని "స్టీల్ వేల్" వెనక్కు మరలింది.

## ఉపసంహారం:

ఇన్నాళ్ళూ రాక్షస దీవులుగా అందరినీ భయభ్రాంతులను చేసిన దోనాన్ దీవులు చిలీ ప్రభుత్వ అధీనంలోనికి వచ్చాయి.

తనే ఈ అక్రమాలకు మూలపురుషుడినన్న రహస్యం బట్టబయలయిందని తెలియగానే ఫాదర్ గ్రాహంపాల్ ఆత్మహత్య చేసుకున్నాడు.

గోవర్‌తో సహా, వశీకరణ విద్య చేత మతిపోగొట్టుకున్న వారందరినీ తిరిగి మామూలు మనుషులను చేసే ప్రయత్నంలో పడ్డాడు డాక్టర్ మోజస్.

దోనాన్ దీవుల రహస్యాన్ని ఛేదించడంలో ఎంతో ధైర్యసాహసాలను ప్రదర్శించిన లాంబ్‌ను చిలీ దేశపు ప్రజలూ, ప్రభుత్వమూ, పత్రికలూ వేనోళ్ళ ప్రశంసించారు.

ఇక .... నీరా!

పదిరోజులలో, జరగబోతున్న తమ పెళ్ళి గురించి తీయని కలలు కంటూంది ఆమె.

తమ హనీమూన్ ట్రిప్ యెక్కడికో కూడా లాంబ్ చెప్పేసాడా మెకు. అతి రెంచుకున్న స్థలం దోనాన్ దీవులు.

అవును మరి .... దోనాన్ దీవులు ఇప్పుడు రాక్షస దీవులు కావు.... ఇప్పుడు అక్కడ జల భూతాలు లేవు! ఆ దీవులు ఇప్పుడు ప్రేమికుల పాలిట నందనవనాలు.

—: అయిపోయింది :—

# ప్రాణం విలువ?

## వసుంధర

"బాస్‌కి నేనంటే ఇష్టం—" అంది సీతమ్మ.

"కాదు. నేనంటే నే యిష్టం—" అంది రాజమ్మ.

ఇద్దరికీ ఈ విషయంలో వాదన మొదలయింది. ఇద్దరూ తమ పాయింటే నిజమనడానికి యెన్నో బుజువులు చూపించారు. ఉదాహరణల అస్త్రాలు ప్రయోగించారు. కర్ణుడికీ, అర్జునుడికీ మధ్య యుద్ధంలోలా—వారిరువురి ప్రయోగాలూ—ఒకదాని నొకటి ఢీకొని—ఒకటీ మిగలకుండా పోతున్నాయి.

కాసేపటికిద్దరి ముఖాలు ఎర్రబడ్డాయి. సరదాగా ప్రారంభించిన వాదులాట వ్యక్తిగత ద్వేషానికి దారి తీస్తోంది. ఇద్దరూ ఒకరినొకరు తిట్టుకునేందుకు సిద్ధపడుతూన్న సమయంలో వెంకన్న వంటింట్లోంచి అక్కడకు వచ్చి—"మీ గొడవ లోపలకూ వినిపిస్తోంది-" అన్నాడు విసుగ్గా.

"వినిపిస్తే వినిపించనివ్వండి. ఈ రోజుతో ఇది తేలి

పోవాలి బాస్—మీరే చెప్పండి మా యిద్దరిలో ఎవ రంటే మీకిష్టం?" అంది సీతమ్మ.

"ఇద్దరన్నా ఇష్టమే!" అన్నాడు వెంకన్న.

"అలా కాదు. ఎవరంటే ఎక్కువిష్టమో చెప్పాలి" అంది రాజమ్మ.

"నేనంటే ఎవరెక్కువిష్టపడతారో వాళ్ళంటే నాకెక్కువిష్టం — కాబట్టి మీరు చెప్పండి — మీలో యెవరికి నేనంటే యెక్కువిష్టం?" అన్నాడు వెంకన్న.

తమ ప్రశ్న ఇలా ఎదురుతిరిగినందుకు సీతమ్మ, రాజమ్మ ఇద్దరూ తెల్లబోయారు.

"బాస్ అంటే నాకే ఎక్కువిష్టం!" అంది రాజమ్మ.

"కాదు—నాకే ఎక్కువిష్టం!" అంది సీతమ్మ.

ఇద్దరూ మళ్ళీ ఉదాహరణల అస్త్రాలు ప్రారంభిం చారు. చివరకు సీతమ్మ విసుగ్గా—"బాస్—అది కూడా మీరే చెప్పాలి!" అంది.

"చాలా సింపుల్. మీలో యెవరు నన్ను పెళ్ళిచేసు కుంటానంటే—వారికి నేనంటే ఎక్కువిష్టం!" అన్నాడు వెంకన్న.

రాజమ్మ తెల్లబోయి—"మీకు పెళ్ళైపోయిందిగా-" అంది.

"అందుకే.... నేనంటే యెంతో ఎక్కువిష్టమున్న వాళ్ళు తప్ప నన్నెవ్వరూ పెళ్ళిచేసుకోరు...." అన్నాడు వెంకన్న.

అసిస్టెంట్లిద్దరికీ నోట మాటరాక ముఖముఖాలు చూసుకున్నారు. ఆ సమయంలో బల్ల మీద ఫోన్ మ్రోగింది.

ఆ ఫోన్ కంటిన్యూంచని వెంకన్నకు తెలుసు. అందుకే

రిసీవర్ తీయకుండానే లోపలకు పరుగెత్తాడతడు.

అక్కడ పద్మావతీదేవి ఎర్రబడిన కళ్ళతో అతడివంక చూసి— "పెళ్ళికు పిల్లలతో ఏమిటా మాటలు!" అంది.

వెంకన్న తల వంచుకొని— "నన్ను మన్నించు దేవీ!" అన్నాడు.

"మళ్ళీ ఇలాంటి పొరపాటు జరుగదని హామీ ఇస్తే నేను మిమ్మల్ని మన్నిస్తాను...." అంది పద్మావతీదేవి.

"హామీ యివ్వలేను...." అన్నాడు వెంకన్న.

"వాళ్ళతో అలా మాట్లాడ్డం తప్పు కదూ!"

"తప్పు మనసులో వుంటుంది. మాటల్లో ఉండదు."

"మాటల్లో ఎందుకుండదు?"

"చిన్న పిల్లల్ని ముద్దొచ్చినప్పుడు—వెధవా—నిన్ను కొట్టేస్తాను తన్నేస్తాను. నీ ముక్కు కోసేస్తాను.... అంటూ ముద్దులాడుతాం. అది అభిమానాన్ని ప్రకటించుకునే పద్ధతి. ఎవరైనా మన మాటల కర్థం తీస్తే—మనం పిల్లలను కొట్టేసామనుకుంటారు. కానీ అది నిజం కాదు-" అన్నాడు వెంకన్న.

"మీరు చెప్పింది నిజమే—కానీ మీ అసిస్టెంట్సు చిన్న పిల్లలు కారు. వయసొచ్చిన ఆడపిల్లలు—" అంది పద్మావతీదేవి హెచ్చరికగా.

"అందుకే గదా — కొట్టేస్తాను, తన్నేస్తాను, ముక్కు కోసేస్తాను—అని అనడంలేదు—" అన్నాడు వెంకన్న.

"కానీ పెళ్ళి చేసుకుంటానంటున్నారు" అంది పద్మావతీదేవి.

"అది మనసులోని మాట కాదు. ఉత్తమాట."

"అలా మాత్రం మాట్లాడడ మెందుకు?"

"ఎందుకంటే నేను నిత్యం మెదడుతో పని చేసే మనిషిని. నిద్రలో కూడా నా మనసే మేమో ఆలోచిస్తూ నే వుంటుంది. ఆఫీసులో కొంత రిలాక్సేషన్ అవసరం. ప్రకృతిలో దర్శన మాత్రాన రిలాక్సేషన్ ఇవ్వగలిగిన అద్భుత సాధనం స్త్రీ సౌందర్యం మాత్రమే! అందుకే అందమైన ఆడపిల్లల్ని అసిస్టెంట్సుగా వేసుకున్నాను. వాళ్ళతో సరదాగా మాట్లాడ్డంలో నాకెంతో రిలాక్సేషన్ లభిస్తుంది. భార్య చెల్లెలితో సరసాలాడ్డం సంప్రదాయంగా వున్న మన సమాజంలో ఇది తప్పని నువ్వనకూడదు. పదే పదే తప్పని నువ్వు హెచ్చరిస్తూంటే నా అసిస్టెంట్సులో సౌందర్యానికి బదులు స్త్రీత్వాన్ని చూసే స్థాయికి నా బుద్ధి దిగజారిపోతుంది. అప్పుడు నా కింక రిలాక్సేషన్ వుండదు" అన్నాడు వెంకన్న.

"మీ పద్ధతిలో మీరంటున్నారు. మీ అసిస్టెంట్సంటే నా కనుమానమైతే వాళ్ళకెప్పుడో ఉద్వాసన జరిగేది. వాళ్ళంటే నాకిష్టమే కాదు. అభిమానం కూడా! ఆ సంగతి మీకూ తెలుసు" అంది పద్మావతీదేవి.

"అయితే మాటిమాటికీ ఇలా నన్ను సాధిస్తావేం?"

"ఇది నా మనసులోంచీ రాలేదు. ఉత్తమాట...." అంది పద్మావతీదేవి.

"అలా మాట్లాడాల్సిన అవసరం నీకేముంది?"

"వంటింటి పనంతా నాది. ఏ క్షణంలో మీకే ప్రమాదం వాటిల్లుతుందోనన్న బెంగ నాది. ప్రపంచ సాహిత్య పరిశోధనా భారం నాది. నిద్రలో కూడా విశ్రమించని మెదడు నాది మీకైతే మీ ఒక్కరి బాధ్యతే ఉంది. నాకు నాతోపాటు మీ బాధ్యతా వుంది. అందువల్ల మీకంటే నాకే యెక్కువ రిలాక్సేషన్

కావాలి—"

"అయితే?"

"నేను మిమ్మల్ని సాధిస్తున్నాననుకుంటున్నారు. కానీ నిజానకది నా రిలాక్సేషన్" అంది పద్మావతీదేవి.

వెంకన్నకు బదులేం చెప్పాలో తోచలేదు. ఒక్క క్షణమాగి "నీ రిలాక్సేషన్ కింకో పద్ధతి వెతుక్కోలేవా?" అన్నాడు.

"మనింట్లోకి మూడో మనిషి వస్తే నా రిలాక్సేషన్ పద్ధతి తప్పక మారుతుంది" అంది పద్మావతీదేవి.

"అయితే నే తీసుకరానా?" అన్నాడు వెంకన్న.

"అది మీ వల్ల కాదు. నా వల్లనే అవుతుంది."

"ఎందువల్ల?"

"ఆ మనిషిని మనమిద్దరం వెధవా—నిన్ను కొట్టేస్తాను, తన్నేస్తాను అనగలగాలి కదా మరి" అని నవ్వేసింది పద్మావతీదేవి.

"ఓహో-అర్థమయింది. అయితే ఎప్పుడు?" అన్నాడు వెంకన్న.

పద్మావతీదేవి యేదో చెప్పబోయేలోగా అక్కడ ఫోన్ మ్రోగింది.

"బాస్—క్లయంట్!" అంది రాజమ్మ ఫోన్‌లో.

## 2

అతడికిరవై యేళ్ళుంటాయి. సన్నగా పొడుగ్గా ఫాషనబుల్‌గా వున్నాడు. ముఖంలో దిగులుంది.

"నా పేరు వినీల్—" అన్నాడతడు.

"ఊఁ ప్రొసీడ్—" అన్నాడు వెంకన్న.

"మా నాన్నగారి పేరు ప్రభాకరరావు. గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్‌లో జనరల్ మేనేజరు—"

అన్నాడు వినీల్.

గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ గురించి వెంకన్నకు తెలుసు. అది చాలా పేరున్న సంస్థ. ఆ సంస్థ స్వయంగా కొన్ని చిన్న పరిశ్రమలు నడుపుతోంది. ఆ సంస్థ డబ్బు యెన్నో పెద్ద పరిశ్రమల్లో తిరుగుతోంది. ఆ సంస్థలో డబ్బు దాచుకున్న వారికి యేడాదికి పదహారు శాతం వడ్డీ లభిస్తుంది. జాతీయ బ్యాంకులతో సమంగా ఆ సంస్థను నమ్మవచ్చునంటారు. వెంకన్న ఆ సంస్థలో ముప్పై వేలు డిపాజిట్ చేసి వున్నాడు. అతడికి వడ్డీ సక్రమంగా అందుతోంది.

“చెప్పండి—” అన్నాడు వెంకన్న.

“నాన్నగారి నెవరో కిడ్నాప్ చేశారు—” అన్నాడతడు.

“పోలీసు రిపోర్టిచ్చారా?” అన్నాడు వెంకన్న వెంటనే.

వినీల్ తన జేబులోంచి ఓ కాగితం తీసి వెంకన్న కందించాడు.

అది లేత పసుపుపచ్చ కాగితం దానిమీద అందంగా ఇంగ్లీషులో టైపు చేసివున్న అక్షరాలు. ఆ అక్షరాల భావం — ‘ప్రభాకరరావు మా దగ్గర క్షేమంగా వున్నాడు. పోలీసు రిపోర్టిస్తే ఆయన ప్రాణాలు దక్కవు. ఆయన్ను విడిపించుకునేందుకు పదిలక్షల రూపాయలు సిద్ధంగా వుంచండి వారంరోజుల్లో మళ్ళీ ఉత్తరం రాస్తాను. అంతవరకూ వేచివుండండి.’

“అయితే డబ్బు సిద్ధం చేస్తున్నారా?” అన్నాడు వెంకన్న.

"పది లక్షలు పోగుచేయడం మాకు సాధ్యంకాదు."

వెంకన్న క్షణంపాటు మౌనం వహించి—"నేనేం చేయాలి?" అన్నాడు.

"కిడ్నాపర్సునుంచి నాన్నగారిని విడిపించాలి. అందుకు మేమివ్వగలిగిన మొత్తం మీరూ వాళ్ళకూ కలిపి రెండు లక్షలు. అందుకూ కూడా ఇంట్లోని నగలన్నీ అమ్మేయాలి. రెండు నెలల క్రితం మా అక్కయ్య పెళ్ళయింది. ఆ పెళ్ళికి మొత్తం రెండు లక్షలు ఖర్చయింది. నాన్నగా రప్పు కూడా చేశారు" అన్నాడు వినీల్ తలవంచుకుని.

"కిడ్నాపర్స్‌కి ఎవర్నించి ఎంత రాబట్టాలో బాగా తెలుస్తుంది. మీ నాన్నగారికి వాళ్ళు పది లక్షలు విలువ కట్టారంటే అందుకేదో కారణ ముంటుంది."

వినీల్ మాట్లాడలేదు.

"మీ నాన్నగారి దగ్గర బ్లాక్ మనీ ఉందేమో!" అన్నాడు వెంకన్న.

"లేదు. కంపెనీలో ఆయన గురించి నీతికీ, నిజాయితీకీ మారు పేరుగా చెప్పుకుంటారు. జీతం, బోనస్ తప్ప ఆయనకు మరో ఆదాయంలేదు. షేర్ కంటాక్ట్స్‌కూడా ఆయన యెప్పుడూ బకాయి పెట్టలేదు" అన్నాడు వినీల్

"అన్నీ నీకు బాగా తెలుసా?"

"తెలుసు."

"అయితే కిడ్నాపర్స్ పదిలక్ష లడగడానికి కారణ మేమై ఉండాలి?"

"అదే నాకూ తెలియడంలేదు."

వెంకన్న క్షణం ఆలోచించి—"ఈ ఉత్తరం మీ నాన్నగారి కంపెనీలో చూపించావా?" అన్నాడు.

"చూపించాను. వారు సానుభూతిని వ్యక్తపరిచారు"

అన్నాడు వినీల్.

"నా అనుమానం మీ నాన్నగారి కిడ్నాపింగ్‌కీ కంపెనీ ప్రయోజనానికీ ఏదైనా సంబంధముందేమోనని!" అన్నాడు వెంకన్న.

"మా ఇంట్లోనూ అలాగే అనుకున్నాం. నాన్నగారికి కంపెనీ అంటే ప్రాణం. కంపెనీ ఈనాడీ స్థాయికెదగడానికి ఆయన కీలక పాత్ర వహించారని చెప్తుంటారు. తలచుకుని వుంటే కంపెనీద్వారా ఆయన లక్షలకు లక్షలార్జించి వుండేవారు. కానీ ఆయనలాంటి మనిషి కాదు. ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించడం తన బాధ్యత అనుకునేవారు.

"ఉదయం ఎనిమిదింటికల్లా ఆయన కంపెనీకి వెళ్ళిపోతారు. రాత్రి ఏడింటిలోగా తిరిగిరారు. కంపెనీలో ఒక్క క్షణం కూడా విశ్రమించరు. అక్కయ్య పెళ్ళికి ముందాయన ఆరోగ్యం బాగా పాడైంది. డాక్టరాయన్ను విశ్రాంతి తీసుకోమని బలవంతపెట్టాడు. అందుకాయన నేనొక్క రోజు విశ్రాంతి తీసుకుంటే కంపెనీకి లక్షరూపాయల నష్టం వస్తుంది—అన్నారు. అక్కయ్య పెళ్ళి సమయంలో కూడా ఆయిన వాళ్ళెక్కువ శ్రమపడ్డారు తప్పితే నాన్నగారు కంపెనీ పనిని అలక్ష్యం చేయలేదు. ఆయనకు కంపెనీ తర్వాతే మేమంతా—" అన్నాడు వినీల్.

వెంకన్న ఆలోచనలో పడ్డాడు.

కేసు చాలా చిత్రంగా వుంది. కిడ్నాపర్స్‌కి ప్రభాకరరావు పరిస్థితి తెలిసినట్లే కనపడుతుంది. పదిలక్షల రూపాయలు వెంటనే కావాలనలేదు. వారం రోజులు టైమిచ్చారు. అంటే వారం రోజుల్లో ప్రభాకరరావు కుటుంబం

పది లక్షల రూపాయలు కూడబెట్టగలదని వాళ్ళనమ్మకం. అందుకేదో బలమైన కారణమే ఉండివుండాలి.

"ఖంగారుపడకు. వాళ్ళిచ్చిన గడువు సమయానికి పది లక్షలూ సమకూరుతాయి——" అన్నాడు వెంకన్న.

"అప్పుడే రెండ్రోజులైపోయాయి. నాకేం దారి కనబడ్డంలేదు" వినీల్ నీరసంగా అన్నాడు.

"మీ నాన్నగారు లేకుంటే కంపెనీకి రోజుకు లక్ష రూపాయల నష్టం. అందువల్ల కంపెనీ తప్పకుండా ఆసక్తి చూపిస్తుంది."

"వాళ్ళు సానుభూతి తప్ప ఇంకేమీ యివ్వలేదు."

"వెంటనే వాళ్ళేమీ చెప్పరు. నీ ఉత్తరం చూడగానే కంపెనీలో మీటింగ్స్ అవుతాయి. ఈ సమస్య నెలా పరిష్కరించాలీ అన్న చర్చ ప్రారంభమవుతుంది."

"నాకా నమ్మకంలేదు" అన్నాడు వినీల్.

"అసలింతకీ కిడ్నాపింగ్ ఎలా జరిగిందో మీరేమైనా చెప్పగలరా?"

వినీల్ చెప్పాడు.

ప్రభాకరరావు కంపెనీ కార్లో రాత్రి ఏడింటికి బయలుదేరాడు. ఇంటికి దగ్గర్లోనే చిన్న బజారుంది. అక్కడ దిగి డ్రైవర్ని వెళ్ళిపొమ్మన్నాడు. తర్వాతేం జరిగిందీ యెవరికీ తెలియదు. మర్నాడీ ఉత్తరం అందింది.

"ఎలా వచ్చిందీ ఉత్తరం?"

"ఇంటిముందు లెటర్ బాక్సులో యెవరో కవరు వేసి వెళ్ళారు. ఆ కవర్లో వుందీ ఉత్తరం."

"లెటర్ బాక్సులో ఎవరు పడితే వాళ్ళు ఉత్తరం వేసి పోతూండొచ్చా?" అన్నాడు వెంకన్న.

వినీల్ తలాడించాడు.

"కిడ్నాపర్స్‌ని తెలుసుకునేందుకు నాకేమైనా పనికొచ్చే సమాచారమివ్వగలవా?"

"అంటే?"

"మీ నాన్నగారి శత్రువులు.." అన్నాడు వెంకన్న.

'వ్యక్తిగతంగా ఆయనకు శత్రువులు లేరు. బంధువుల్లో ఆయనకెంతో మంచి పేరుంది. ఉన్నంతలో యెందరినో ఆదుకున్నాడాయన" అన్నాడు వినీల్.

"ఇంకేవిధంగానైనా ఆయనకు శత్రువులుండొచ్చా?"

"అంటే?" అన్నాడు వినీల్ తడబడుతూ.

"వ్యక్తిగతంగా ఆయనకు శత్రువులు లేరన్నావు. మరేవిధంగానైనా వుండొచ్చా అనడుగుతున్నాను—" అన్నాడు వెంకన్న.

"కంపెనీలో నాన్నగారి స్థానం కీలకమైనది. ఆయన నుంచి కంపెనీ రహస్యాలు రాబట్టాలని యెందరో ప్రయత్నించి విఫలులయ్యారు. గంధర్వ ఫైనాన్స్ కార్పొరేషన్నించి తప్పించి తమ కంపెనీలోకి తీసుకోవాలని నాన్నగారి విషయంలో చాలామంది సామదానభేద దండోపాయాలుపయోగించారు. ఆయన మాటకు విలువనిచ్చే మనిషి. అందుకే దేనికీ లొంగలేదు. గంధర్వ ఫైనాన్స్ కార్పొరేషన్నాయన స్వంత కంపెనీకంటే యెక్కువగా భావిస్తారు ఆ ఒక్క కారణంగా ఆయనకు చాలామంది శత్రువులేర్పడి వుండవచ్చు...." ఆగాడు వినీల్.

"అమాత్రానికేనా?" అన్నాడు వెంకన్న.

"బయటివారి ప్రలోభానికి లొంగివుంటే నాన్నగారి దగ్గర ఈ పాటికి పాతికలక్షలైనా చేరివుండాలి. అలాంటిది కూతురి పెళ్ళికే అప్పు చేశారాయన. అంటే

బయటివారు నాన్నగారివల్ల యెంతటి ప్రయోజనాన్ని పొందుతున్నారో చూడండి. నాన్నగారికంత డబ్బివ్వగలవారికంత కన్నా రెట్ల ప్రయోజనముంటుంది. ఆ ప్రయోజనం కాకుంటే వారికెలా వుంటుంది?"

"వారెవరో చెప్పగలవా?"

వినీల్ తల అడ్డంగా ఊపాడు.

"అయితే ఇవన్నీ నీకెలా తెలుసు?"

"నాన్నగారే చెప్పారు. కానీ ఆయన పూర్తి వివరాలు చెప్పలేదు. మాటల సందర్భంలో నిజాయితీ ప్రాముఖ్యత వచ్చినపుడల్లా ఆయన మాకీ విషయాలు చెబుతూంటారు. ఎంతడిగినా పూర్తి వివరాలు చెప్పరు. నాన్నగారు గుట్టయిన మనిషి—" అన్నాడు వినీల్.

"సరే—నేనిక పరిశోధన ప్రారంభిస్తాను. నువ్వు వెళ్ళొచ్చు—" అన్నాడు వెంకన్న.

వినీల్ తన జేబులోంచి ఒక యాభై రూపాయల నోట్ల కట్టను తీసి వెంకన్న కందించి—"ఇది అడ్వాన్సు...." అన్నాడు.

"థాంక్స్...." అన్నాడు వెంకన్న.

వినీల్ వెళ్ళిపోయాడు.

వెంకన్న సీతమ్మ వంక చూసి—"నువ్విప్పుడు గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్‌కి వెళ్ళి ప్రభాకరరావుకు సంబంధించిన వివరాలన్నీ రాబట్టుకుని రావాలి—" అన్నాడు.

సీతమ్మ ఉత్సాహంగా లేచి నిలబడి రాజమ్మ వంక చూసి—"చూశావా—బాస్‌కు నేనంటేనే యిష్టం. ముఖ్యమైన పనికి నన్నే పంపిస్తున్నారు!" అంది.

"అదేం కాదు. బాస్‌కు నేనంటేనే ఎక్కువిష్టం. అందుకే నిన్ను బయటకు పంపేస్తున్నారు—" అంది

రాజమ్మ.

వెంకన్న ఇద్దరివంకా కాస్త విసుగ్గా చూశాడు.

## 3

మరో మూడుగంటల తర్వాత సీతమ్మ తిరిగి వచ్చింది. ఆమె చాలా వుత్సాహంగా వుంది.

"నీవు తెలిసినదేమిటో త్వరగా చెప్పు—" అన్నాడు వెంకన్న.

"ప్రభాకరరావుతో పని వున్నట్లు వెళ్ళాను. కంపెనీలో ఆయనకు చాలా మంచి పేరుంది. నన్ను చాలా గౌరవించారక్కడ...." అంది సీతమ్మ.

రాజమ్మ ఆమె చెప్పేవన్నీ నోట్సుగా రాస్తోంది.

ప్రభాకరరావు నిజాయితీపరుడు. కంపెనీలో కీలక స్థానంలో వున్నాడు. మనిషి నిగర్వి. మంచివాడు. అక్కడి ఉద్యోగుల్లో ప్రతి ఒక్కరూ ఆయనవల్ల ఎంతో కొంత యేదోవిధంగా సాయం పొందినవారే! కొందరికాయన దేవుడు. కొందరికాయన మానవత్వం నిండిన మహామనిషి! ఆయన గురించి చెడ్డగా చెప్పేవారెవ్వరూ లేరు.

రెండు రోజులుగా ఆయన ఆఫీసుకు రావడంలేదు. అది పెద్ద విశేషమే! కూతురి పెళ్ళి సమయంలోనే ఆయన ప్రతిరోజూ యెప్పుడో ఒకప్పుడాఫీసుకు వెళ్ళి వస్తుండేవాడు. ఆయనకేమయిందోనని కొందరాయనింటికి ఫోన్ చేసి కూడా కనుక్కున్నారు. అయితే కిడ్నాపింగ్ విషయం యెవరికీ తెలియదు.

"నువ్వు కొత్తగా తెలుసుకొచ్చిన విశేషమేమీ లేదు" అంది రాజమ్మ.

"లేకేం—వినీల్ తండ్రి గురించి అబద్ధం చెప్పలేదని

ఋజావు చేసింది మన సీతమ్మ!" అన్నాడు వెంకన్న మెప్పుకోలుగా సీతమ్మ వంక చూస్తూ.

సీతమ్మ ముఖం ఇంతయింది.

"అందువల్ల ప్రయోజనం?" అంది రాజమ్మ ఉత్రోషంగా.

"నేను సరాసరి కంపెనీ యాజమాన్యాన్ని కలుసుకోవచ్చు—"

"కంపెనీ చీఫ్—తారకేశ్వర్ ప్రస్తుతం ఆఫీసులో నే వున్నాడు. ఆయన సాధారణంగా ఆఫీసుకు రాడుట. ప్రభాకర రావుగారు రాకపోవడం—ఆయన రావడం-రెండింటికీ సంబంధముందని అంతా అంటున్నారు—" అంది సీతమ్మ.

"వెరిగుడ్.... వె రీ గు డ్.... నేనాయన్నే కలుసుకుంటాను—" అన్నాడు వెంకన్న.

సీతమ్మ మరింత వుత్సాహంగా—"జాస్....మనకు పనికొచ్చే మరో సమాచారం కూడా వుంది. సస్పెన్సు కోసం ఇంతవరకూ చెప్పలేదు...." అంది.

"ఏమిటది?" అన్నాడు వెంకన్న.

రాజమ్మ రాసుకోవడానికి సిద్ధంగా వుంది.

"ఒకవేళ ప్రభాకరరావు నెవరేనా కిడ్నాప్ చేసి పదిలక్షలడిగితే ఏమవుతుందని—ఒకతన్నడిగాను. నా ప్రశ్నకతరేమీ ఆశ్చర్యపడలేదు. అలా జరిగే అవకాశం వుందన్నాడు. అందుకే కంపెనీ ఆయన్ను వెయ్యికళ్ళతో కాపాడుతుంటుందట. కంపెనీ వాళ్ళ కళ్ళు కప్పి ప్రభాకరరావును కిడ్నాప్ చేయడం ఎవరికల్లా కాదుట—" అంది సీతమ్మ.

"ఊఁ" అంటూ ఆమెను ప్రోత్సహించాడు వెంకన్న.

"కంపెనీవాళ్ళకు మించిన వాళ్ళెవరైనా కిడ్నాపింగ్ చేయగలిగితే—అని ఆతణ్ణి మళ్ళీ అడిగాను. అందుకతడు నవ్వి—"ఒకవేళ ప్రభాకరరావు కిడ్నాపింగ్ జరిగితే అందులో కంపెనీ హస్తముండితీరాలి—" అన్నాడు. నేనాశ్చర్యపడి కంపెనీ అలా చేయడమెందుకని అడిగితే ఆ రాజకీయాలు నాకే అర్థంకావని ఊరుకున్నాడు. కానీ నేనతడినంతటితో వదిలిపెట్టలేదు...." అంటూ కళ్ళు మూసుకుంది సీతమ్మ. ఆమె జరిగింది జరిగినట్లు చెబుతూంటే వెంకన్న వింటున్నాడు. రాజమ్మ నోట్ చేసుకుపోతోంది.

"అంటే కంపెనీయే ప్రభాకరరావుని కిడ్నాప్ చేస్తుందనుకోవచ్చు—చేసి రాన్సమ్ ఎంతడుగుతుంది?" అంది సీతమ్మ.

"ఏమో—ఇందాకా నువ్వన్నట్లు ఏ పదిలక్షలో అడగొచ్చు—" అన్నాడతడు.

"అంత డబ్బు తేగలరా ప్రభాకరరావు కుటుంబ సభ్యులు!"

"తేలేరని కంపెనీకి తెలియదా?"

"అయితే ఇదంతా ఎందుకు?"

"ఏమో—నాకు మాత్రమేం తెలుస్తుంది?" అన్నాడతడు.

"తెలుస్తుంది. నువ్వు చాలా తెలివైనవాడివిలా కనబడుతున్నావు. ఊహిస్తే యేమైనా తోస్తుంది నీకు ..." అంది సీతమ్మ.

అతడి ఛాతీ ఉబ్బింది—"ఇలాంటి కంపెనీలలో కీలక స్థానాల్లో వున్నవారి జీవితానికి యెప్పుడూ ప్రమాదమే బయటివాళ్ళు ఆశలు పెడతారు. కంపెనీవాళ్ళు అనుమా!

నిస్తారు. ప్రభాకరరావును కంపెనీవాళ్ళే కిడ్నాప్ చేశారంటే అర్థమేమిటి? ఆయనకు కంపెనీ రహస్యాలు తెలియాల్సినకంటే యెక్కువ తెలిశాయన్నమాట. ఆయన ఉనికివల్ల వాళ్ళకు ప్రమాదమన్నమాట. కిడ్నాపర్స్ పేరుతో వాళ్ళే ఆయన్నోచోట దాస్తారు. ఇవ్వలేనంత డబ్బు డిమాండ్ చేస్తారు. తర్వాత ఆయన్ను చంపేస్తారు. కిడ్నాపర్స్ ఆయన్ను చంపారని అంతా అనుకుంటారు. ప్రభాకరరావును కిడ్నాప్ చేస్తే చచ్చో బ్రతికో ఆయన కుటుంబం లేగలిగినది — ఒకటి లేక రెండు లక్షలు.... అంతకంటే ఎక్కువడిగితే-ఆదాయన్ను చంపడంకోసమేనని అర్థం...."

"చాలా బాగా ఊహించావు. నువ్వు నే ననుకున్న దానికంటే చాలా చాలా తెలివైనవాడివి...." అంది సీతమ్మ.

"ఇంతకీ ఈ వివరాలన్నీ నీకెందుకు?"

"ప్రభాకరరావు అజ్ఞాతంగా మా కుటుంబానికెంతో సాయపడ్డాడు. ఇప్పుడు నేను జీవితంలో నిలదొక్కుకున్నాను. మా కష్టాలు గట్టెక్కినట్లే. ఓసారి ఆ మహానుభావుణ్ని కళ్ళారా చూసి ధన్యవాదాలర్పించుకున్నాను. ఆయన మీద పత్రికలో వ్యాసంకూడా రాయాలనుకుంటున్నాను. అందుకు నీవంటివాళ్ళ అభిప్రాయాలుకూడా సహకరిస్తాయి...." సీతమ్మ చెప్పడం అయిపోయింది.

"ఇంత ముఖ్యమైన విశేషం ముందే యెందుకు చెప్పలేదు?" అన్నాడు వెంకన్న కొంచెం కోపంగా.

"అందుక్కారణముంది బాస్! నాకీ వివరాలన్నీ చెప్పినతడి పేరు చక్రవర్తి. అతడెప్పుడూ ఊహా లోకాల్లో తేలిపోతూంటాడని—ఇదిగో పులి అంటే అదిగో తోక

అనే రకమనీ ఆఫీసులో ఇద్దరు చెప్పారు నాకు. అందుకని అతడు చెప్పిందానికి ప్రాముఖ్యతనిచ్చి ముందుగా మీకు చెప్పలేదు నేను...." అంది సీతమ్మ.

"కంగ్రాట్స్ సీతమ్మా! నువ్వు వెళ్ళిన పని పూర్తిగా సాధించుకుని వచ్చావు. నేనైతే ఇందులో సగంకూడా చేసుకురాలేనేమో! బాస్ నిన్ను పంపడమే మంచిదయింది—" అంటూ రాజమ్మ ఆమెను మెచ్చుకుంది.

"అంతా నీ అభిమానం! నువ్వెళ్ళి వుంటే ఇంతకు రెట్టింపు సాధించుకుని వచ్చి వుండేదానివి—" అంది సీతమ్మ.

"అందుకే మీ ఇద్దరూ అంటే నాకెంతో ఇష్టం—" అన్నాడు వెంకన్న వెంటనే. తన అసిస్టెంట్స్ దద్దరూ వాదులాడుకోవడం మానినందు కతడికెంతో సంతోషం కలిగింది.

# 4

"ఎవర్ని కలుసుకోవాలి సర్!" అన్నాడు రిసెప్షనిస్టు వినయంగా.

"తారకేశ్వర్...." అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"అంటే కంపెనీ చీఫ్!" ఆశ్చర్యంగా అన్నాడతడు.

"అవును—ఏం?"

"అపాయింట్ మెంటుందా మీకు?" అన్నాడు రిసెప్షనిస్టు.

"లేదు—" అన్నాడు వెంకన్న.

"అపాయింట్ మెంటు లేనిదే ఆయన ఎవర్నీ కలుసుకోరు...."

"నన్ను కలుసుకుంటారు. నా పేరు వెంకన్న. నేనొక డిటెక్టివును. ఒక కిడ్నాపింగ్ క్రిమినల్ కేసులో

ఆయన్ని కలుసుకుందుకు వచ్చాను. కలుసుకోకపోతే నాకేం నష్టంలేదు ఆయనకే...."

ఈ మాటలు మంత్రంలా పనిచేశాయి. రిసెప్షనిష్టు చీఫ్ ప్రైవేట్ సెక్రటరీకి ఫోన్ చేశాడు. క్షణాలమీద అపాయింట్ మెంటు ఫిక్సయింది.

వెంకన్న చీఫ్‌ని కలుసుకున్నాడు.

రూం విశాలంగా వుంది. అందులో ఇద్దరు లేడీ సెక్రటరీస్ పనిచేస్తున్నారు. వాళ్ళు చాలా అందంగా వున్నారు.

"రిలాక్సేషన్—" అనుకున్నాడు వెంకన్న మనసులో.

చీఫ్ ఆరడుగుల పొడవున్నాడు. సన్నగా వున్నా హుందాగా వున్నాడు. జుత్తు కొద్దిగా నెరిసింది.

"కిడ్నాపింగ్ కేసన్నారుట—" అన్నాడు చీఫ్ పరస్పరం పరిచయాలయ్యాక.

"అవును. కానీ నేను మాట్లాడాల్సింది—స్ట్రిక్ట్లీ ప్రైవేట్ ..."

చీఫ్ లేడీ సెక్రటరీలను గదిలోంచి పంపించేశాడు.

గదిలో వెంకన్న, చీఫ్....ఇద్దరే వున్నారు.

"చెప్పండి—" అన్నాడు చీఫ్ తారకేశ్వర్.

"నేను ప్రభాకరరావు తరఫున వస్తున్నాను...."

"ప్రభాకరరావెవరు?"

"మా జనరల్ మేనేజరు ..."

"ఓహ్—ఆయనా?" అన్నాడు తారకేశ్వర్ ఇబ్బందిగా.

"ఆయన కిడ్నాపైన విషయం మీదాకా వచ్చింది-"

"ఊఁ" అంటూ ఎగ్జిక్యూటివ్ చైర్లో—ఇబ్బందిగా

కదిలాడు తారకేశ్వర్.

"ఆయన మీ కంపెనీకి కీలక వ్యక్తి. తన మేధా సంపత్తినంతా కంపెనీకే ధారపోస్తున్న ఆయనకు మీరిచ్చిన ప్రతిఫలం చాలా తక్కువ. ఇప్పుడు పదిలక్షల కోసం వెనుదీసి ఆయన ప్రాణాలను ప్రమాదంలో వదిలేయడం న్యాయంకాదు—" అన్నాడు వెంకన్న.

"మీరాయన తరఫున లాయరుగా వచ్చి వుంటే అయాం సారీ! ఐ హేవ్ నో టైమ్ టు స్పేర్! మనం కోర్టులో కలుసుకుందాం—"

"ఇది కోర్టు తేల్చే పరిష్కారం కాదు—మానవత్వంతో ఆలోచించాల్సిన సమస్య—" అన్నాడు వెంకన్న.

"మానవత్వం గురించి ఆలోచిస్తే పదిలక్షలిచ్చి ఆయన ప్రాణాలు రక్షించే బదులు — ఏ గుడిసెల్లో మనుషులకో యిస్తే కొన్ని వందల కుటుంబాలు నిలబడతాయి."

"కానీ మానవత్వం మాట మరిచిపోండి. కృతజ్ఞత చూపండి. మీ కంపెనీ కొన్ని కోట్ల రూపాయల ప్రయోజనం పొందిందాయనవల్ల..."

"మానవత్వం మాట మరిచిపోతే కృతజ్ఞతకు తావెక్కడ?" అని నవ్వాడు తారకేశ్వర్ —"అదీకాక కంపెనీ లాభాలకే ఒక్క వ్యక్తి కారణం కాదు. మాది సమిష్టి కృషి—"

"కానీ ప్రభాకరరావు కూతురిపెళ్ళి క్కూడా సెలవు తీసుకోకుండా కంపెనీ కోసం పనిచేశాడు. తానొక్క రోజు పని మానేస్తే కంపెనీకి లక్ష రూపాయల నష్టం వస్తుందని ఇంట్లో చెప్పేవాడు-" అన్నాడు వెంకన్న.

"మీరు చెప్పిందాంట్లో కొంత నిజముంది. ఆయన

నిజాయితీగల మనిషి. కష్టపడి పనిచేస్తాడు. కూతురి పెళ్ళంటే సెలవు పెట్టలేదు. డాక్టరాయనకు విశ్రాంతి అవసరమంటే తీసుకోలేదు. నేనాయన కిద్దరు సెక్రట రీలను శాంక్షన్ చేశాను. కంపెనీకి డబ్బు వేస్టని ఒక్క సెక్రటరీనే అపాయింట్ చేశాడు. అదీ అందమైన యువతినికాదు. నలభై యేళ్ళ మగాణ్ని! అక్కడికీ— నేనొకసారి చెప్పాను. ఓ అమ్మాయిని అపాయింట్ చేసుకుంటే రిలాక్సింగ్‌గా వుంటుందని. దానికాయన వర్క్ ఈజ్ మై రిలాక్సేషన్ అన్నాడు.

సెలవు గురించీ అంతే—తను సెలవు పెడితే కంపెనీకి నష్టమంటాడు. తను లేకపోతే కంపెనీ ఒక్క రోజుకూడా నడవదంటాడు. ఆయనలాగనుకోవడం మాకు మంచిదే. ఆయన నితరుల కాదర్శంగా చూపిస్తాం. కంపెనీ ఉద్యోగుల్లో ఆయన కారణంగా మరింత క్రమశిక్షణ పెరిగింది. ఆయన మాకో ఆస్సెట్—అనడంలో సందేహంలేదు-" అన్నాడు తారకేశ్వర్.

"కానీ—మీరాయన్ను విడిపించాలనుకోవడం లేదు."

"ప్రభాకరరావు మాకు ఆస్సెట్. కానీ పదిలక్ష రూపాయల విలువచేయడు. రెండ్రోజులుగా ఆయన ఆఫీసుకు రావడంలేదు. అప్పుడే కొత్త వ్యక్తికోసం అన్వేషణ ప్రారంభమయింది. బహుశా ఓ వారం పదిరోజుల్లో ఆయన స్థానంలో కొత్త మనిషి రావచ్చు."

"ఈలోగా ఆయన వస్తే!"

"ఆయనకు మా సంతోషపూర్వక సుస్వాగతం. కానీ పదిలక్షలడిగిన కిడ్నాపర్ల నుంచి ఆయన బయటపడ తాడని నేననుకోను."

"అంత నమ్మకంగా ఎలా చెప్పగలరు?"

"నా ఊహాకల్పన తోచింది. అంతే!"

"మీ ఊహాకల్పన కాదు. ఆ కిడ్నాపర్స్‌ని పట్టుకునేందుకే నేను రంగంలోకి దిగాను. ప్రభాకరరావును విడిపించగలనన్న నమ్మకం నాకుంది."

"విష్ యూ గుడ్ లక్!"

"అప్పుడే నాకు కొన్ని ఆధారాలు దొరికాయి. అనుమానితుల్లో మీరూ ఉన్నారు" అన్నాడు వెంకన్న.

"వ్వాట్!" అన్నాడు తారకేశ్వర్. అతడి ముఖం ఎర్రబడింది.

వెంకన్న అతడికి కంపెనీ గురించి తను విన్న విశేషం చెప్పాడు.

"వెల్ ఇమాజినేషన్! యూ కాన్ట్ ప్రూవిట్!" అన్నాడు తారకేశ్వర్.

"అది నిజమైతే— నేను తప్పక ఋజువు చేయగలను" అన్నాడు వెంకన్న.

"మన సంభాషణ ఇంతవరకూ వచ్చింది కాబట్టి అసలు విషయం నన్ను చెప్పనివ్వండి" అన్నాడు తారకేశ్వర్.

వెంకన్న కుతూహలంగా చీఫ్ వంక చూశాడు. అసలు విషయమంటూ ఒకటి వేరే వున్నదనీ అది చీఫ్ తనకు చెబుతాడని వెంకన్న అనుకోలేదు.

ప్రభాకరరావు కూతురి పెళ్ళి ఘనంగా చేశాడు. అందుకు బాగా ఖర్చయింది. అప్పు కూడా చేశాడు.

ఆయన ఆరోగ్యం బాగుండడంలేదు. వైద్యానికి చాలా ఖర్చవుతుందని అంచనా. అంత డబ్బాయనవద్ద లేదు.

ప్రభాకరరావుకు బయటినుంచి చాలా ఆఫర్స్ వస్తు

న్నాయి. వాళ్ళాయన ఆర్థికావసరాల్ని ఆసరా చేసుకుని ఆయనలో గంధర్వ ఫైనాన్స్ కార్పొరేషన్ పట్ల వ్యతిరేక భావాలు నాటుతున్నారు. ఎన్నాళ్ళు పనిచేసినా ప్రతిఫలం ఇంతేనా అంటున్నారు.

గంధర్వ ఫైనాన్స్ కార్పొరేషన్‌లో చేరినపుడు ప్రభాకరరావు సామాన్యుడు. కంపెనీ శిక్షణలో ఇంతవాడయ్యాడు. కంపెనీ ఆయన ప్రతిభనుమించి ప్రతిఫలమిచ్చింది. ఆ విషయం ఆయనకు తెలుసు. కానీ బయటినుంచి వచ్చే ఆఫర్లాయనకు మతి స్థిమితం లేకుండా చేస్తున్నాయి. అనారోగ్యం, అప్పులు, కలవమించిన ఖర్చులు చెప్పుడు మాటలు—ఆయన బుద్ధిని పెడదారిని పట్టించాయి.

"అయితే యేమంటారు?" అన్నాడు వెంకన్న,

"కిడ్నాపింగ్ అంతా ఉత్త బూటకం. ఇది ప్రభాకరరావు తెరచాటున వుండి తనే ఆడిస్తున్న నాటకం. అందుకే మాకతడిపై సింపతీ లేదు. పైగా ఆయన మాకు ఇన్‌డెస్పెన్సిబుల్ కాదని బుజువు చేయబోతున్నాం. ఆయన స్థానంలో కొత్త వ్యక్తిని నియమిస్తున్నాం."

"మీ ఊహ తప్పయితే ప్రభాకరరావు కిడ్నాపర్స్‌కి బలైపోతాడు."

"ఉయ్ కాన్ట్ హెల్పిట్! ఉయ్ హావ్ నో హాండినిట్!"

"అంటే ప్రభాకరరావుకు మీరు సాయపడరా?"

"ఆయన కావాలని తనకు తానే మాయమయ్యాడు. మా నమ్మకానికి మా బుజువులు మాకున్నాయి" అన్నాడు తారకేశ్వర్.

"కనీసం ఈ విషయం తేల్చడానికో డిటెక్టివుని అపాయింట్ చేయాల్సింది!" అన్నాడు వెంకన్న.

"ఇదాయన వ్యక్తిగత సమస్య" అన్నాడు తారకేశ్వర్.

వెంకన్న ఆయనవద్ద సెలవు తీసుకుంటూ — "మీ కంపెనీ చాలా క్రూరమైనది. మీకోసం తన సర్వస్వమూ ధారపోసిన వ్యక్తికోసం—కనీసం ఓ డిటెక్టివునైనా నియమించలేదు" అన్నాడు.

"ముందే చెప్పాను. ఆయన కిడ్నాపింగ్ ఒక బూటకం కాదనుకుంటే—డిటెక్టివు నపాయింటు చేయడం వల్ల ఆయన ప్రాణాలకే ప్రమాదం వాటిల్లవచ్చు. కిడ్నాపర్స్ హెచ్చరిక మీరు చూసేవుంటారు!"

వెంకన్న నవ్వి—"మీ కంపెనీ యాజమాన్యంలో యెవరినైనా కిడ్నాప్ చేస్తే — అప్పుడు కిడ్నాపర్స్ హెచ్చరిక వెలా తీసుకుంటారో చూడాలనుంది. నా కోరిక నెరవేరక మానదు" అన్నాడు.

## 5

డిటెక్టివ్ వెంకన్న తన సీట్లో కూర్చుని తీవ్రాలోచనలో వున్నాడు. అతడి అసిస్టెంట్సు సీతమ్మ, రాజమ్మ కూడా అదే భంగిమలో వున్నారు.

"తారకేశ్వర్ మాటల్లో నిజముందా అనిపిస్తోంది నాకు—" అన్నాడు వెంకన్న ఇంకా ఆలోచిస్తూనే.

"ఎందుకని?" అంది సీతమ్మ.

"కిడ్నాపర్స్ పదిలక్షలడగడం అసహజంగా అనిపిస్తోంది."

"ఏమో—వాళ్ళు దిగివస్తారేమో!" అంది సీతమ్మ.

"అందుకింకా నాలుగు రోజులెదురు చూడాలి. ఈలోగా మనమేమీ చేయలేమా?" అన్నాడు వెంకన్న.

"కిడ్నాపర్స్ ఉత్తరం సరాసరి ఇంట్లో లెటర్ బాక్సులో వేస్తున్నారు. ఈసారి జాగ్రత్తగా వుండి ఆ మనిషిని పట్టుకోవాలి!" అంది రాజమ్మ.

"అది అసాధ్యం. ఇరవై నాలుగ్గంటలూ ఎవరు కాపలా వుంటారా బాక్సుకి!" అన్నాడు వెంకన్న.

"సార్!" అంది రాజమ్మ చటుక్కున.

"ఊఁ"

"కిడ్నాపర్స్ ఉత్తరం ఓ పచ్చ కాగితంమీద కదూ వచ్చింది!"

"అవును."

"అలాంటి కాగితం అరుదైనది. అది నేనెక్కడో చూశాను——"

సీతమ్మ నవ్వి —— "అరుదైనదైతే మాత్రం ఆ కాగితాన్నిబట్టి పరిశోధన ప్రారంభిస్తాం?" అంది.

"ప్రారంభించవచ్చు...." అంటూ రాజమ్మ తన వ్యానిటీ బ్యాగులోంచి ఓ కాగితం తీసింది. అది లేత పసుపుపచ్చ కాగితం. ఆమె ఆ కాగితాన్ని వెంకన్న కందిస్తూ —— "కాగితాని కటువైపు అక్షరాలున్నాయి. మీరిటువైపు చూడండి బాస్!" అంది.

అయితే వెంకన్న కాగితాన్నటువైపే చూసి—— "ఇదేదో ప్రేమలేఖలాగుందే!" అన్నాడు.

"ప్లీజ్ —— చదవొద్దు బాస్!" అంది రాజమ్మ.

"అంటే నీకు ప్రేమ వ్యవహారముందన్నమాట...."

"నావైపు నుంచేంలేదు. కొందరు నాకు ఉత్తరాలు రాస్తూంటారు. అంతే!" అంది రాజమ్మ.

"మరి ఉత్తరాన్ని కూడా దాచుకునెందుకు తిరుగుతున్నట్లు?"

"కాగితం కోసం...."

"అంటే?"

"ఈ కాగితం చూడండి బాస్! ఎంతో స్పెషల్ గా వుంది. దీనికోసం ఊళ్ళోని స్టేషనరీ అండ్ పేపర్ మార్టు లన్నీ తిరిగాను. ఎక్కడా దొరకలేదు. ఆఖరికి ఉత్తరం రాసిన అబ్బాయినే కాగితం గురించి అడిగాను. తను ప్రేమగా ఉత్తరం రాస్తే కాగితం గురించి అడిగినందుకు చిన్నబుచ్చుకున్నా అసలు విషయం అతడు చెప్పాడు. ఇది వాళ్ళన్నయ్య ఫారిన్ నుంచి తెచ్చాడుట. వాళ్ళ నాన్నగారి దగ్గరే వున్నాయట లెటర్ హెడ్సన్నీ. ఆయన యెవ్వరికీ ఇవ్వడట. ఎలాగో ఒక్క కాగితం సంగ్రహించగలిగాడట—"

"ఈ కాగితం నువ్వేం చేసుకుంటావ్?" అన్నాడు వెంకన్న.

"పెర్సనల్ లెటర్స్ రాసుకుంటాను—" అంది రాజమ్మ.

వెంకన్న ఇంకేదో అనబోతుండగా—"బాస్! ఈ కాగితం ఆధారంతో మీరు కిడ్నాపర్ని తెలుసు కోవచ్చునేమోనని నా అనుమానం—" అంది రాజమ్మ.

"నిజమే—నిన్న నేను చూసినదిలాంటి. కాగితమే-" అని—"మరి నిన్న నే ఈ విషయమెందుకు చెప్పలేదు-" అన్నాడు వెంకన్న.

"సీతమ్మ వెళ్ళి మీకు మంచి సమాచారం పట్టుకొచ్చింది. ఈ కేసులో నేనూ మీకు సాయపడాలని తీవ్రంగా ఆలోచించి మూడ్ కోసం ఈ ఉత్తరం గుర్తు

చేసుకుంటే—అప్పుడు స్ఫురించింది నాకు...."

"ఇలా ఎంతమంది ఉత్తరాలు రాస్తూంటారు నీకు?" అన్నాడు వెంకన్న.

వెంటనే బల్లమీద ఫోన్ మ్రోగింది. అది వంటింటి నుంచి అని తెలుసు వెంకన్నకు. సంకోచిస్తూనే ఫోన్ తీశాడతడు.

"ఏమిటండీ? ఆ పిల్లకో మీకు మంచి స్నేహం యిస్తే దాని గురించి ఆలోచించక — ఆమె వ్యక్తిగత విషయాలడుగుతారు?" అంది పద్మావతీదేవి.

కిసుక్కున నవ్వేరు సీతమ్మ, రాజమ్మ.

బయటినుంచే ఫోన్ వచ్చినా వెంకన్నతోపాటు రాజమ్మ, సీతమ్మ కూడా వింటారు. వంటింటి ఫోన్ వినొద్దన్నా వాళ్ళతడి మాటలు లక్ష్యపెట్టరు.

వెంకన్న వాళ్ళవంక కోపంగా చూసి—"సరేలే—థాంక్స్!" అంటూ ఫోన్ పెట్టేసి గంభీరంగా ముఖం మార్చి—"ఇంతకీ ఆ అబ్బాయి వివరాలు చెప్పు—" అన్నాడు.

రాజమ్మ నవ్వాపుకుంటూ—"అతడి పేరు రామకృష్ణ. అయిదడుగుల పదంగుళాల యెత్తు. చామన ఛాయ. మీకంటే అందగాడు—" అంది.

"నాక్కావలసిన వివరా లవి కాదు—"

"అబ్బాయి వివరాలంటే అవేననుకున్నాను—"

"బీ సీరియస్—" అన్నాడు వెంకన్న.

"హోటల్ అజంతా తెలుసుగదా—ఆ పక్క వీధిలో ఎర్ర మేడ వాళ్ళది!" అంది రాజమ్మ.

"నీకా అబ్బాయిల్లు కూడా తెలుసా?"

"ఇల్లు మాత్రమే తెలుసు. మా అసిస్టెంటును కదా—

పరిశోధించి తెలుసుకున్నాను—" అంది రాజమ్మ.

"అతడి తండ్రి పేరేమిటి?"

"తెలియదు. ఇంటిముందు పెద్ద గేటు. గేటుకి శాంతి నివాస్ అన్న బోర్డుంది. ఇంటాయన పేరు లేదు—" అంది రాజమ్మ.

వెంకన్న వెంటనే ఒళ్లమీద ఫోన్ తీసి—"అన్నట్లు మనం వినీల్ నంబర్ నోట్ చేసుకోలేదు కదూ!" అన్నాడు.

అతడి నోటి వెంట మాటవచ్చేలోగా సీతమ్మ తన దగ్గరున్న డైరెక్టరీ అందుకని రెండే రెండు నిమిషాల్లో—"గంధర్వ ఫైనాన్స్ కార్పొరేషన్ జనరల్ మేనేజర్ ప్రభాకరరావుగారి రెసిడెన్షియల్ అడ్రసు, ఫోన్ నంబరు కూడా నేను చెప్పగలను—" అంది.

వెంకన్న వినీల్ కు ఫోన్ చేసి—"హోటల్ అజంతా పక్క వీధిలో ఓ ఎర్ర మేడ వుంది. శాంతినివాస్ దాని పేరు. అందులో మీకు తెలిసినవాళ్ళెవరైనా వుంటున్నారా?" అనడిగాడు.

"చంద్రమోహన్ అంకుల్ యిల్లది. ఆయన మాకు బంధువు కాదు. కానీ అంతకంటె ఆప్తులు. ఇప్పుడా యింటి ప్రసక్తి యెందుకు వచ్చింది?" అన్నాడు వినీల్.

"తరచుగా మీ నాన్నగారా యింటికి వెడుతూంటారని తెలిసి అడిగాను లే కానీ చంద్రమోహన్ గారి వివరాలింకా చెప్పగలవా?" అన్నాడు.

"ఆయనకు పాతికెకరాల మాగాణీ వుంది పల్లెటూళ్ళో. పేరున్న కంపెనీల్లో షేర్లున్నాయి. ఊళ్ళో ఎలక్ట్రానిక్ షాపులు రెండున్నాయి. నమ్మకమైన మనుషులవి చూసుకుంటున్నారు. ఆయన కిద్దరబ్బాయిలు. ఒక

అమ్మాయి. పెద్దబ్బాయి అమెరికాలో వుంటున్నాడు. అక్కడే అతడు చెల్లెలికి సంబంధం చూశాడు. కూతురు, అల్లుడు అమెరికాలోనే వుంటున్నారు.

ఇక్కడాయన దగ్గర ఒక్కడే కొడుకున్నాడు. పేరు రామకృష్ణ. బియ్యే ప్యాసయ్యాడు. ఇంకా పెళ్ళికాలేదు. అంతా ఆయనకు మించిన అదృష్టవంతుడులేడని అంటారు. జీవితాన్ని ఎంజాయ్ చేయడం తన దగ్గరే నేర్చుకోవాలని ఆయన నాన్నగారితో తరచుగా అంటూండేవాడు.

ఆయన డబ్బు బాగా విచ్చలవిడిగా ఖర్చుపెడతాడు. తను పట్టిందల్లా బంగారమవడమే అందుక్కారణమని ఆయన అంటాడు. కొందరు కిట్టనివాళ్ళు ఆయనకు అండర్ గ్రౌండ్ వ్యవహారాలున్నాయంటారు. పైకలా కనబడుతున్నా నేరాల్లో భాగస్వామ్యం వుందంటారు. మా యింట్లో యెవరూ అది నమ్మరు—" అన్నాడు వినీల్.

"మిస్టర్ వినీల్—ఐ థాంక్యూ పర్ యువర్ ఇన్ ఫర్మేషన్—"

"మా నాన్నగారి ఆచూకీ తెలుస్తుందంటారా? కిడ్నాపర్స్ బారినుంచి ఆయన్ను రక్షించుకోగలమంటారా?" అన్నాడు వినీల్ దిగులుగా.

"డోంట్ వర్రీ! నేను, చావల్లాంటి నా ఇద్దరసిస్టెంట్సు పనిచేస్తున్నాం. బహుశా కేసు త్వరగానే పరిష్కారం కావచ్చు—" అన్నాడు వెంకన్న.

"కానీ — ఇందులో మా నాన్నగారికేదైనా ప్రమాదం...."

"ఆ సంగతి నాకు గుర్తుంది. జాగ్రత్తగానే వుంటాను" అని ఫోన్ పెట్టేసి—"రాజమ్మా! యూ ఆర్ ఫంటా

నిక్....ఒక పచ్చ కాగితంతో పెద్ద కాపీ లాగావు. ఈలోజాకిక మీ యిద్దరికీ పిలవు నేను చంద్రమోహాన్ని కలుసుకుంటాను——" అన్నాడు వెంకన్న.

"చంద్రమోహాన్ ఎవరు?"

"ఎర్ర మేడకు యజమాని. రామకృష్ణకు తండ్రి——" అంటూ రాజమ్మ ప్రేమలేఖను తిరిగి ఆమెకే అందజేశాడు వెంకన్న.

"అంటే కిడ్నాపర్ చంద్రమోహానే అంటారా?" అంది సీతమ్మ ఆశ్చర్యంగా.

"ఏమో—రామకృష్ణ దక్కించుకున్నట్లే ఆ కాగితం ఇంకెవరైనా దక్కించుకుని వుండొచ్చు. ప్రస్తుతానికింకా యేమీ చెప్పలేము——" అన్నాడు వెంకన్న.

# 6

"నా పేరు వెంకన్న——" అన్నాడు వెంకన్న సోఫాలో కూర్చుంటూ.

"మీ గురించి విన్నాను. మిమ్మల్ని కలుసుకునే అవకాశం వచ్చినందుకు సంతోషంగా వుంది——" అన్నాడు చంద్రమోహాన్ తనూ కూర్చుంటూ.

"నేనెందుకొచ్చానో మీకు తెలుసా?" అన్నాడు వెంకన్న.

"వినీల్ యే విషయమైనా నాతో సంప్రదించనిదే చెయ్యడు. మీ దగ్గరకు వెళ్ళమని సలహా యిచ్చింది నేనే!" అన్నాడు చంద్రమోహాన్.

"అంటే కిడ్నాపింగ్ విషయం వినీల్ మీకూ చెప్పాడన్న మాట...."

"ఊఁ" అని నిట్టూర్చాడు చంద్రమోహాన్. "వినీల్ అనవసరంగా కంగారుపడుతున్నాడు. పదిలక్షలు కాదు

పాతిక లక్షలైనాసరే—గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ అతణ్ణి విడిపించుకొని తీరుతుంది. నా కా నమ్మకముంది—"

"ఎందుకు మీ కా నమ్మకం?"

"ప్రభాకరానికి కష్టపడ్డం తెలుసు. సుఖపడ్డం తెలియదు. ఎన్నోసార్లు చెప్పాను నేను. సులభంగా డబ్బు సంపాదించే మార్గాలెన్నో వున్నాయని! అతడు నాతో చేతులు కలిపివుంటే ఈపాటికిద్దరం సునాయాసంగా చెరో కోటి రూపాయలూ సంపాదించి వుండేవాళ్ళం" అని ఆగాడు చంద్రమోహన్.

"పోనీ—మీరో కోటిరూపాయలు సంపాదించారా?"

"ఎక్కడ? నేను కాస్త కులాసా మనిషిని. ప్రభాకరంలాంటి వాడుంటే నా దగ్గర అయిడియాలు చాలా వున్నాయి. నా తెలివికి అతడి తెలివి, కృషితోడైతే ఇంకేమైనా ఉందా? ఎన్నిసార్లు చెప్పినా అతడు వినలేదు. గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్‌లో పడే శ్రమలో యాభయ్యో వంతు నాకోసం వెచ్చిస్తే చాలన్నాను. వినలేదు. ఆరోగ్యం కూడా పాడుచేసుకుని మరీ అక్కడే శ్రమపడుతున్నాడు—"

"మీకు సాయపడలేదని అతడిమీద మీకో క్రోపమా?"

చంద్రమోహన్ నవ్వి—"నాకెవరి సాయమూ అక్కర్లేదు. ఐయాం వెరీ హాపీ విత్ వాటై హేవ్. స్నేహితుడనవసరంగా శ్రమపడుతుంటే చూడలేక అతడికి సాయపడాలనుకున్నాను. నా సాయం తీసుకోవడంలేదన్న బాధ తప్ప—అతడిమీద నాకు కోపమేమీ లేదు—" అన్నాడు.

"అతణ్ణెవరు కిడ్నాప్ చేశారంటారు?"

"వ్యక్తిగతంగా అతణ్ని కిడ్నాప్ చేయాల్సిన అవసరమేమీ యెవరికీ వుంటుందనుకోను. అలా యెవరైనా గూండాలు చేసినా పదిలక్షలు డిమాండ్ చేయరు. ఇదెవరో గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్‌కి వ్యతిరేకంగా పన్నిన కుట్ర. మూడ్రోజుల క్రితం ప్రభాకరం నాకు చెప్పాడు—తనేదో పెద్ద వ్యవహారం చూస్తున్నాననీ—అందువల్ల కంపెనీకి అయిదారుకోట్ల లాభం రావచ్చునని రానున్న రెండు మూడు వారాలూ తను దాంతో బిజీగా వుంటానని చెప్పాడు. ఓ కంపెనీకి అయిదారుకోట్ల లాభముంటే అంత మేరకు మరో కంపెనీ ప్రయోజనం దెబ్బతిన్నమాటే కదా! అలాంటి కంపెనీ యేదో ఆయన్ను కిడ్నాప్ చేసి వుంటుంది. ఆ విధంగా కనీసం పదిలక్షలు గంధర్వా ఫైనాన్స్ నుంచి వసూలు చేయొచ్చు కదా!"

"గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ నుంచి డబ్బు వస్తుందని మీకు చాలా నమ్మకంగా వున్నట్లుంది—" అన్నాడు వెంకన్న.

చంద్రమోహాన్ తడబడి—"నా ఉద్దేశ్యం అదే!" అన్నాడు.

"మీ నమ్మకం చూస్తూంటే—ఆ పదిలక్షలూ మీరే తీసుకుంటారా అనిపిస్తోంది—" అన్నాడు వెంకన్న.

చంద్రమోహాన్ చురుగ్గా వెంకన్న వంక చూసి—"ఏమిటి మీ అభిప్రాయం?" అన్నాడు.

"మీరెంతగానో నమ్మకం పెంచుకున్న గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ అభిప్రాయం మీకు చెప్పాను-"

"ఏమిటది?" అన్నాడు చంద్రమోహాన్.

"డబ్బుకోసం — ప్రభాకరరావే ఈ కిడ్నాపింగ్

నాటకమాడుతున్నాడని వాళ్ళ అభియోగం—"
అన్నాడు వెంకన్న.

"అంతా మీ కల్పన .... వాళ్ళెప్పుడూ అలాగను కోరు ...."

"ఆ కంపెనీ యెప్పుడూ దేనికీ యెవరిపైనా ఆధారపడదు. ప్రభాకరరావు లేకపోతే మరో సుధాకరరావు ఆ స్థానంలో జాయినవుతాడు—" అన్నాడు వెంకన్న.

"మీరిదంతా నాకెందుకు చెబుతున్నట్లు?"

"ప్రభాకరరావును కిడ్నాప్ చేస్తే గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ ఎంత రాన్సమ్ అయినా చెల్లిస్తుందన్న అభిప్రాయం మీలో వుంది. అది తప్పని మీరు తెలుసుకోవాలి—" అన్నాడు వెంకన్న.

చంద్రమోహన్ ముఖం గంభీరంగా అయిపోయింది-"మీరు నా మాటలు తప్పుగా అర్థం చేసుకుని—నేనే కిడ్నాపర్ ననుకుంటున్నారు. పోనీ అలాగే అనుకోండి. నా అభిప్రాయం తప్పనడానికి మీ దగ్గర ఋజువులేమైనా వున్నాయా?"

"ఉన్నాయి. నేను గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ చీఫ్ తారకేశ్వర్‌తో మాట్లాడాను. ఆ సంభాషణంతా మినీ రికార్డర్లో టేపు చేశాను. ఆ కాసెట్ను కాపీలు కూడా తీశాను. అదికూడా తెచ్చాను. కావాలంటే మీరు వినొచ్చు—" అంటూ పాంట్ జేబులోంచి—ఓ కాసెట్ తీసిచ్చాడు వెంకన్న.

చంద్రమోహన్ అప్పటికప్పుడు తన రికార్డర్లో అది విన్నాడు. వినగానే అతడి ముఖంలో రంగులు మారాయి.

"ఈ కాసెట్ నేనుంచుకోవచ్చా?" అన్నాడు చంద్రమోహన్.

"ఎందుకు?"

"ప్రభాకరం కిడ్నాపింగ్ పేరుతో నాటకమాడే రకంకాదు. కానీ ఒక వేళ నిజంగా అలా చేసివుంటే— తప్పక యేదో సమయంలో నా దగ్గరకు వస్తాడు. అప్పుడీ కాసెట్ ఆతడికి వినిపించవచ్చు—" అన్నాడు చంద్రమోహన్.

"మీకీ కాసెట్ అవసరం వుందనే అనిపిస్తోంది నాకు—"

చంద్రమోహన్ మాట మారుస్తూ—"పొరపాటున మీ పేరు వినీల్ కి చెప్పాను. సమర్థులైన డిటెక్టివులు క్లయింట్ కు సాయపడతారు. కానీ క్లయింట్ నే అనుమానిస్తూ కూర్చుంటే కేసు ముందుకు నడవదు. మీవంటి వారివల్ల క్లయింట్ కే ప్రమాదముండొచ్చు. మీరిక ఈ కేసునుండి విరమించుకోమని నా విన్నపం-" అన్నాడు.

"ఆ మాట నాకు వినీల్ చెప్పాలి—"

"వినీల్ చేత చెప్పించడం క్షణాలమీద పని నాకు. ఇప్పుడే ఫోన్ చేయమంటారా?" అన్నాడు చంద్రమోహన్.

వెంకన్న ఆశ్చర్యంగా చంద్రమోహన్ వంక చూసి- "మీరు నా గురించేమనుకున్నా ఫరవాలేదు. కానీ మీ ప్రవర్తన అనుమానాస్పదంగా వుంది. సమర్థుడైన డిటెక్టివ్ ఏం చేస్తాడో మీకు—ఈ రోజు కాకున్నా త్వరలోనే తెలియజేస్తాను-" అంటూ అక్కణ్ణించి లేచాడు.

అతడు వెళ్ళిన వెంటనే చంద్రమోహన్ వినీల్ కి ఫోన్ చేసి—"నేను వెంకన్న పేరు చెప్పడం పొరపాటు. అలాంటి డిటెక్టివ్ వల్ల మీ నాన్న ప్రాణాలకే ప్రమాదం కలగవచ్చు. అతణ్ని విరమించుకోమను. కిడ్నాపర్స్

గురించి తెలుసుకునేందుకు నేను మరో ఉపాయం చూస్తాను. నువ్వు గాబరాపడకు. మీ నాన్న ప్రాణాలకు నా ప్రాణాలు అడ్డువేస్తాను. ఆయన్ను రక్షించే భారం నాది—" అన్నాడు.

## 7

డిటెక్టివ్ వెంకన్న యిల్లు చేరేసరికి విసీల్ నుంచి సందేశం సిద్ధంగా వుంది. అతడిక కేసునుంచి విరమించుకోవాలి. దానికి వెంకన్న కంగారుపడలేదు. తీరుబడిగా ఆలోచించాడు.

చంద్రమోహన్ ప్రవర్తన విచిత్రంగా వుంది. ఆలోచిస్తుంటే అతడే ప్రభాకరరావును కిడ్నాప్ చేసినట్లు తోస్తుంది. ప్రభాకరరావు ప్రాణాలకే ప్రమాదం వుండదని హామీ యిస్తూనే, గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ వాళ్ళు పదిలక్షలూ ఇవ్వగలరని నమ్మకం వెలిబుచ్చాడు. తారకేశ్వర్ కీ తనకూ జరిగిన సంభాషణ విని కంగారుపడ్డాడు. చెప్పాలంటే దెబ్బతిన్నాడు.

ప్రభాకరరావు ద్వారా పదిలక్షలు సంపాదించాలని చంద్రమోహన్ తాపత్రయం. ఆ పథకం ఫలించేలా లేదని తెలిస్తే ఏం చేస్తాడు?

డబ్బు తప్పకుండా రాదా లేక ప్రభాకరరావును నిజంగానే....

అప్పుడే వెంకన్నకు మరో విషయం స్ఫురించింది.

తారకేశ్వర్ ప్రభాకరరావు కిడ్నాపింగ్ బూటకమని ఆరోపించాడు. అంటే ఇది ప్రభాకరరావు, చంద్రమోహన్ తో కలిసి ఆడుతున్న నాటకం కాదు కదా! అందుకు అవకాశాలు చాలా వున్నాయి. కానీ....

ప్రభాకరరావు గురించి అందిన సమాచారాన్నిబట్టి

అతడలాంటి వాడనిపించదు. కానీ ఒక్క రోజులో తను తెలుసుకున్న దాన్నిబట్టి యే వ్యక్తి వ్యక్తిత్వాన్నీ నిర్ణయించడం కష్టం.

ఏదియేమైనా చంద్రమోహాన్‌కు ప్రభాకరరావు కిడ్నాపింగ్‌తో సంబంధముందన్నది తథ్యం. ఆ విషయం వినీల్‌కు తెలుసా?

అతడి ప్రవర్తననుబట్టి చూస్తే తెలిసినట్లనిపించదు.

ఈ కేసు అంతు చూడాలి. వినీల్ వద్దన్నా తానిందులోంచి విరమించుకునేదిలేదు.

వెంకన్న అప్పటికప్పుడు ముగ్గురికి ఫోన్ చేశాడు.

వాళ్ళతడి అసిస్టెంట్సుకాదు.... కానీ పరిశోధనంటే ఆసక్తి, ఉత్సాహంగల చురుకైన మనుషులు. వెంకన్న అభిమానులు.

ఆ క్షణంనుంచీ వంతుల వారీగా చంద్రమోహాన్‌ని కనిపెట్టివుండే బాధ్యతను వెంకన్న వాళ్ళ కప్పగించాడు. ఎప్పటికప్పుడాయన కదలికల గురించి—వెంకన్నకు వాళ్లు తెలియజేస్తూండాలి.

ఆ రోజు రాత్రి తెల్లవార్లూ వెంకన్నకు ఫోన్ కాల్స్ వస్తూనే వున్నాయి. అతడు భార్య దగ్గర సుఖంగా కబుర్లు చెప్పుకుందుక్కూడా లేకపోయింది. ఒకదాని వెంట ఒకటిగా ఫోన్ కాల్స్ రావడంవల్ల అతడితో పాటు భార్యక్కూడా నిద్రలేకుండాపోయింది. అందుకు పద్మావతీదేవి బాధపడలేదు. వెంకన్న చిరాకుపడలేదు.

విచిత్రమేమిటంటే చంద్రమోహాన్ ఆ రాత్రి తెల్లవార్లూ ఇంటి బయటే వున్నాడు.

సాయంత్రం ఆరింటికల్లా ఓ గాన కచేరికి బయల్దేరాడు. అక్కడ తొమ్మిదింటిదాకా వున్నాడు. అక్క

ణ్నించి ఓ డాక్టరింటికి వెళ్ళాడు. తర్వాత యిద్దరూ కలిసి ఒక బజారులోకి వెళ్ళారు. అక్కడ ఓ యింట్లో మూడుగంటలున్నారు. అక్కణ్ణించి చంద్రమోహన్ డాక్టరింటికి తిరిగివెళ్ళి డాక్టర్ని దిగబెట్టాడు. తర్వాత క్లబ్‌కు వెళ్ళాడు. తెల్లవారుఝామున మూడు గంటల వరకూ పేకాడాడు. అప్పుడు ఇల్లు చేరాడు.

తర్వాత వెంకన్నకు ఫోన్ కాల్స్ లేవు. అసిస్టెంట్స్ వచ్చేవరకూ భార్యాభర్తలిద్దరూ మంచి నిద్రలో వున్నారు.

ఉదయం తొమ్మిదింటికల్లా వెంకన్న ఆఫీసు ప్రారంభ మవుతుంది. అసిస్టెంట్సు రాకతో నిద్రాభంగమై వెంకన్న త్వరగా లేచి వెళ్ళి వాళ్ళను పలకరించాడు.

అతడి కళ్ళు ఎర్రగా వుండడం చూసి—"సార్— నిన్న కానీ మీ పెళ్ళి రోజా?" అనడిగింది రాజమ్మ.

"ఏం?" అన్నాడు వెంకన్న.

సీతమ్మ కిసుక్కున నవ్వింది.

"మీరు మీ పనులు చూసుకోండి. నేను బయటకు వెళ్ళాలి!" అన్నాడు వెంకన్న చిరుకోపంతో.

"సార్—మీరు నా ప్రశ్నకు జవాబు చెప్పలేదు!" అంది రాజమ్మ.

"నేను వెళ్ళాక ఈ సీట్లో నా భార్యకూర్చుంటుంది. నీ ప్రశ్నకు జవాబు నా భార్య చెబుతుంది!" అన్నాడు వెంకన్న.

అసిస్టెంట్సిద్దరూ మౌనం వహించారు. ఇద్దరికీ పద్మావతీదేవి అంటే భయం. అలాగని ఆమె యెప్పుడూ వారి నేమీ అనలేదు. ఇంకా చెప్పాలంటే అభిమానంగా ఆదరిస్తుంది కూడా! కానీ వారామెతో చనువుగా వుండ

లేరు. ఒక ఉపాధ్యాయురాలిని గౌరవించినట్లా మెను గౌరవిస్తారు.

సీతమ్మ, రాజమ్మ తమతమ సీట్లలో కూర్చోగానే వెంకన్న లోపలకు వెళ్ళిపోయాడు. స్నానంచేసి అల్పాహారం భుజించి కార్లో బయటకు వెళ్ళాడతడు.

# 8

అదొక చిన్న యిల్లు.

వెంకన్న తన కారునక్కడే ఆపాడు. కొద్ది క్షణాల్లో అతడి చేతివేలు — ఇంటి ముందు కాలింగ్ బెల్ ను నొక్కింది.

మరి కొద్ది క్షణాల్లో తలుపు తెరుచుకుంది.

ఓ బలిష్ఠుడు తలుపు తీశాడు.

"నన్ను చంద్రమోహన్ పంపాడు—" అన్నాడు వెంకన్న.

ఆ వ్యక్తి పక్కకు తొలగి లోపలకు రానిచ్చాడు వెంకన్నను.

లోపల చిన్న హాలుంది. అక్కడ నాలుగు కుర్చీలున్నాయి. అందులో ఓ కుర్చీలో కూర్చున్నాడతడు.

బలిష్ఠుడు వెంకన్నను సమీపించాడు.

వెంకన్న ఆలోచిస్తున్నాడు.

ఇది ప్రభాకరరావింటికి దగ్గర్లో వున్న బజారు. ఈ బజారు దగ్గరే ప్రభాకరరావు మాయమయ్యాడు. నిన్న రాత్రి డాక్టర్ని తీసుకుని చంద్రమోహన్ ఈ బజార్లో ఈ ఇంటికే వెళ్ళాడు.

అంటే ప్రభాకరరావీ యింట్లో ఉండివుండాలి.

"ఏం పని సార్?" అన్నాడు బలిష్ఠుడు.

"ఒకసారి ప్రభాకరరావుగారిని కలుసుకుని మాట్లా

డాలి—"

బలిష్టుడతణ్ని ఎగాదిగా చూసి—"ఇప్పుడేనా?" అన్నాడు.

"ఊఁ."

"ఎందుకు?"

"చెప్పానుగా — నన్ను చంద్రమోహన్ గారు పంపారు—"

"ఒక్క నిమిషం వుండండి—" అంటూ బలిష్టుడు పక్కకు వెళ్లాడు. వెంకన్న అతణ్ని ఓరకంట గమనిస్తూ ఎటు వెడుతున్నదీ చూశాడు. కనుమరుగు కాగానే తనూ అటు వెళ్లాడు.

బలిష్టుడు పక్కనే వున్న ఓ గదిలోకి వెళ్ళి ఎవరికో ఫోన్ చేస్తున్నాడు. వెంకన్న ఆ సంభాషణ విన్నాడు.

అతడు చంద్రమోహన్‌కి ఫోన్ చేస్తున్నాడు. చంద్ర మోహన్ ఫోన్‌లో అతడికి బాగా చీవాట్లేస్తూండి వుండాలి. వెంకన్నను లోపలకు రానిచ్చినందు కతడు సంజాయిషీ యిచ్చుకుంటున్నాడు.

"అతడి పని నేను చూస్తాను సర్!" అని ఫోన్ పెట్టేశాడు బలిష్టుడు.

ఆసరికే వెంకన్న చప్పుడు చేయకుండా బలిష్టుడి వెనకజేరి అతడి రెండు భుజాలమీదా తన రెండు అర చేతులతో కొట్టాడు.

బలిష్టుడు నేలకూలాడు.

వెంకన్న ఆలస్యం చేయలేదు. గబగబా ఇల్లంతా శోధించాడు. ఇంట్లో ఫోనున్న గది, హాలుకాక మరో రెండు గదులున్నాయి. అందులో ఓ గదిలో ఓ వడి వయస్కుడు నిద్రపోతున్నాడు.

అతడే ప్రభాకరరావయ్యుండాలని వెంకన్న అనుకున్నాడు.

"ప్రభాకరరావు గారూ!" అన్నాడు వెంకన్న.

ఆ వ్యక్తికి నిద్ర లేవలేదు.

అతణ్ని లేపాలని వెంకన్న చాలా ప్రయత్నాలు చేశాడు.

అతడు బ్రతికున్న శవంలా వున్నాడు.

"ఏదో పవర్‌ఫుల్ మెడిసన్ ఇచ్చి నిద్రపోగొట్టేశారు" అనుకున్నాడు వెంకన్న. తన దగ్గరున్న మినీ కెమేరాతో ఆ గదికీ — ప్రభాకరరావుకీ ఫోటోలు తీశాడతడు.

ఇప్పుడు తనేం చేయాలి?

విసీల్‌కి ఫోన్ చేసి తండ్రి ఆచూకీ తెలిసిందని చెప్పాలా?

తనిక్కడ ఎక్కువసేపుంటే ప్రమాదం సంభవించవచ్చు. అలాగని ప్రభాకరరావును వదిలి వెళ్ళలేడు. అలా చేస్తే చంద్రమోహన్ ప్రభాకరరావును మరో చోటుకు తరలించవచ్చు. తనే యిప్పుడు తీసుకుని పోదామంటే ప్రభాకరరావు కదిలే పరిస్థితిలో లేడు. వెంకన్న కాసేపాలోచించి విసీల్‌కి ఫోన్ చేయాలనుకున్నాడు.

చకచక ఫోన్ గదిలోకి వెళ్ళాడు.

బలిష్టుడింకా అక్కడే పడివున్నాడు. అతణ్ని చూసి వెంకన్న నవ్వుకున్నాడు. స్పృహ రానడానికతడికి కనీసం ఇంకో అరగంటైనా పడుతుంది.

వెంకన్న విసీల్ నంబరు తిప్పాడు.

"హలో! హోటల్ అజంతా—"

"రాంగ్ నంబర్ ...." అంటూ ఫోన్ పెట్టేశాడు వెంకన్న.

వినీల్ నంబరతడికి బాగా గుర్తుంది. అజంతా హోటలెందుకొచ్చిందో అర్థంకాలేదతడికి. మరోసారి ఫోన్ చేశాడు.

ఎంగేజ్డ్ రింగ్ వచ్చింది.

అప్పుడే అతడి పాము చెవులు అడుగుల చప్పుడును పసిగట్టాయి.

చటుక్కున గదిలో ఓ మూలగా వెళ్ళి నక్కాడతడు.

కాసేపట్లో చంద్రమోహాన్ ఆ గదిలోకి ప్రవేశించాడు.

క్రిందపడివున్న బలిష్టుడిని లేపబోయాడు.

వెంకన్న చటుక్కున ముందుకువచ్చి—"కాసేపట్లో అతడెలాగూ తనంతట తనే లేస్తాడు కానీ ముందు వాకు ప్రభాకరరావు లేచే మార్గం చెప్పండి—" అన్నాడు.

# 9

చంద్రమోహాన్ చటుక్కున తలెత్తి చూసి—"మీరా?" అన్నాడు.

"ఆశ్చర్యంగా వుందా?" అన్నాడు వెంకన్న.

"ఎవరో అపరిచితుడు నా పేరు చెప్పి ప్రభాకరరావును చూడాలనుందన్నట్లు—సమాచారం అందగానే- అది మీరే అయుండొచ్చునని నా కనుమానం కలిగింది. అందుకే వెంటనే బయల్దేరి వచ్చాను—" అన్నాడు చంద్రమోహాన్.

"నిన్న నేను కిడ్నాపర్ మీరేనని అనుమానించగానే మీకెందుకో కోపం వచ్చిందో నా కర్థమయింది. ఉన్న

మాటంటే ఉలుకు. అంతేకదూ!" అన్నాడు వెంకన్న.

చంద్రమోహన్ ముఖం గంభీరంగా అయిపోయింది.

"వెంకన్నగారూ — విషయం ఇంతవరకూ వచ్చేక మీకు నిజం చెప్పక తప్పదు. రండి—హాల్లో కూర్చుని మాట్లాడుకుందాం—" అన్నాడు చంద్రమోహన్.

"మాట్లాడేందుకేముంది? ఇది మీ యిల్లు. కిడ్నా పయ్యాడనుకుంటున్న ప్రభాకరరావీయింట్లో స్పృహ లేకుండా పడి వున్నాడు. అక్రమ మార్గాలద్వారా మీకు ధనసంపాదన చేస్తున్నట్లు గుసగుసలు మాత్రమే వున్నాయి. వాటికీరోజు ఋజువు లభించింది. కాదంటారా?" అన్నాడు వెంకన్న తీవ్రంగా.

"అన్నీ చెబుతాను. నాతో రండి!" అన్నాడు చంద్రమోహన్.

"మీరు గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ మీద చాలా ఆశలు పెట్టుకున్నారు. ప్రభాకరరావుకోసం వారెంతైనా ఇవ్వగలరని ఆశించారు—" అన్నాడు వెంకన్న.

"ప్లీజ్ — వెంకన్నగారూ — నాతో రండి. గంధర్వా ఫైనాన్స్ వాళ్ళు ప్రభాకరరావుకోసం ఒక్క పైసా కూడా వెచ్చించరని నాకు ముందే తెలుసు. అన్నీ వివరంగా చెబుతాను. రండి. కూర్చుందాం!" అన్నాడు చంద్రమోహన్.

ఇద్దరూ హాల్లోకి వెళ్ళి కుర్చీల్లో కూర్చున్నారు.

"ప్రభాకరరావు కుటుంబం మిమ్మల్నెంతగా నమ్మింది? స్నేహధర్మాన్నికూడా పాటించకుండా మీ రిలాంటి నీచానికి పాల్పడడం...."

వెంకన్నను మధ్యలో ఆపి—"మీరు నా గురించీ ఈ

యింటి గురించీ తెలుసుకోగలరని కలలో కూడా ఊహించలేదు నేను. నిజంగా మీ పరిశోధనాశక్తి అద్భుతం. అసలిదంతా యెలా తెలుసుకున్నారో ముందుగా చెప్పండి—" అన్నాడు చంద్రమోహన్.

"పొగడ్తలతో విషయాన్ని దారి మళ్ళించవద్దు. ఈ నేరానికి మీ సంజాయిషీ ఏమిటి?" అన్నాడు వెంకన్న.

"చెబుతున్నాను వినండి. ప్రభాకర్ తన జీవితాన్ని గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్‌కి అంకితం చేశాడు. ఆ కంపెనీకా అర్హత లేదని నేనెన్నిసార్లు చెప్పినా వినలేదు. కూతురి పెళ్ళికి ముందే అతడి ఆరోగ్యం అంతంత మాత్రంగా వుండేది. ఆ పెళ్ళికైన ఖర్చులు, అప్పులు కారణంగా అతడి మనసు మరింత పాడయింది. డాక్టరతడికి విశ్రాంతి అవసరమని చెప్పాడు. దానికతడేమన్నాడంటే — ప్రాణం పోయినాసరే — విశ్రాంతి తీసుకోనని! ఎట్టి పరిస్థితుల్లోనూ తను సెలవు పెట్టనని ఖచ్చితంగా చెప్పేశాడతడు. ఇంట్లో వాళ్ళెవ్వరికీ అతణ్ణి ఒప్పించే శక్తిలేదు. నేను ప్రయత్నించి ఫెయిలయ్యాను. చివరకీ నిర్ణయానికి వచ్చాను.

ముందుగా పథకం వేసుకుని నెలరోజుల ముందుగా ఈ యిల్లద్దెకు తీసుకున్నాను. ఇది నా యిల్లని ప్రభాకరానికి తెలియదు. నేను పిలుస్తున్నట్లు చెప్పించి నా మనిషిద్వారా అతడినిక్కడ ప్రవేశపెట్టించాను. ఇంట్లో వాళ్ళకు నిజం చెప్పదల్చుకోలేదు. వాళ్ళీ రహస్యాన్ని ప్రభాకరం దగ్గర దాచలేరు. కిడ్నాపింగ్ నిజంగానే జరిగిందని ప్రభాకరం అనుకోవాలి. లేకుంటే తర్వాత మా అందరి ప్రాణాలూ తీస్తాడు.

అతడి మెదడుకు పూర్తి విశ్రాంతి కావాలి. ఆఫీసు

గురించి బెంగలేకుండా అతణ్ని ప్రస్తుతం మత్తులో వుంచుతున్నాను. డాక్టరు ద్వారా వైద్యం జరిపిస్తున్నాను. అతడికి పూర్తి ఆరోగ్యం చేకూరడానికి వారం పదిరోజులు పడుతుంది. అందుకే పదిలక్షలడిగాను. ఒకటీ రెండూ అడిగితే విసీల్ సర్దుకుగలడు. పది అడిగితే తేలేడు. అతడికి వారం రోజులు గడువిచ్చాను. ఇంకో వారం గడువిస్తాను. ఈలోగా ప్రభాకరం మామూలు మనిషవుతాడు. అప్పుడు మీరతణ్ని విడిపించండి. అంతవరకూ యేదోవిధంగా అతడి కుటుంబ సభ్యులకు ధైర్యం చెప్పండి—" అన్నాడు చంద్రమోహన్.

"కానీ ఇదంతా ఎందుకు? ఇందువల్ల మీకు ప్రయోజనం?" అన్నాడు వెంకన్న.

"తను లేకున్నా కంపెనీ పని ఆగిపోదనీ కంపెనీ తన ప్రాణాల గురించి ఒక్క పైసాకూడా వెచ్చించదనీ—తను తన గురించికూడా ఆలోచించడం నేర్చుకోవాలనీ మా ప్రభాకరానికి తెలియాలి. అందుకు మీరు సంపాదించిన కాసెట్ తెలియజెప్పగలదు. మీకు మాటిస్తున్నాను కావాలంటే కాగితంకూడా రాసిస్తాను. వేనాడుతున్న ఈ నాటకంలో నేనొక్క పైసాకూడా ప్రతిఫలమాశించను. విసీల్ ఎక్కడ డబ్బుకోసం ప్రయత్నం చేస్తాడోనని—గంధర్వా ఫైనాన్స్ కార్పొరేషన్ తప్పక డబ్బిస్తుందని నమ్ముతున్నాను. నిన్న మీరంత కచ్చితంగా ఆ విషయాన్ని కొట్టిపారేసేసరికి విసీల్ గురించే నేను భయపడ్డాను. ఈ విషయంలో నాకు సహకరించరూ?"

వెంకన్న లేచి నిలబడి — "ప్రభాకరావు ఆరోగ్యం కుదుటపడేవరకూ మీ నాటకం కొనసాగించండి. అందుకు నా సహకారం వుంటుంది. మీవంటి స్నేహితుడున్న

ప్రభాకరరావు ధన్యజీవి. వినీల్ కు ధైర్యం చెప్పి నాటకాన్ని కొనసాగిస్తాను. తారకేశ్వర్ కాసెట్ విషయం ప్రస్తుతానికి రహస్యంగా వుంచుదాం. మీకు నా అభినందనలతో పాటు విన్నపం కూడా వుంది. నాకూ మీ స్నేహం కావాలి!" అన్నాడు.

చంద్రమోహన్ వెంకన్నతో కరచాలనం చేశాడు. ఆ స్పర్శలో స్నేహపు వెచ్చదనం వుంది.

—:అ యి పో యి ం ది:—

# అడవి దొంగలు

## కె. వి. రమణ

జీపు రాజస్థాన్‌లోని సోనార్ అడవుల్లో ప్రవేశించి అరగంట అయ్యింటుంది.

ఎన్నో యేళ్ళ క్రిందట నిర్మించబడిన ఘాట్ రోడ్డు విశాఖపట్నం మెయిన్ రోడ్ల కన్నా అధ్వాన్నంగా వుంది. జీపు మాటి మాటికీ ఎగిరెగిరిపడుతూం టే స్వస్థలమయిన విశాఖనగరం పదేపదే గుర్తొస్తూ విచిత్రంగా నిద్ర పట్టేసింది.

ఒక్కసారి "ఢాం" అనే చప్పుడుతో తెలివొచ్చి చటుక్కున్న కళ్ళు తెరిచాను.

"టైరు పేలిందా?" ప్రశ్నించాను డ్రైవర్ని. కాదని నాకూ తెలుసు. అది తుపాకీ ధ్వని. కానీ తామింకా సోనార్ అడవుల్లో ప్రారంభదశలోనే వున్నాం. ఇంత వేగంగా శత్రువులు దాడిచేస్తారా? అదే సందేహం!

"సహీసాబ్! ఎవరో చాటునుండి తుపాకీ పేల్చారు!" డ్రైవింగ్ సీటుకింద నూరివున్న డ్రైవరు గజగజ వణు

ఊతూ చెప్పాడు. ఇంతలో మరోసారి పేలింది తుపాకీ. విండ్ స్క్రీన్ భళ్ళున ముక్కలయి గుండు దాదాపుగా నన్ను రాసుకుంటూ పోయింది.

జీపులో వుంటే ప్రమాదం! దాడి ముంగునుంచి జరుగుతోంది. సీట్లో వంగి నా ఫారూన్ గన్ అందుకున్నాను. జీపులోనుండి పాములా కిందకు జారి జీపు వెనక్కి చేరాను. చుట్టూ దట్టమయిన అడవి. లెక్కకుమించి రాబందులు ఆకాశంలో చక్కర్లు కొడుతున్నాయి. శత్రువులో, తామిద్దరమో శవాలుకాక తప్పదన్నమాట!

జీపు ప్రక్కనుండి ముందుకు చూశాను. 'ధన్'మనే చప్పుడుతో చురుక్కుమంది చెవి. అదే సమయంలో పొగ అంచవాగా ఓ గుబురు చెట్టు దిశలో రెండుసార్లు గర్జించింది నా ఫారూన్! ఫలితం వెంటనే కనపడింది. కవ్వున ఆర్తనాదం. చెట్టుకొమ్మలు పటపటలాడుతూ నేలమీద దబ్బున చప్పుడయింది.

కొద్ది నిమిషాలు నిశ్శబ్దం. తుపాకీ చప్పుళ్ళుబట్టి అవి రెండూ వేరు వేరు జాతులు. కాబట్టి శత్రువులు యిద్దరన్న మాట! నెమ్మదిగా లేచి చెట్టు ఖాళీ అయిన దిశలో ఒకింత అప్రమత్తంగానే మోకాళ్ళమీద ప్రాకుతూ వెళ్ళాను. జీపు ముందు భాగాన్ని చేరి ఖాళీ అయిన గుళ్ళు రెండూ లోడ్ చేశాను. తిరిగి నాలుగు గుళ్ళతో ఆవురావురుమంటోంది నా ఫారూన్!

తలపైకెత్తి ఎదురుగా చెట్లలో ఒకేఒక గుండు పేల్చి తిరిగి చటుక్కున కూర్చుండిపోయాను. గుండు నా తల మీదనుండి జవాబుగా వచ్చిందటునుండి. వెంటనే మెరుపులా లేచి శత్రువు తుపాకీ పేలిన దిశగా నా ఫారూన్ ట్రిగ్గర్ని మూడుసార్లు నొక్కాను. ఫారూన్

ఖాళీ అయింది. ఎదురుగా చెట్టుకయితం ఖాళీ అవుతూ కెవ్వున అరచి కిందపడ్డాడు శత్రువు.

పదినిమిషాలు గడిచాయి. అరణ్యమంతటా మామూలు పరిస్థితులు నెలకొన్నాయి. రాబందులు ఆకాశాన్ని ఖాళీ చేసి భూమి దిశగా వాలుతున్నాయి. ఇక మీరు వెళ్ళొచ్చు అన్నట్టుగా! తుపాకీ జీపుకి ఆనించి సిగరెట్ వెలిగిస్తూ అన్నాను!

"మహావీర్!"

"జీ సాబ్!" సీటుకింద నుండి వుడుంపిల్ల మాదిరి పైకి వస్తూ జవాబిచ్చాడు డ్రైవర్ మహావీర్.

"ఇక పోదామా!"

"అచ్ఛా సాబ్" జీపు స్టార్టు చేశాడు మహావీర్.

మహావీర్ టకటకా గేర్లు మార్చి జీపును ముందుకు దూకించాడు విప్పారిన మొహంతో ఓ క్షణం వెనక్కి తిరుగుతూ.

"సాబ్! నువ్వు చాలా చురుకయిన వాడివి. తుపాకీ చప్పుడు వినపడగానే ఇక మన పని అయిపోయిందను కున్నాను" అన్నాడు.

చిరునవ్వు నవ్వి సీటు వెనక్కి వాలుతూ కళ్ళు మూసుకున్నాను. శత్రువులు నేను వూహించిన దాని కన్నా ముందున్నారు. వాళ్ళ మొదటి ప్రయత్నం భగ్న మయింది. మున్ముందు ఇంకెన్ని అవాంతరాలో. అను క్షణం జాగ్రత్తగా వుండాలి; అనుకున్నాను. సోనార్ అడవుల్లోని అడవి దొంగలను మట్టుబెట్టటానికి రాజస్థాన్ ప్రభుత్వం నన్ను నియమించింది.

ఘాట్ రోడ్డు దిగి పల్లంలో ఓ రెండు ఫర్లాంగులు వెళ్ళి దుమ్ము రేపుకుంటూ ఓ రెండంతస్తుల కర్రల భవనం

ముందు ఆగింది జీపు.

సీటులోనుండి నెమ్మదిగా లేచి కింద అడుగు మోపాను. సోనార్ అడవిలో ఏకబిగిని సుమారు నూటయాభై మైళ్ళు ప్రయాణం చేసి వుంటాం. డ్రైవరు, నేను ఆనవాలు లేకుండా మట్టి కొట్టుకుపోయాం. నల్లని జీపు ఎర్రని మట్టిరూపు దాల్చింది.

ఒంటిమీద అంగుళం దళసరిలో పేరుకుపోయింది ఎర్ర మట్టి. రెండు చేతులా బట్టలు దులిపాను. తట్టెడు బుగ్గి క్రింద రాలింది. జీపులో వున్న సరంజామాను మహావీర్ క్రింద పెడుతుండగా రెండంతస్థుల భవనంలోనుండి పరుగున వచ్చారు ఇద్దరు ఫారెస్టు గార్డులు. నా చేతిలో సామాన్లు అందుకున్నారు.

తుపాకీ భుజానికి తగిలించి ఆర్మీ కిట్ నేనే పట్టుకున్నాను. ఎత్తయిన దిబ్బమీద కట్టబడిన ఆ రెండంతస్థుల చెక్కల భవనమే ప్రభుత్వ ఫారెస్టు కార్యాలయం. సోనార్ అడవుల రేంజి ఆఫీసర్ గోవింద్ అగర్వాల్ చేయిచాచి సాదరంగా ఆహ్వానించాడు నన్ను.

సుమారు యాభై ఏళ్ళ వయసులో దబ్బపండులా వున్నాడాయన. అరణ్య జీవితానికి అలవాటు పడ్డ మనిషిలా రాటుదేరి వున్నాడు అగర్వాల్. ఎప్పుడూ చిరునవ్వు చిందించే మోము అతనిపట్ల యితరులకు గౌరవ భావాన్ని కలుగజేస్తుంది.

"మిష్టర్ విక్రమ్! మీ విషయం మినిస్ట్రీ ఆఫ్ ఫారెస్ట్స్ ద్వారా నిన్ననే మాకు మెసేజ్ వచ్చింది. గ్లాడ్ టు మీట్ యు అండ్ విష్ యు ఆల్ ద బెస్టు" అంటూ కుర్చీ చూపించాడు అగర్వాల్ తనొక కుర్చీలో ఆసీనుడవుతూ.

అడవి దొంగల విషయంలో ఇద్దరం కొద్దిసేపు సంభాషణలు జరిపాం. మాటల సందర్భంలో సోనార్ పాలిమేరల్లోనే నాకు శత్రువులనుండి యెదురయిన స్వాగత సత్కారాల విషయం ప్రస్తావనకు వచ్చింది. ఆ విషయం వింటూనే మాటలు ఆపి కొద్దిసేపు నా మొహంలోకి ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయారాయన. చివరకు పెద్దగా నిట్టూరుస్తూ:

"ఏమయితే నేం! మనం అదృష్టవంతులం. నాకు తెలుసు వాళ్ళు ఇంతటితో ఆగరు. మై డియర్ బాయ్! నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి సుమా! ఓ.కే. ఇప్పటికిది చాలు. మిగిలిన విషయాలు రేపు మాట్లాడుకుందాం. ప్రయాణంవల్ల బాగా అలసివుంటావు. టేక్ రెస్టు!" అంటూ కుర్చీలోనుండి లేచారాయన.

అగర్వాల్‌కి గుడ్ బై చెప్పి పై అంతస్థులో నాకోసమని కేటాయించిన గది చేరాను.

కింద భాగంలో కొంత ఆఫీసుకుపోగా మిగిలిన వాటాలో అగర్వాల్ వుంటున్నారు. అగర్వాల్‌కి పిల్లాపీచూ లేరు. భార్యకు కొద్దిగా మతిభ్రమణం. ఆ కారణంగా ఆమెను ఫుట్టిట్లోనే వుంచారాయన. ఇన్ని బాధలు వుండీ ఏమీ లేనట్టు నిశ్చింతగా వుండడమే అగర్వాల్ ప్రత్యేకత!

స్నానం, భోజనం వగయిరాలు చకచకా పూర్తయ్యాయి. మరో ఆలోచన లేకుండా మంచంమీద నిద్రకుపక్రమించాను. సుదీర్ఘమయిన ఘాట్ రోడ్ ప్రయాణం. శరీరమంతా నజ్జుయిపోయింది. ఇలా కళ్ళుమూసానో లేదో అలా నిద్రపట్టేసింది.

# 2

ఒళ్ళు తెలియని మత్తునిద్రలో సయితం చీమచిటుక్కుమంటే చటుక్కుమంటూ తెలివొస్తుంది నాకు. కళ్ళు తెరిచి వున్నపాటున కదలకుండగనే చుట్టూ చూశాను.

కిటికీ తలుపు తెరచుకొని నెమ్మదిగా లోనికి ప్రవేశిస్తున్నాడొక వ్యక్తి.

నేలకు సుమారు ముప్ఫై అడుగుల ఎత్తులో, ఎక్కివచ్చేందుకు మరే ఆధారమూ లేని పరిస్థితిలో వుందా కిటికీ! పడుకునేముందు తను అన్నీ పరిశీలించాడు. బహుశా కిటికీ చేరువలో వుండే వేపచెట్టుకొమ్మలనుండి యే తాడో వేలాడదీసి లోనికి చేరివుండాలా వ్యక్తి!

బాగా పొడవుగా బలంగా వున్నాడు. చీకటిలో కలిసిపోయేలా నల్లని ఛాయ. కిటికీవద్ద క్షణకాలం నిలిచి గదంతా పరిశీలనగా చూశాడు. నడుమున బిగించి కట్టిన పంచె తప్ప అతని ఒంటిమీద మరే ఆచ్ఛాదనలేదు. చిరుచెమటలతో తడిసిన శరీరంతో నల్లత్రాచులా నిగనిగలాడుతున్నాడు.

మొల దగ్గర తడిమాడు. మరుక్షణం చేతిలో తళుక్కుమంటూ ప్రత్యక్షమయ్యింది పిడిబాకు. చేయెత్తి నావైపు విసిరాడు బలంగా. రయ్ .. య్....మంటూ సూటిగా దూసుకువచ్చింది. సరిగ్గా నా గుండెల్లో దిగవలసిన బాకు నేను చటుక్కున ప్రక్కకు దొర్లడం వలన పరుపులో దిగబడింది.

వూహించని పరిణామానికి బిత్తరపోయి తత్తరపడ్డాడా వ్యక్తి. నేను లేచి నిలబడ్డాను. తలగడకింద పిస్టల్ దాదాపు నాకు అందుబాటులోనే వుంది. ఆ వ్యక్తిని గాయపర్చడమో, చంపడమో నా ఉద్దేశ్యం కాదు.

మామూలు పరిస్థితుల్లో వాణ్ని ప్రాణాలతో పట్టుకోవా లన్నదే నా ధ్యేయం!

వాడు చటుక్కున మొలకు వేలాడుతున్న ఒరలో నుండి ఓ కత్తిని లాగాడు. తంపుగా పదును దేరి చీకటిలో సయితం తళుక్కుమంటోందది. పులులు పందులు ఒకే దెబ్బకు రెండు భాగాలు కాగల వేటకత్తి అది!

వికటంగా నవ్వుతూ కత్తిని విలాసంగా తిప్పుతూ ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తున్నాడా వ్యక్తి.

"అడవి దొంగల్ని ఒంటరిగా యెదుర్కొనగల వీరుడి వటగా! కాచుకో నా దెబ్బ!" అంటూ ఛెంగున మాకా డావ్యక్తి.

నేను లాఘవంగా ప్రక్కకు గెంతాను. నా కుడి చేతిని శరీరంనుండి వేరు చేసేందుకు వువ్విళ్ళూరుతూ కిందకు దిగిన కత్తి మంచం దండాన్ని కసిగా రెండుముక్కలు చేసింది. నేను వెంటనే కుడికాలు మడిచి వాడి ప్రక్కలో తన్నాను బలంగా. మంచంమీదనుండి యెగురుతూపోయి అవతల పడ్డాడు వాడు.

రెట్టించిన కోపంతో లేచి తిరిగి మంచంమీదుగా యెగిరి నా మీదకు వస్తున్నాడు వాడు. నేను చటుక్కున మంచాన్ని పైకి తన్నాను కాలితో. మంచం హాఠాత్తుగా వాడి కాళ్ళకు అడ్డుపడి నా కాళ్ళ దగ్గర కప్పలా పడ్డాడు వాడు.

కుడి కాలు చాచి వాడి గడ్డంకింద తన్నాను. కెవ్వున అరుస్తూ మూడు మొగ్గలువేసి తిరిగి కిటికీ దగ్గర పడ్డాడు వాడు. అన్ని దెబ్బలూ తనవే కావడం ఒంటికి కారం రాసినట్టుంది వాడికి. మొహం వికృతిరూపం దాల్చింది.

కసాయివాడు పశువును నరికినట్టు నన్ను నిలువునా నరికి పోగులు పెట్టాలన్నంత కసి వాడి కళ్ళల్లో ప్రతిఫలిస్తోంది. వేటు కత్తిని రెండు చేతులాపట్టి యెత్తి భయంకరంగా అరుస్తూ నావేపు దూసుకురాసాగా డా వ్యక్తి.

నేను యేమాత్రం చలించక వాణ్ని బాగా చేరువ కానిచ్చాను. ఆ వ్యక్తి కత్తిని నా తలకు గురిచేసి ఒక్క సారిగా ముందుకు దూకాడు.

నేను మెరుపు వేగంతో ప్రక్కకు గెంతి బూటు కాలితో ఆ వ్యక్తి రెండు కాళ్ళమీదా తన్నాడు. ఆ విసురులో కాళ్ళు రెండు తేలిపోగా ముందుకు బోర్లా పడ్డాడు వాడు. వేట కత్తి ఆ వూపులో అదుపుతప్పి అతడి పొత్తికడుపులోనుండి వెన్నపైకి దూసుకువచ్చింది. ఒకే ఒక్క మూలుగుతో ప్రాణాలు వదిలా డా వ్యక్తి.

ఇంతలో తలుపు దబదబా చప్పుడయింది. కాళ్ళీడ్చు కుంటూ వెళ్ళి తలుపు తెరిచాను. అగర్వాల్. చేతిలో పిస్తోలుతో:

“ఏమయింది....విక్రమ్....!” అంటూ కంగారుగా లోపలికి ప్రవేశించి ఎదురుగా కనబడిన దృశ్యంచూసి నిశ్చేష్టుడయ్యాడు. కొద్ది సేపటికి తేరుకుంటూ అతనే:

“మొదట కిందకు చప్పుడు వినపడితే యే ఎలకనో కొడుతున్నావనుకున్నాను” అంటూ చచ్చిన ఆ వ్యక్తిని సమీపించి బూటుకాలితో శవాన్ని ప్రక్కకు దొర్లించాడు. మరుక్షణం కళ్ళు పెద్దవిచేస్తూ.

“విక్రమ్! వీడు ఆ అడవి దొంగల్లో వ్యక్తే. పేరు భాంగ్రా. కొండజాతి వ్యక్తి. ఎన్ని హత్యలు చేశాడో లెక్కలేదు. రిక్త హస్తాలతో హత్యలు చేయడంలో వీడికి

ఏదే సాటి. అటువంటివాడి చేతిలో ఇంత దారుణమయిన ఆయుధం వుండీ నీ చేతిలో చచ్చాడు. ఏమో అనుకున్నాను. రియల్లీ యూ ఆర్ గ్రేట్!" అన్నాడు అగర్వాల్ అభినందనగా నా భుజం తడుతూ.

# 3

ఉదయం టిఫిను వగయిరాలు పూర్తిచేసి ఫారూన్ చేతబట్టి బయట షెడ్‌లో కట్టివున్న గుర్రాలలో ఒక దానిని పైకి లాగాను. సోనార్ అడవుల్లో ఫారెస్టు సిబ్బంది అంతా గుర్రాల్నే వాడతారు. గుర్రాన్ని అధిరోహించి వెళుతుండగా అగర్వాల్ మెట్లు దిగుతూ:

"హలో బాయ్! వెంట రానా" అన్నారు.

"నో! థాంక్స్! వూరకనే అలా రెండు చక్కర్లు కొట్టివస్తానంతే!"

"ఏనీ హౌ! కా త్రగ వా! ఓ ఇద్దరు గార్డుల్నయినా."

"అక్కర్లేదు సర్! నే ఒక్కణ్ణే పోయిరాగలను.... హై .... హై ...." గుర్రాన్ని అదిలించాను.

అగర్వాల్ నిట్టూరుస్తూ "ఓ. కె. బి కేర్‌ఫుల్" అన్నారు చేయి వూపుతూ. గుర్రం పెద్దగా సకిలిస్తూ అరణ్య మార్గం పట్టింది.

కనుచూపు మేర బ్రహ్మాండమయిన వృక్షాలు నిండి అడవి దట్టంగా వ్యాపించి వుందక్కడ. సన్నని బాటగుండా పరుగెడుతోంది అశ్వం. ఇంతలో దిక్కులు పిక్కటిల్లే శబ్దంతో పేలింది తుపాకీ. గుండు సరిగ్గా నా అశ్వం ముందు కాళ్ళ మధ్య గుండె ప్రాంతాన్ని చీల్చుకు పోయింది.

వెంటనే కుప్పకూలిపోయింది గుర్రం. గుర్రంతో బాటు కిందపడుతూనే జీనుకి తగిలించివున్న నా ఫారూన్ గన్ని

పైకి లాగుతూ ప్రక్కనే వున్న పొదల్లోకి దొర్లాను. రెండు మూడు తుపాకులు నామీద వరుసగా ప్రయోగించబడినప్పటికీ నేను తెలివిగా తొందరగా తీసుకున్న నిర్ణయం వల్ల బ్రతికిపోయాను.

నామీద తుపాకులు పేల్చిన నలుగురూ చెట్ల చాటు నుండి బయటపడి ముందుకు రాసాగారు వేగంగా. నా చేతులు విద్యుత్తునుమించి వేగంగా పని చేశాయి.

నలుగురూ ఆర్తనాదాలు చేస్తూ తుపాకులు వదిలి నేల కూలారు. ఫారూక్ తిరిగి లోడ్ చేస్తుండగా ధన్ మంటూ పేలిందో తుపాకీ. నా చేతిలో ఫారూక్ అల్లంత దూరాన ఎగిరిపడింది.

మొహానికి నల్లని మాస్క్ ధరించిన వ్యక్తి ఎదురుగా నిలబడి వున్నాడు. దుస్తులు సయితం నల్లనివే ధరించాడు. అతని వెంట నలుగురు వ్యక్తులు తుపాకులు ధరించి వున్నారు.

"ఊఁ.... ముందు వీణ్ణి కాళ్ళూ చేతులూ కట్టిపడేయ్యండి" అరిచాడు ముసుగు వ్యక్తి మనిషి చూడగా ఆబోతునుమించి వున్నాడు. గొంతు తీతువుపిట్ట అరిచినట్టుంది.

నలుగురూ ఏకమయి నా చేతుల్ని వెనక్కి విరిచి కట్టేశారు. కాళ్ళు రెండూ ఓ పొడవాటి తాడుకు కట్టి రెండో కొసను ఎత్తయిన చెట్టు కొమ్మపైనుండి కిందకు లాగారు. తలక్రిందులుగా వేలాడుతూ అలా పైకిపోయాను నేను. సరిగ్గా నా తలకు సూటిగా కింద నేలమీద ఐదారడుగుల మేర కర్రతో శూలాలు అప్పటికప్పుడు చేసినవి పాతిపెట్టారు.

వేలాడే తాడుకు ఒకడు నిప్పంటించి చెట్టుదిగిపోయాడు.

అందరూ గుర్రాలెక్కారు. ముసుగుమనిషి తలపైకెత్తి నన్ను దేశించి:

"ఒరేయ్! .. నిజానికి నిన్ను చంపాలంటే ఒకే ఒక బులెట్ చాలు. కానీ నువ్విప్పటికి మా మనుషుల్ని చాలా మందిని పొట్టన బెట్టుకున్నావు. అందుకే నువ్వు సులభంగా చావకూడదు. చచ్చేముందు క్షణాలు లెక్క పెడుతూ నరకయాతనపడు. అదే నీకు తగిన శిక్ష" అని కీచు కీచులాడి ఒక అనుచరుణ్ని పిలిచి,

"నువ్విక్కడే వుండి. వీడి చావు కళ్ళారాచూసిరా!" అన్నాడు గుర్రాన్ని అదిలిస్తూ. మిగిలినవాళ్ళంతా పక పక నవ్వుతూ అతణ్ని అనుసరించారు.

తాడు నెమదిగా కాలుతూ నన్ను క్షణక్షణం మృత్యువుకి చేరువుగా తీసుకుపోతోంది. తాడు పట్టుతప్పిన మరుక్షణం సూదికొయ్యలమీద తన చావు ఖాయం. రమారమి నలభై అడుగుల ఎత్తు. తలలో నాటిన కొయ్యలు గుండెల్ని దాటిపోతాయి. ఏ దేవుడో దిగి వచ్చి ఆ క్షణాన గాలిరూపంలో కొయ్యల్ని దాటించినా కింద తుపాకీ చేతబట్టి యముడిబాబులా వీడొకడు!

ముసుగు వ్యక్తి చెప్పినట్టు క్షణాలు లెక్కపెడుతున్నాను. తాడు దాదాపు సగం కాలింది. దాదాపుగా మృత్యువు నోటిలో వున్నట్టే లెక్క. చివరిక్షణాల్లో తెగించి ఒక నిశ్చయానికొచ్చాను. చావు ఎటూ తప్పదన్నప్పుడు ఏదో ఒక సాహసం చేసి చావడం ఉత్తమం కదా!

వూపిరి బిగించి శరీరాన్ని ముందు వెనుకలకు కదిలించాను. అందుకు తగ్గట్టు గాలిసయితం అనుకూలంగావుంది.

వుయ్యాల వూపు వచ్చింది త్వరలో. కింద కాపలా వాడికి నా వుద్దేశ మేమిటో అర్థంకాక ఆశ్చర్యపోతూ:

"ఏయ్! వేగంగా చావాలని వుందా? ఫూల్ ...."

అంటున్నాడు పెద్దగా. వూపు పెరిగింది ఒకేసారి. ఫట ఫటలాడుతూ తెగింది తాడు. లెక్క మేరకు రివ్వున పోయి ఆ వూపున అడవిదొంగ తలను తాకింది నా తల. అడవి దొంగవు కళ్ళు బైర్లుకమ్మాయి. తల పట్టుకుంటూ స్పృహ తప్పి నేలమీద పడిపోయాడు. నా తలా దిమ్మెక్కి దాదాపుగా స్పృహ తప్పినంత పనయింది. అయినా నేను దెబ్బ కాచుకు నేందుకు ముందే సిద్ధపడిన కారణంగా అంత పనీ జరగలేదు.

నెమ్మదిగా లేచి నిలబడి గెంతుతూపోయి నేలమీద పాతబడిన కొయ్యల మధ్య నా చేతి కట్లువుంచి అటూ యిటూ మెట్టగించాను. లతలతో కట్టిన కట్లు కావడం వలన ఒక్కొక్కటీ సులభంగానే తెగిపోయాయి.

కట్లు విదిల్చి తిమ్మిరెక్కిన చేతుల్ని రుద్దుకుంటూ వున్న తరుణంలో స్పృహతప్పిన అడవిదొంగ తేరుకొని కంగారు పడుతూ తుపాకీ అందుకున్నాడు. అరక్షణం ఆలస్య మయితే నా ప్రాణాలు అనంతవాయువుల్లో లీనమయి పోతాయి.

నేలమీద పాతబడి వున్న కొయ్యల్లో ఒకదానిని చటుక్కున పీకి ఆ వూపున అడవిదొంగ దిశగా విసిరాను. అడవిదొంగ తుపాకీ పేల్చే సమయానికి కొయ్య సూటిగా వాడి గుండెల్లో దూరింది. తుపాకీ పేలింది. అదే సమ యంలో అడవిదొంగ నోరు తెరిచి అరిచాడు బాధగా. తుపాకీ గుండు లక్ష్యాన్ని తప్పి ఎటో పోయింది. అడవి దొంగ కళ్ళు తేలేసాడు.

బాగా చీకటి పడుతుండగా ఫారెస్టు ఆఫీసు చేరాను. అప్పటికే అగర్వాల్ వాళ్ళసమని మనుషుల్ని వెంట బెట్టుకు ప్రయాణమవుతున్నాడు.

"అరే విక్రమ్! వుదయమనగా వెళ్ళిన వాడివి, ఇంత వరకూ ఏం చేస్తున్నావ్" అన్నాడు అగర్వాల్ ఆందోళన పడుతూ.

జరిగింది చెప్పాను. "నే ముందే చెప్పలా! అడవిలోకి తోడు లేనిదే వెళ్ళకు ఇకనయినా" అన్నారు అగర్వాల్ మందలింపుగా.

## 4

మరుసటి రోజు నిద్ర లేస్తూనే టవల్ పట్టుకొని స్నానానికి బయల్దేరాను. ఆఫీసుకు నాలుగయిదు ఫర్లాంగుల దూరంలో ఒక వాగు ప్రవహిస్తూ వుంటుంది. ఆ వాగులో స్నానం చాలా సరదాగా వుంటుంది.

అగర్వాల్ మెట్లదగ్గర కుర్చీలో కూర్చొని దంతధావనం చేస్తున్నారు.

"ఎక్కడికి? స్నానానికేనా! ఓ పది నిముషాలు ఆగు నేనూ వస్తాను." అన్నారాయన.

అతనితో నడిస్తే తొవ ఎంతకీ తరగదు. "మీరు రండి. నేను వాగు ఒడ్డున కూర్చుంటాను" అన్నాను.

గలగలా కరిగిన వెండిలా ప్రవహిస్తోంది వాగు. వాగు కిరుప్రక్కలా రంగు రంగుల పూలచెట్లు. చల్లని చిరుగాలి. ఆహ్లాదంగా వుంది వాతావరణం.

ఇంతలో వాగుకు అవతలినుంచి ఎవరో అరుస్తూవుండడం చెవినపడింది. అది పురుషుడి కంఠం.

"అయ్యో! ఎత్తుకపోతున్నాడు.... నా భార్య.... రక్షించండి.... రక్షించండి...." హృదయ విదారకంగా

వుందా స్వరం.

వెంటనే వాగులోకి దిగాను. అంతా కలిపి నడుము లోతు మించదెక్కడా. వాగు వెడల్పు మహావుంటే యాభై అరవై అడుగులు. రెండే నిముషాల్లో వాగు దాటాను.

ఒక కోయజాతి యువకుడు నన్ను చూస్తూనే "దొరా! వాడెవడో నా భార్యని పట్టుకుపోతున్నాడు. రక్షించండి...." అంటున్నాడు చేతిని గుబురు చెట్లలోపు దిశగా చూపుతూ. ఆ చేతిలో తళ తళ మెరుస్తూ వుందొక గండ్రగొడ్డలి.

"వాళ్ళెంతమంది?" ప్రశ్నించాను.

"ఒక్కడే దొరా!...." దుఃఖాన్ని దిగమింగుతూ బదులిచ్చాడు వాడు.

"చేతిలో పరుశువు వుండగా ఒక్కగానొక్క వెధవకి పెళ్ళాన్ని ఒప్పజెప్పి ఏడుస్తున్నావా! ....సిగ్గులేమా.... నువు కోయవాడివేనా" అన్నాను కోపంగా.

కోయవాడు సిగ్గుపడుతూ బాధగా "అదికాదు దొరా! నా కాలు...." అంటూ పెద్దగా కట్టులో వున్న తన కుడి కాలు చూపించాడు. అదింకా రక్తాన్ని చిమ్ముతూనే వుంది.

"చెట్టుమీదనుండి పడ్డాను దొరా....! రెండ్రోజులే అయింది....అయినా పనిగత్తాను....విరిగిన కాలు కదా!" అన్నాడు కళ్ళవెంబడి నీళ్ళు జలజలా రాలుతుండగా.

ఏ సంగతీ విచారించకుండా తొందరపడి కోయ యువకుణ్ణి తిట్టినందుకు సిగ్గుపడ్డాను. చటుక్కున వాడి చేతిలో పరుశువు లాక్కుని

"తొందరలో ఏదో అన్నాను....బాధపడకు....వాడు

ఆశేగా వెళ్ళింది!" అన్నాను. మొదట ఆ యువకుడు చేయి చూపిన దిశగా చూపుతూ. కోయ యువకుడు కండ్లు తుడుచుకుంటూ.

"ఔను దొరా!...." అన్నాడు.

నా కాళ్ళు యంత్రవేగాన్ని మించి అటు పరుగు తీసాయి. అలా ఓ పది నిముషాలు పరుగెత్తగా భుజాన ఒక స్త్రీని మోస్తూ కనుచూపు మేరలో ఒక వ్యక్తి పోతూ వుండడం కంటపడింది. నేను వేగాన్ని పెంచుతూ పరుగెత్తాను. చూస్తూ వుండగానే ఆ వ్యక్తి స్త్రీతో సహా ఒక పర్వత గుహలోకి ప్రవేశించాడు.

నేనూ ఆ గుహాను చేరి లోపల అడుగు పెట్టాను. గుహ లోపల కటిక చీకటి.

నా మనసేదో కీడు శంకిస్తోంది. ఇదేదో ట్రాప్. శత్రువులు చాలా సులువుగా బోల్తా కొట్టించారు నన్ను. ఏమయినా ఫరవాలేదు. చేతిలో పరుసువుంది. ఎట్టి పరిస్థితుల్లోనయినా పదిమందికి జవాబు చెప్పగలను.

గోడల్ని తడుముతూ లోనికి ప్రవేశించాను. అప్పటికి నా కళ్ళు సయితం చీకటికి బాగా అలవాటుపడ్డాయి.

గుర్ర్....ర్....ర్....మని చప్పుడు...ఉలిక్కిపడుతూ తిరిగానటు.

గుహలో ఓ మూల కర్రలబోను....దీక్షగా నా వంకే చూస్తోంది పెద్దపులి. మసక చీకటిలో దాని కళ్ళు దీపాల్లా వెలుగుతున్నాయి.

బోను తలుపు తెరిచే వుంది. చటుక్కున లేచి నిల బడింది పులి. బలిసిన దున్నలు రెండింటిని అవలీలగా యెగరేసుకుపోయే సత్తా వుంది దానికి. ఎక్కడా సొట్ట లేని శరీరం నూనె రాసినట్టు తళతళ మెరుస్తోంది. కడుపు

వెన్నుకు అంటి వుంది. ఆకలితో నకనకలాడుతోందన్న మాట.

పులి గుర్రు పెడుతూ బోనులోనుండి పైకిఅడుగు పెట్టింది. కండ్రగొడ్డలిని రెండు చేతులా బిగించి పట్టుకున్నాను.

పులి అడుగులు లెక్క పెడుతూ ముందుకు వస్తోంది. నేను కదలకుండా నిలబడి వున్నాను. దరిదాపుల కొచ్చింది పులి. ఇక నడిచే ప్రశ్న లేదు. నేను సిద్ధంగానే వున్నాను.

పెనుగాలిలా విరుచుకుపడింది పులి. ఒడుపుగా ప్రక్కకు జరిగి గొడ్డలితో దాని మెడమీద వేసాను సరిగ్గా.

ఆ దెబ్బకు పులి తల తెగి నేలమీద పడాలి. కానీ విచిత్రంగా నా గొడ్డలే కర్రతో సహా ముక్కలయి నేల మీద చెల్లాచెదురయి చిన్న కర్రముక్క మాత్రం చేతిలో మిగిలిపోయింది.

నివ్వెరపోయాను. గొడ్డలిని చాలా నేర్పుగా అతికాడు. పులి వెనక్కు తిరుగుతోంది. విరిగి ముక్కలయిన గొడ్డలికోసం విచారిస్తూ కూర్చుంటే ప్రయోజనముండదు.

రిక్తహస్తాలతో పులిని యెదుర్కోవడం వెర్రితనమే అవుతుంది. నేను క్షణమయినా వృథా చెయ్యక రెండే అంగల్లో పులి బోనులో దూరి తలుపు వేసుకున్నాను. పులి పిచ్చెత్తినట్టు బోనుచుట్టూ తిరుగుతూ నానా రభసా చేస్తోంది.

ఇంతలో కిలకిలమంటూ ఓ స్త్రీ స్వరం "మొత్తానికి పిరుడివే! పులికి భయపడి బోనులో దాక్కున్నావు" అపహాస్యంగా పకపకలాడిందామె.

చుట్టూ చూశాను. మనిషి కనపడలేదెక్కడా.

గుహకు యేవో మూల వున్న చిన్న కంతలో నుండి శత్రువులు వ్యవహారమంతా కని పెడుతున్నారన్న మాట!

నాలో పౌరుషం పెల్లుబికింది. బోను కట్లు వూడదీసి ఒక నిలువు కర్రను లాగాను. మూడడుగుల పొడవులో సరయిన దుడ్డుకర్ర అమరింది. ఈమాత్రం ఆధారం చాలు నాకు. పులిని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించగలను. బోను తలుపును కాలితో తన్నాను బలంగా. గడియ వూడి తెరుచుకుంది తలుపు. ఠీవిగా బయట అడుగు పెట్టాను.

పులి నాలుక తడుపుతూ హుంకరించిందొకసారి. రెండడుగులు వెనక్కిపోయి రెట్టించిన వేగంతో రాకెట్‌లా నా పైకి దూకింది. నేర్పుగా ప్రక్కకు తిరిగి పులి వీపుమీద కర్రతో ఓ బాదు బాదాను. బంతిని కొట్టినట్టు వెనక్కి విసురుగా వచ్చింది కర్ర. బాగా కండబట్టివుంది పులి. ఇటువంటి దెబ్బల్ని ఒంటిమీద ఏమాత్రం లెక్క చెయ్యదు.

పులి గాండ్రు పెడుతూ దూసుకువస్తోంది. బాగా దగ్గర కానిచ్చి ముందుకాళ్ళు రెంటినీ కర్రతో పరామర్శించాను. బొర్లాపడుతూ పులి పిల్లి మొగ్గలు వేసింది. అదే అదనుగా బుర్రమీద మరో రెండు తగిలించాను.

పులి బుర్ర విదుల్చుతూ లేచి నిలబడింది. ముందు కాళ్ళు తడబడుతున్నాయి. గాండ్రింపు తగ్గింది. నాలో ఉత్సాహం పెరిగింది. ఈసారి నేను హుంకరించాను పెద్దగా. పులి ఒళ్ళు దులుపుకుందొకసారి. రోషంగా నామీదకు వచ్చింది మరోసారి.

తిరిగి అదే దెబ్బ! గడ్డం నేలను తాకగానే నేలమీద కొంతదూరం జారుతూ పోతోంది ఆ వూపున. ఆ దశలో

పులి వెనక కాళ్లను సయితం యధాశక్తి దుడ్డుకర్రతో అవి రామంగా బాదుతుంటూ పోయాను.

పులికి దుడ్డుకర్ర సామాన్యమైంది కాదని తెలిసి పోయింది. వెనక్కి తిరిగి చూడకుండా అలా ముందు కాళ్ళమీదే దేకుతూ బోనులో దూరి బుద్ధిగా పడుకుంది. వెంటనే బోను తలుపు మూసి తాడుతో కట్టేశాను.

దుడ్డుకర్ర పక్కన పెట్టి బోనుకు జారబడి నిల్చున్నాను. సిగరెట్ వెలిగించి గుండెలనిండా పొగపీల్చి వదిలాను. చిన్నగా నవ్వుతూ:

"మెడిచుర్! లేడీ! మీ దగ్గర ఇంకా పులులేవన్నా మిగిలివుంటే పంపించండి...పాపం! నా దుడ్డుకర్ర ముచ్చట పడుతోందింకా....!" అన్నాను.

అటునుండి ఏ జవాబులేదు. ఓ ఐదు నిమిషాలు అక్కడే వుండి సిగరెట్ పీకను మూలకు విసురుతూ గుహ బయటికి నడిచాను.

వాగు చేరేసరికి అగర్వాల్ ఒడ్డున నిలబడి దిక్కులు చూస్తున్నాడు. నన్ను చూస్తూనే ఆశ్చర్యంగా:

"అటు దేనికి వెళ్ళావు? ఆ వాలకమేమిటి?" అన్నాడు.

సంగతంతా చెబితే నానా గొడవ చేస్తాడని "వూరకనే అలా కొండచుట్టూ పరుగెత్తి వచ్చాను" అన్నాను.

అగర్వాల్ నన్ను వింతగా చూసి "నువ్వొక విచిత్రమయిన వ్యక్తివి" అన్నాడు తను స్నానానికి వాగులోకి దిగుతూ.

## 5

అడవి బాటలో గుర్రంమీద వెళుతున్నాను. ఘాట్ రోడ్డు అర ఫర్లాంగు దూరంలో వుంది. లారీ ఒకటి రోడ్డు

మీద వెళుతుండటం కనిపించింది. లారీలో కొన్ని బోనులు వున్నాయి. గుర్రాన్ని అటు మళ్ళించాను. లారీలో వ్యక్తులు నన్ను చూసారో ఏమో ఒక్కసారిగా లారీ స్పీడందుకుంది.

తిన్నగా వెళితే గుర్రం యెంత వేగంగా వెళ్ళినా లారీని అందుకోవడం కష్టం. అందుకే అడ్డు తోవలు పట్టాను. గుర్రం హైవే చేరేసరికి లారీ అందీ అందనట్టు వెళుతోంది. క్రమేపీ ఆ దూరం పెరుగుతూ లారీముందుకు పోతోంది. ఇక లాభంలేదని తుపాకీ అందుకున్నాను. లారీ వెనక టైరు బ్రద్దలయ్యాయి. కేబిన్‌లోనుండి దూకి పారిపోతున్నాడు డ్రైవరు.

నా చేతిలో ఫారూన్ మరోసారి గర్జించింది. డ్రైవర్ కాలుమీద షూట్ చేసి వాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలన్నది నా ఆలోచన. కానీ వాడు అతి తెలివికి పోయి ఒక్కసారిగా నేలమీద కూర్చుండిపోయాడు. సరిగ్గా కాలికి తగలవలసిన గుండు వెన్నులో నాటి ఛాతీని చీల్చుకుపోయింది.

డ్రైవర్ని సమీపించాను. వాడి ప్రాణాలు ఎప్పుడో పోయాయి. డ్రైవర్ని గుర్తుపట్టాను. నిన్నటిరోజు వాగు దగ్గర తన భార్యను యెవడో ఎత్తుకుపోతున్నాడని చెప్పి నన్ను పులికి అప్పగించిన వాడే వీడు!

లారీ వెనక రెండు బోనుల్లో పులులూ, సింహాలూ కిక్కిరిసి వున్నాయి. రెండు బోనుల తలుపులు తెరిచాను. జంతువులన్నీ పరుగులుతీస్తూ అడవిలో అదృశ్యమయ్యాయి.

ఆఫీసుకు తిరిగివచ్చి లారీ ఓనరుకోసం ఎంక్వయిరీ చేస్తే అది కిషన్‌లాల్‌దని తెలిసింది. కిషన్‌లాల్‌ని ఎన్ని రకాలుగా ప్రశ్నించినా అతడు చెప్పే సమాధానమాత్రం

ఒక్కటే.

"విక్రమ్ సాబ్! ఆ లారీ నాదే! కానీ ఆ డ్రైవరెవడో నాకు తెలియదు. అందులో రవాణా చెయ్యబడుతున్న జంతువుల సంగతి నాకు అసలే తెలియదు. ఆ లారీని నిన్న రాత్రే యెవరో ఎత్తుకుపోయారు. ఆ విషయం పోలీసులకు కంప్లయింటు యిద్దామని హాజ్రాపూర్ బయల్దేరుతూ వుండగా మీరు యెదురయ్యారు. ఇదిగో నా జేబులో వుంది రిపోర్టు కాగితం. కావాలంటే చూడండి" అంటూ ఓ కాగితం నా చేతికందించాడు కిషన్‌లాల్.

నిజమే! కిషన్‌లాల్ తన లారీ ఒకటి ఫలానా నంబరు గలది పోయిందని పోలీసులకు రాసిన విన్నపమది. ఆ కాగితాన్ని కిషన్‌లాల్ చేతికిచ్చాను. వీళ్ళు అన్నిటికీ సమర్థులు. అలా కాకపోతే ఒక ప్రభుత్వాన్ని ఇన్ని తిప్పలు పెట్టి తప్పించుకు తిరగడమంటే మాటలా మరి!

నేను వెనక్కి తిరిగి నడుస్తూవుంటే వెనకనుండి కిషన్‌లాల్ "సాబ్! ఏమయితేనేం నా లారీ నా కప్పగించి బోలెడు శ్రమ తప్పించారు నాకు. కనీసం కాఫీ అయినా తీసుకోకుండా వెళ్ళిపోతున్నారా" అన్నాడు బాధగా.

ఎంత చక్కని నటన! అది ఒకరకంగా నన్ను ఎగతాళి చెయ్యడమేగా! టక్కరి వెధవా! ఏదో రోజున నా చేతికి చిక్కకపోతావా! కసిగా మనసులో కిషన్‌లాల్‌ని తిట్టుకుంటూ వడిగా నిష్క్రమించా నక్కడనుండి.

ప్రతిరోజూ వీలయినంత మేర సోనార్ అడవుల్ని చుట్టివస్తున్నాను. శత్రువుల ఆచూకీ లభించడంలేదెక్కడా! శత్రువులకు ఎక్కడో ఒక రహస్య స్థావరం వుండితీరాలి! లేకుంటే ఇన్నాళ్ళు ఇంత పకడ్బందీగా

కార్యక్రమం జరపడం సాధ్యంకాదు ఎవరికీ.

అడవిలో నివసించే కోయజాతివాళ్ళను శత్రువుల ఆచూకీ కోసం ఎన్నో ప్రశ్నలు వేశాను. అందరిదీ ఒకటే సమాధానం. ఏ భావమూ కనపడని కళ్ళతో ఆకాశం లోకి చూసి పెదవి విరుస్తూ పోయేవారు.

ఆ మాటే అగర్వాల్‌తో అంటే ఆయన పెద్దగా నిట్టూరుస్తూ "విక్రమ్! మొదట కొందరు ఆటవికులు మనతో సహకరించి ఆ అడవి దొంగల్ని పట్టిచ్చే ప్రయత్నాలు చేశారు. అందుకు ప్రతిఫలంగా వాళ్ళ కుటుంబాలతో సహా అడవి దొంగల దారుణకృత్యాలకు బలయిపోయారు. అంతే! నాటినుండీ వాళ్ళు మనం పలకరిస్తే నే భయపడి పారిపోవడం ప్రారంభించారు" అన్నాడు.

"కావచ్చు! ఎన్నాళ్ళిలా! కొన్నాళ్ళు ఇలా గడిస్తే సోనార్ అడవుల్లో మనుషులూ వుండరు; జంతువులూ వుండవు. అసలు సోనార్ అడవే వుండదు" అన్నాను నిరాశగా.

అగర్వాల్ బాధగా నవ్వుతూ "నిజమే! కానీ ఏం చెయ్యగలం. కొత్తలో నేనూ ఏదో ఒకటిచేసి ఈ అడవిని రక్షించాలనుకున్నాను. కానీ క్రమేపీ అది అసాధ్యమని గ్రహించి రోజులు వెళ్ళబుచ్చడం నేర్చుకున్నాను. ఏం చెయ్యను? వాళ్ళను బంధించడానికి వెళ్ళిన మనుషుల్ని ఎందరిన్నో కాళ్ళూ చేతులూ తెగనరికి చెక్కపెట్టెల్లో తెచ్చి ఈ ఆఫీసుముందు పడేసిపోయేవారు. విక్రమ్! ఆ దృశ్యాలను కళ్ళారా చూసిన వాడెవడూ కోరి అడవి దొంగల జోలికిపోరు. అది తలచుకుంటే నాకు ఇప్పటికీ శరీరం వణుకుతుంది...." అంటూ నెమ్మదిగా లేచి తన గదిలోకి వెళ్ళిపోయిరాయన.

# 6

అరణ్యంలో నెమ్మదిగా నడుస్తున్నాను. అగర్వాల్ మాటలే అనుక్షణం మదిలో మెదులుతూ వుండగా ఆ క్షణం కొంత నిర్లక్ష్యంగా వున్న మాట నిజం! ఇంతలో సర్‌మనే చప్పుడు వినపడి తలపైకెత్తాను. కానీ అప్పటికే ఆలస్యమయిపోయింది.

పెద్ద వల ఒకటి చెట్టుమీదనుండి సూటిగా వచ్చి నన్ను ముంచివేసింది. ఆ విసురుకు నేను కిందపడ్డాను. వల నన్ను కప్పివేస్తూ నేలంతా ఆక్రమించింది. అంతలోనే మరో వల, మరో వలా; అలా మూడు వలలు నామీద పడి నాకు కదిలే అవకాశమే లేకుండా చేశాయి.

చుట్టూ చెట్లమీదనుండి అడవి దొంగలు కేరింతలు కొడుతూ కిందకు దుమికారు. అంతా కలిసి సుమారు పది పన్నెండుమంది వుంటారు. వారిని ఆజ్ఞాపిస్తూ ఒక వ్యక్తి నా కాళ్ళూ చేతులూ కట్టెయ్యమన్నాడు. కాళ్ళూ చేతులూ కట్టబడి కటిక నేలమీద పడివున్నాను నేను.

"వీణ్ణి ఇక్కడే సఫా చేసేద్దాం" అన్నాడొకడు.

"కుక్కను కాల్చినట్టు కాల్చాలి వీణ్ణి మనవాళ్ళను ఎందర్నో చంపాడు వీడు" కసిగా కాలితో తన్నుతూ అరిచాడొకడు.

నన్ను ఎక్కడ చంపాలి; ఎలా చంపాలి; అన్నది వాళ్ళకు చర్చనీయాంశమయింది.

"ఎందుకొచ్చిన గొడవ. వీడసలే చిచ్చర పిడుగు. ఏమాత్రం వీలుచిక్కినా ముందు మనందరినీ మట్టుపెట్టి మరీ తప్పించుకుపోతాడు" అన్నారు కొందరు.

"ఆ భయం దేనికి? కాళ్ళూ చేతులూ కట్టేసాం గదా! కాకపోతే మరో నాలుగు కట్లు కట్టండి. బాస్

దగ్గరికి తీసుకుపోదాం వీణ్ణి...." అన్నారు కొందరు.

"బాస్ వీణ్ని కనిపిస్తే కాల్చెయ్యమని చెప్పాడు.."
మరొకడి మాటది.

ఏదోలా వీళ్ళు ఆ బాస్ దగ్గరికే నన్ను తీసుకుపోతే బాగుండును. ఈలోగా కొంత సమయం చిక్కి ఏదోలా తప్పించుకునే అవకాశమయినా వుంటుంది. అదేమీ కుదరకపోతే ఇక తను చచ్చినవాడికిందే లెక్క.

చివరకు అదే జరిగింది .... "వీణ్ని యిక్కడే చంపి శవాన్ని బాస్‌కి చూపితే సరి...." అనుకున్నారంతా!

అడవి దొంగలు నన్ను ఓ చెట్టుకి వురితీసే నిర్ణయంలో పడ్డారు. పనులన్నీ చకచకా సాగిపోతున్నాయి. ఓ పొడవాటి తాడు తెచ్చి చెట్టుకొమ్మకు వేలాడేసారు. తాడు చివర జారుముడి వేశారు. నన్ను పైకెత్తి ఓ గుర్రం మీద కూర్చొబెట్టారు. గుర్రాన్ని చెట్టుకింద నిలబెట్టి జారుముడి నా పీకకు తగిలించారు.

గుర్రం వెనక నిలబడి వున్నాడొకడు. "ఒరేయ్! చచ్చేముందు దేవుణ్ని తలచుకో" పకపకా నవ్వుతూ అన్నాడొకడు. మిగిలిన వాళ్ళంతా వాడి నవ్వుతో శ్రుతి కలిపారు.

జీవితంలో చివరి ఘడియలు! దుఃఖం ముంచుకు వచ్చింది నాకు. చస్తున్నాననికాదు. అనుకున్నది సాధించలేకపోయినందుకు. సోనార్ అడవిలో జంతువుల్ని, మనుషుల్ని ఈ దుర్మార్గులకు అప్పగించిపోతున్నందుకు. భగవంతుడా....! ఈ సోనార్ అడవిని నువ్వే కాపాడాలి....!

గుర్రం వెనక నిలబడినవాడు కాలితో దానిని ఓ తాపు తన్నాడు. వులిక్కిపడుతూ చెంగున ముందుకు దూకింది

గుఱ్ఱం! నా మెడ ఉరితాడులో ఇరుక్కుపోయింది. శరీరమంతా కేవలం మెడను బిగుసుకున్న తాడు ఆధారంగా గాలిలో వ్రేలుతోంది. ఊపిరి స్తంభించింది. గాలికి రెపరెపలాడే దీపంలా చివరిసారిగా కొట్టుకుంటోంది ప్రాణం.

ఇంతలో ఏదో చప్పుడు. తుపాకీ పేలిందెక్కడో. నా ప్రాణాలను పట్టి లాగుతున్న తాడు ఫట్‌మంది. దబ్బున నేలమీద పడింది నా శరీరం. నిర్విరామంగా తుపాకుల ధ్వని. పెద్దగా కేకలు....

కళ్ళు తెరిచాను నెమ్మదిగా. చేతిలో తుపాకీ ధరించి ఆతృతగా నా మొహంలోకి వంగి చూస్తున్నారు ఫారెస్టు ఆఫీసర్ అగర్వాల్. అగర్వాల్ వెనక ఓ ఐదుగురు గార్డులు తుపాకులు చేతబట్టి నిలబడి వున్నారు. పరిస్థితి అర్థమయింది నాకు. ఆఖరి క్షణంలో అగర్వాల్ నా పాలిట దేవుడిలా వచ్చారు.

అగర్వాల్ తృప్తిగా నిట్టూరుస్తూ "ఆర్ యు ఓ.కె. మైడియర్ బాయ్!" అని ప్రశ్నించారు. చిన్నగా నవ్వుతూ తలూపి అడిగాను.

"దుండగు లెవరయినా పట్టుబడ్డారా....?"

నిస్పృహతో పెదవి విరిచారు అగర్వాల్ "వెధవలు తప్పించుకు పారిపోయారు...." అన్నారు....

# 7

మరుసటి రోజు తెల్లవారేసరికి పూర్తిగా జంగిల్ యూనిఫాంలో చకచక మెట్లు దిగుతున్న నన్ను చూసి నివ్వెరపోయారు అగర్వాల్.

"విక్రమ్! .... నువ్వసలు మనిషివా....! లేక పిశాచానివా....ఆ మెడ వాపే తగ్గలేదింకా...." అన్నారు కోపంగా.

నేను నవ్వుతూ అశ్వశాలలోకి వెళ్ళి ఓ గుఱ్ఱాన్ని లాక్కొచ్చాను.

"ఎంత చెప్పినా నీ పంతం నీదే....!" చిరాగ్గా లోనికి వెళ్ళిపోయారు అగర్వాల్.

నేను చిరునవ్వుతో అశ్వాన్ని అదిలించాను. పెద్దగా సకిలిస్తూ అడవిదారి పట్టింది అశ్వం.

నలుదిక్కులా దట్టమయిన అడవి. ఏ క్షణాన యెటు నుండి దాడి జరుగుతుందో! ఊహించడం కష్టం. అశ్వాన్ని నెమ్మదిగా పోనిస్తున్నాను.

దరిదాపుల్లో పులి గాండ్రింపు విని ఉలిక్కిపడింది అశ్వం. కళ్ళెం బిగించి గుఱ్ఱాన్ని సముదాయిస్తూ దాని మెడ నిమిరాను. మరోసారి వినపడింది పులి అరుపు. కానీ ఆ అరుపులో పులికి సహజమయిన గాంభీర్యం, కరకుదనంలేదు. ఏమయింది పులికి? ఎందుకలా నిస్సహాయత ధ్వనిస్తుందా గొంతులో.

అరుపు వినపడిన దిశగా గుఱ్ఱాన్ని నడిపించాను. పులి అరుపు మరోసారి వినపడింది; ఈసారి మరింత స్పష్టంగా; ఎక్కడో బావిలోనుండి వచ్చినట్టు. ముందుకు వెళ్ళాను పరిసరాల్ని గాలిస్తూ. విషయం బోధపడింది. నిజానికి పులి బావిలోనే వుంది. కాకపోతే అందులో నీళ్ళులేవు.

ఎవరో తీసిన గోతిలో వచ్చి పడింది పులి. ఎవరో ఏమిటి....? ఇది నిస్సందేహంగా ఆ అడవి దొంగల పని. జంతువులను పట్టేందుకు తవ్విన గొయ్యది. గోతిమీద అడ్డలూ చెత్తాచోనీ జాగ్రత్తగా కప్పివుంచారు. అడవుల్లో జంతువుల్ని పట్టడంలో ఇదొక పద్ధతి. అడవి దొంగలు యేదో ఒక సమయంలో ఈ గోతి వద్దకు తప్పకుండా వస్తారు.

చుట్టూ కలయజూసి అనువయినచోట మాటువేస్తూ నాలో నేనే నవ్వుకున్నాను. వేటగాడిగా గతంలో మేకనో, గొర్రెనో ఎఱగా వుంచి పులికోసం కాపు కాసేవాణ్ని; ఇప్పుడు యేకంగా పులినే ఎఱగా మనిషి కోసం కాపు కాస్తున్నాను.

సుమారు రెండు గంటలు గడిచాయి. అడుగుల చప్పుడు వినపడింది. ఎవరో వస్తున్నారు. అడుగుల చప్పుడుబట్టి వస్తున్నది ఒక్కరే అని తెలుస్తోంది.

ఖాకీ దుస్తులు ధరించి మంచి ఒడ్డూపొడవూ కలిగిన వ్యక్తి ఆదరాబాదరాగా వెళ్ళి గోతిలోకి తొంగిచూస్తున్నాడు. మనిషి అలికిడి విని గోతిలో కాళ్ళు బారజాపి పడుకుని వున్న పులి గాండ్రిస్తూ లేచింది.

అడవి దొంగ మొహం ఒక్కసారిగా వెలిగిపోయింది. గొప్పచారయిన పులి. మంచి రేటే గిట్టుబాటవుతుంది. బాస్ తనకి మంచి బహుమతే ఇస్తాడు! గిరుక్కున వెను తిరిగిన అడవి దొంగ మొహం ఒక్కసారిగా మాడి పోయింది.

కళ్ళెదుట మరో పులిలా నిలబడ్డ నన్ను చూసి క్షణ కాలం తడబడ్డాడా వ్యక్తి. అంతలో నే నా చేతుల్లో పరలోకప్రాప్తి పొందిన తన సహచరులు గుర్తుకు వచ్చారో యేమో ఒక్కసారిగా తెగింపు కనపడిందా మొహంలో.

"రేయ్....! నిన్నూ....!" అంటూ తన చేతుల్లో ఓ తుపాకీ వుందనేమాటకూడా మరచి ఆవేశంగా నామీదకు దూసుకురాసాగాడా వ్యక్తి. అతణ్ని బాగా చేరువ కానిచ్చి చటుక్కున ప్రక్కకు గెంతాను. అబోతులా ముందుకుపోతున్నవాణ్ని ఫారూన్ మడమతో ఓ పోటు

పొడిచాను.

నడుం కలుక్కుమనగా బావురు కప్పలా అరుస్తూ బోర్లాపడ్డాడు వాడు. అతడి చేతిలో తుపాకీ అల్లంత దూరాన ఎగిరిపడింది అప్పుడు జ్ఞాపకం వచ్చింది వాడికి తన చేతిలో ఓ తుపాకీ వుందని. ఆత్రంగా లేచి అటు పరుగెత్తబోయాడు.

రెండే అంగల్లో వాణ్ని సమీపించి రెండుచేతులా పట్టిన ఫారూన్‌తో వాడి గడ్డంకింద కొట్టాను. తుపాకీ మడములన్నిటిలోనూ ఫారూన్ మడమ మహాగట్టిది. ఆ దెబ్బకు వాడి కళ్ళముందు ఇంద్ర ధనుస్సు ప్రత్యక్ష మయింది. చెవుల్లో నయాగరా జలపాతం హోరును మించిన అలజడిని భరించలేక చెవులు రెండూ మూస్తూ బాధగా అరిచాడు.

ఆ వూపున వాడికి మరో అవకాశమివ్వకుండా వడి కాలు మడిచి పొత్తి కడుపులో ఓ తన్ను తన్నేసరికి దెబ్బతిన్న కందిరీగలా కిందపడి గిరికీలు కొట్టసాగాడు. వాణ్ని కాలితో తన్నుతూ గోతివరకూ దొర్లించుకు పోయాను. మరో తోపుకు తిన్నగా పోయి గోతిలో పడతాడు వాడు. పులి ఆకలితో నకనకలాడుతూ వుందేమో; నానా హంగమా చేస్తోంది కింద. పరిస్థితి గమనించి బావురుమంటూ నా కాళ్ళు రెండూ పట్టే సాడు వాడు.

“చెప్పు....! మీ స్థావర మెక్కడ?....మీ నాయకు డెవరు?” జుట్టుపట్టి తల పైకిలేపుతూ ప్రశ్నించాను వాణ్ని.

“తెలియదు!” అన్నాడు వాడు నా చేతిలో వున్న జుట్టును విడిపించుకునే ప్రయత్నంలో తలవిదిలిస్తూ,

నిజానికి ఇటువంటి వెధవల్ని కనికరించకూడదు. జుత్తు వదిలి వాడ్ని రెండు కాళ్ళమీద తన్నాను.

గోతిలో అడ్డంగా పొర్లుతూ చేతులతో అంచుపట్టుకు వేలాడాడు. పులికి అందీ అందనట్టువుంది వాడి పరిస్థితి. పైకి ఎగబ్రాకాలనే వాడి ప్రయత్నాన్ని వారిస్తూ బూటుకాళ్ళతో వాడి చేతుల్ని నొక్కసాగాను. క్రమేపీ వాడి చేతుల్లో సత్తా అయిపోయింది.

“బాబూ.... చెబుతాను.... నన్ను వదిలెయ్యండి....! ఏడుస్తూ ప్రాధేయపడ్డాడు వాడు.

గోతి అంచున మోకాళ్ళమీద కూర్చుంటూ “చెబితేనే వదిలేది! మీ స్థావరమేది?” ప్రశ్నించాను.

“స్థావరం.... స్థావరం.... షికారి మహల్!”

“మీ నాయకుడు?”

“తెలియదు బాబూ ...!”

“నోర్ముయ్....! చెప్పకపోతే చావే గతి!”

“లేదు బాబూ! నిజంగా నాకు తెలియదు. అయ్యో! జా.... జారిపో... దేవుడి.... మీద.... ప్రమాణం... లాగండి బా.... బోయ్....

బాస్ ఎవరో వాడికి నిజంగానే తెలియదు. వాణ్ని రక్షించేందుకు ముందుకు వంగుతున్నంతలో పులి ఒక్క సారిగా పైకి యెగిరి తన రెండు పంజాలూ వాడి కాళ్ళకు గుచ్చి పట్టుకుంది.

అంతే! కెవ్వున అరుస్తూ కిందకు జారిపోయాడు వాడు. ఒకే ఒక నిముషం అరుపులూ, ఆర్తనాదాయి. పిదప అంతా నిశ్శబ్దం. ఎవరు తీసిన గోతిలో వాళ్ళే పడతారంటారు. చివరికి ఇక్కడ జరిగిందదే! బాధగా మొహం ప్రక్కకు తిప్పుకున్నాను.

షికారి మహల్!

సోనార్ అడవుల్లో ప్రవేశించేముందు ప్రభుత్వ కార్యాలయంలో మొత్తం అడవికి సంబంధించి మేప్ చూశాను. మేప్‌లో చూసిన ప్రతి చిన్న విషయమూ గుర్తే నాకు.

సోనార్ అడవికి తూర్పు దిశలో దట్టమయిన అడవి ప్రాంతంలో పర్వతాల మధ్య వుంది షికారి మహల్! పూర్వం రాజుల కాలంలో నిర్మించబడిన ఆ భవనం రాజులకు విడిదిగా ఉపయోగపడేది. ఇప్పుడది ప్రభుత్వ లెక్కల్లో ఇంచుమించు శిథిలమయిపోయినట్టే!

వెనక్కి తిరిగి వెళితే ఫారెస్టు ఆఫీసులో షికారి మహల్‌కి సంబంధించిన పూర్తి వివరాలు తెలుసుకోవచ్చు! కానీ వెనక్కి తిరిగివెళ్ళే ఉద్దేశమే లేదు నాలో. ఏదోలా ఆ షికారి మహల్‌ని పట్టుకొని ఆ సంగతేదో తేల్చుకునే వెనక్కి మళ్ళేది. తూర్పు దిశగా ప్రయాణం సాగించాను.

సువిశాలమయిన సోనార్ అడవిలో షికారి మహల్‌ను వెదకడమంటే అసామాన్య వ్యవహారమేం కాదు. రాత్రీ పగలూ భేదం మరచి, ఎక్కడెక్కడో దొరికిన కాయ కసురులు నములుతూ షికారి మహల్‌ని అన్వేషిస్తున్నాను. అడవిలో అప్పుడప్పుడూ ఎదురయిన ఆటవికులను ఆ మహల్ గురించి ప్రశ్నిస్తే; అదేదో వినకూడనిదయినట్టు హడలిపోతూ పారిపోతున్నారు.

మిట్టమధ్యాహ్నం వేళ తిరిగి తిరిగి అలసి ఓ చెట్టుకింద కూలబడ్డాను. దాహం, ఆకలి, రెండూ ఒకటికొకటి తోడవుతూ నన్ను బాధ పెడుతున్నాయి.

ఓ కోయ ముసలాడు ఆ దారినపోతూ అగుపించాడు. లేని వుత్సాహం తెచ్చుకుంటూ అడిగాను వాణ్ణి షికారి

మహల్ ఎక్కడో తెలుసా అని. చెబుతాడనే నమ్మకం నాకు లేదు. అయినా ఏదో ఆశ.... అంతే!

ఆ ముసలాడు నన్నోక్షణం ఆశ్చర్యంగా చూసి "అదేమిటి దొరా! ప్రక్కనే షికారి మహల్ని వుంచుకొని అట్టా అడుగుతుండావు. అదో! ఆ దిబ్బ దిగితే అడనేగదా! ఆ మహల్!" అన్నాడు.

నేను దిగ్గున లేచి "ఎక్కడ షికారి మహల్!" అన్నాను.

కోయ ముసలాడు నన్ను రమ్మన్నట్టు తలవూపి తన చేతిని చెట్ల గుంపు కేసి చూపుతూ "అడనుండి చూస్తే తెలుసుద్ది దొరా" అంటూ నడవసాగాడటు. నేను వడి వడిగా అతణ్ని అనుసరించాను.

ఓ కొండ గుట్ట యొక్క పాదల వెనక చేరాడు ముసలాడు. కొమ్మల్ని చేతులతో ప్రక్కకు వంచుతూ కంఠాన్ని ముందుకు చాచి "అదే దొరా మహల్" అన్నాడు చిన్నగా. నేను ఆత్రంగా ముందుకు వంగాను.

కింద లోయలో ఒక పాడుబడిన భవనం కనపడింది. పురాతన పద్ధతులలో నిర్మించబడిన విశాలమయిన భవనమది. అక్కడక్కడ మనుషులు తచ్చాడుతున్నారు. వాళ్ళందరి చేతుల్లోనూ తుపాకులు వున్నాయి.

ఇంతలో నా ప్రక్కన వున్న ముసలాడి కదలికలో అసహజం గోచరించి ప్రక్కకు తిరగబోయాను. కానీ అప్పటికే ఆలస్యమయింది. ముసలాడు తన ఎడమచేతిలో వుంచిన గుడ్డతో నా మొహాన్ని అద్దాడు గట్టిగా. క్లోరోఫాం వాసన గుప్పుమంది ఒకేసారి. కళ్ళు చీకట్లు కమ్మి స్పృహ కోల్పోతున్న నాకు ముసలాడు పకపక నవ్వుతుండడం వినపడుతోంది లీలగా.

# 8

చల్లదనం ఒక్కసారిగా ముఖాన్ని తాకినట్లయి భారంగా కనులు తెరిచాను.

కాళ్ళూ చేతులూ కట్టబడి నేలమీద పడివున్నాను. మరోసారి పాత్రతో నా మొహంమీద నీళ్లు చల్లేందుకు సిద్ధపడుతున్న వ్యక్తి నేను కళ్ళు తెరవడంతో వెనక్కి పోయాడు.

“గుడ్! తెలివి వచ్చిందన్నమాట” పకపక నవ్వాడు బాస్. అదే పీలస్వరం. అతడు కావాలని గొంతు మారుస్తున్నట్లు మొదటే అర్థమైంది నాకు. అయినా అసలు స్వరం పోలిక దొరకటంలేదు. మాస్క్ మూలంగా మొహం కనపడడంలేదు.

“మిస్టర్ విక్రమ్! నిన్ను ఈ రకంగా మా స్థావరంలో సన్మానించవలసిన పరిస్థితి నిజంగా నాకు బాధగావుంది” అన్నాడు బాస్ చిన్నగా నవ్వుతూ.

నేను మొహం ప్రక్కకు తిప్పుకున్నాను.

“మిస్టర్ విక్రమ్! నీవు అసాధారణమయిన తెలివీ, బలమూ కల వ్యక్తివి. తుపాకీ గురిపెట్టడంలో సాటిలేని మేటివి. ఒప్పుకుంటున్నాను. కానీ విక్రమ్! మాకు సంఖ్యా బలంవుంది. వీటికి తోడు ఆధునిక ఆయుధ సంపద వుంది. ఈ అడవిలో నా మాటకు తిరుగులేదు. సో....వుయ్ మేక్ ఏ డీల్ ...నీకు ఎంత డబ్బు కావాలో తీసుకో. మాతో కలిసి పనిచెయ్. ఇక ఇక్కడ మనకి తిరుగుండదు...” అంటూ నా మొహంలోకి చూస్తూ ఆగాడు బాస్.

నేను మాట్లాడలేదు. నిజానికి ఇటువంటి వారితో మాటలూ వ్యర్థమే. కానీ నా మౌనాన్ని మరోలా అర్థం

చేసుకున్నాడు బాస్. నాలో యేదో భావసంఘర్షణ వూహించుకుంటూ బాస్:

"మిష్టర్ విక్రమ్! నీ నిర్ణయం ఇప్పటికిప్పుడు చెప్పాలనేంలేదు. నీకు ఇంకా నాలుగు గంటల వ్యవధి యిస్తున్నాను. బాగా ఆలోచించుకో" అంటూ లేచి నిలబడి వెనక్కి తిరగబోతూ ఆగి...."కానీ ఒక మాట....! ఈ గడువును ఆసరాగా తీసుకొని తప్పించుకునే ప్రయత్నం చెయ్యకు....ఓ....కె" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అతడి అనుచరులు నన్ను ఓ చిన్న గదిలో బంధించి తలుపు మూసేశారు.

ఐదారడుగుల వెడల్పులో ఒకే ఒక కిటికీగల చిన్న గది. కిటికీలో వున్నది నాలుగే ఇనుప వూచలు. ఏదోలా శ్రమపడి వాటిని పీకినా నాలాంటి మనిషి అందులో దూరడం అసాధ్యం. కొండరాళ్ళతో కట్టిన రాతిగోడలు; చీమ దూరే సందుకూడా లేనట్టున్నాయి. రాకపోకలకు ఉపయోగపడే తలుపు ఒక్క పదార్థం!

బయట కాపలాకూడా వున్నట్టుంది. అపుడపుడూ తలుపుకి వున్న చిన్న కన్నంమీద అడ్డు తొలగించి కాపలావాడు లోనికి చూస్తున్నాడు. నాలుగయిదు గంటలు అలా గడిచిపోయాయి. తెగించి యేదో ఒకటి చెయ్యాలి.

కాపలావాడు అప్పుడే తలుపు కంతలోనుండి గదిలోకి చూసి తిరిగి మూత లాగేసాడు. దాదాపు మరో గంట వరకూ ఆ మూత తిరిగి తెరవడు వాడు.

నెమ్మదిగా దొర్లుతూ గోడను చేరాను. చేతులు వెనక్కి కట్టబడి వున్నాయి ప్రక్కకు దొర్లి మోకాళ్ళమీద లేచి నిల్చున్నాను. వెనక్కి తిరిగి చేతికట్లు రాతిగోడకు

రాపాడించసాగాను.

కాళ్లు రెండు బిగించి కట్టడంవలన నిల్చోవడం కష్టంగా వుంది. బరువంతా చేతులమీదే వుంచి వాటిని పైకీ కిందికీ జరుపుతున్నాను. ఒక్కోమారు బాలెన్స్ తప్పి కింద పడిపోతున్నాను. తిరిగి లేచి పనికానిస్తున్నాను. అప్పుడప్పుడూ చేతులు గోడకు రాసుకుంటూ చర్మం ఒరిసిపోతున్నది. చెమటా రక్తమూ ఏకమయి భరించరాని మంట, బాధ. పళ్లు బిగువున పనిచేస్తున్నాను.

ఇంతలో తలుపు దగ్గర అడుగుల సవ్వడి వినపడింది. చటుక్కున నేలమీదపడి మునుపటి స్థానంలోకి దొర్లాను. తలుపు కంత తెరుచుకుంది. ఓ నిముషం కదలకుండా పడివున్నాను. తిరిగి మూత వేసిన చప్పుడయింది.

త్వర త్వరగా దొర్లి యథాస్థానం చేరాను. అరగంటలో కట్లు తెగిపోయాయి. నిల్చున్నవాడిని ఆ పళంగా గోడకు జారి కూర్చున్నాను. చేతులతో కాళ్ళకు వున్న కట్లు విప్పాను. కొద్దిసేపు నేలమీద చతికిలబడి విశ్రాంతి తీసుకున్నాను.

తిరిగి తలుపుకంత తెరుచుకునే సమయం దగ్గరపడుతుంది. లేచి బద్ధకంగా ఒళ్ళు విరిచాను. కాళ్ళూ చేతులూ అప్పటివరకూ కట్టబడి వున్న కారణంగా మొద్దుబారి వున్నాయి. చకచకా ఓ యాభై బస్కీలు కొట్టాను. పట్లన్నీ వదిలాయి. తలుపు దగ్గర తిరిగి అడుగుల చప్పుడవుతోంది.

తలుపు ప్రక్కన గోడకు జారబడి నిలబడ్డాను. కంతలోనుండి చూసే వ్యక్తికి నేనిప్పుడు కనపడే అవకాశంలేదు. ఏం జరుగుతుందో చూడాలి! అన్నిటికీ సిద్ధమయ్యే వున్నాను. తలుపు మూత తెరుచుకుంది. గోడకు

బల్లిలా అతుక్కున్నాను.

"ఆఁ!!!" అనే ఆశ్చర్య ప్రకటన ఒక్కసారిగా వినపడింది తలుపుకి అటునుండి. కొద్దిసేపు బోనులోపడ్డ ఎలకలా ఆ మనిషి తలుపు దగ్గర తచ్చాడిన చప్పుడు. వాడిప్పుడేం చేస్తాడు? నలుగుర్ని పిలుస్తాడా? ఒక్కడే తలుపు తెరిచి లోనికి వస్తాడా? ఆ నిర్ణయంమీద ఆధారపడివుంది తన భవిష్యత్తు!

# 9

తలుపు తాళం తెరుస్తున్న చప్పుడవుతోంది. ఊపిరి బిగించాను. కిరగా తెరుచుకుంది తలుపు. మనిషి తల మాత్రమే లోనికి వచ్చింది. నన్ను చూస్తూనే దిగ్భ్రాంతుడవుతూ తలను తిరిగి వెనక్కి లాక్కోబోయాడా వ్యక్తి.

నేను అదే క్షణంలో మెరుపునుమించి వేగంగా కదిలాను. ఆ తలను ఎడమచేతితో జుట్టుపట్టి లోనికి లాగడం కుడిచేతిని కత్తిలా చాచి మెడమీద శక్తికొద్దీ కొట్టడం ఒకేమారు జరిగాయి. దొంతరగా పేర్చిన ఇటుకల్ని ఒకే దెబ్బకు మధ్యకు బ్రద్దలు కొట్టగల కరాటే దెబ్బ అది. కాపలా వ్యక్తి మెడ ఫట్ మంటూ విరిగి నా చేతుల్లోకి కిక్కురుమనకుండా వాలిపోయాడు.

క్షణమయినా ఆలస్యం చెయ్యక అతడి దుస్తులువిప్పి నా దుస్తులమీద తొడుక్కున్నాను. శవాన్ని ఓ మూలకు లాగాను. తలుపు యెప్పటిలా తాళంవేసి తుపాకీ చేతబట్టి బయట నిలబడ్డాను కొద్దిసేపు. అంతా సవ్యంగానే వుంది. తల వంచి నెమ్మదిగా ముందుకు అడుగువేసాను.

భవనం అంతర్భాగంలో చిట్టచివరి ప్రాంతమది. భవనంలో అక్కడక్కడా కాగడాలు వెలుగుతూ గోడలకు వేలాడుతున్నాయి.

చిన్న వరండాలో అడుగుపెడుతూ చటుక్కున గోడ ప్రక్కకు తప్పుకున్నాను. విజిల్ వూదుకుంటూ హుషారుగా నడుచుకుంటూ వస్తున్నాడొకడు. భుజాన తుపాకీ వుంది. గోడ చాటున నిలబడ్డాను.

ఆ వ్యక్తి మలుపు తిరుగుతూ హఠాత్తుగా చూసాడు నన్ను. అతడు భయంతో నోరు తెరుస్తూ వుండగా నా అరచేయి కత్తిలా అతడి నుదుట తాకింది. కపాలం ఫట్‌మంటూ రెండుగా విడిపోయింది. అతణ్ని అక్కడేవున్న ఖాళీ చెక్కపెట్టెల మధ్యకు లాగాను.

వరండా దాటి ముందుకు వెళుతుండగా మరో అడ్డంకి....! ఇద్దరు వ్యక్తులు అవతలి వసారా మెట్లు దగ్గర యెదురెదురుగా కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. బయొనెట్లు అమర్చబడిన తుపాకులు వారి వెనుక గోడలకు జారబడి వున్నాయి. కొద్దిక్షణాలు తటపటాయిస్తూ నిల్చున్నానక్కడే. ఇంతలో!

"ఒరేయ్! అగ్గిపెట్టె వుందా?" సిగరెట్ తీసి అడిగాడొకడు రెండవవాణ్ని.

రెండోవాడు జేబులు తడుముతూ పెదవి విరిచాడు. "సిగరెట్ వెలిగించుకొస్తానుండు" అని లేచి అటు వెళ్ళాడా వ్యక్తి. రెండోవాడు పెద్దగా ఆవులిస్తూ గోడకు జారబడి "వేగంరా! నాకిక్కడ బోరుకొడుతుంది" అన్నాడు. కొద్దిక్షణాలు గడిచాయి. గోడకు జారబడిన వాడలా తల ముందుకు వేలాడేసాడు. అదే అదనుగా భావించి నెమ్మదిగా అడుగులువేస్తూ ముందుకు సాగాను. వాణ్ని దాటి రెండడుగులు వేసానో లేదో చటుక్కున తలపైకెత్తి:

"ఏయ్....! ఎవర్నువ్వు...ఇలారా..!" అని వెనక్కి

పిల్చాడు వాడు.

నేను వెనక్కి తిరుగుతూనే హఠాత్తుగా యెగిరి వాడి మీద పడ్డాను. ఊహించని సంఘటనకు ఒక్కసారిగా వుక్కిరిబిక్కిరయ్యాడా వ్యక్తి. వాడి పీక సరిగ్గా నా చేతుల్లో అమరింది. ఊపిరి అందక గిజగిజలాడాడు' తన చేతులతో నా చేతుల్ని వెనక్కి నెట్టాలని ప్రయత్నించాడు. కానీ నావి ఉక్కు హస్తాలు. నిముషాల్లో కళ్ళు నాలుకా వెళ్ళబెట్టి ప్రాణం వదిలేసాడా వ్యక్తి.

దౌర్భాగ్యుడు కోరి మృత్యువును ఆహ్వానించాడు.

వాడి శవాన్ని పూలకుండీల మధ్యకు లాగేసాను. చేతులు దులుపుతూ పైకి లేస్తుండగా ప్రక్క వరండాలో అడుగుల చప్పుడయింది. సిగరెట్ ప్రాణి తిరిగివస్తూ వుండొచ్చు.

అటూ ఇటూ చూసి చచ్చినవాడు మొదట కూర్చున్న స్థలంలో చతికిలబడ్డాను. గుప్పు గుప్పున సిగరెట్ పొగ వదులుతూ రైలింజన్‌లా వచ్చాడా వ్యక్తి. తల ముందుకు వాల్చి నిద్ర నటించసాగాను.

వచ్చినవాడు "నా కొడకా కుంభకర్ణుడి తమ్ముడివి!" అంటూ నా కాళ్ళను తన కాలితో ప్రక్కకుతోసి తను ఆ స్థలంలో కూర్చున్నాడు.

నేను ఒక్క వుదుటున లేచి వాడి పైపడ్డాను. పాపం! మిత్రులిద్దరికీ భగవంతుడు ఒకే రకమయిన చావు రాసి పెట్టినట్టున్నాడు. వీడూ పీక దగ్గరే దొరికాడు. వీడి మెడ మరీ కోడి మెడలా వుంది. టుప్పుకున చచ్చి వూరుకున్నాడు. వీడి శవాన్ని ముందు శవం ప్రక్కన చేర్చి ముందుకు అడుగేసాను.

ఓ గదిలో దీపం వెలుగుతూ వెలుతురు వరండాలో

పడుతోంది. తలుపుకి ఇరుప్రక్కలా వరండాలో చెక్క పెట్టెలు దొంతరలుగా పేర్చి వున్నాయి. బహుశా ఆదేదో స్టోరయివుండాలి. చెక్క పెట్టెలు చాటుగా గది లోకి తొంగిచూశాను. కళ్లు జిగేలు మన్నాయి. అది అమ్యూనిషన్ స్టోర్! తన వెతుకులాటకూడా ప్రస్తుతం దీనికోసమే. లోపల టేబిలుముందు కూర్చొని దీక్షగా యేదో లెక్కలు రాసుకుంటున్నాడా వ్యక్తి. చప్పుడు కాకుండా లోనికి ప్రవేశించాను.

కుర్చీని సమీపిస్తుండగా నా అడుగుల సవ్వడి పసిగట్టి చటుక్కున తలతిప్పాడా వ్యక్తి. నేను ఒకే అంగలో వాణ్ణి సమీపించాను. పెద్దగా నోరు తెరిచే వాడి ప్రయత్నానికి అడ్డుకట్టవేస్తూ ఎడమచేతితో వాడి నోటిని మూసి కుడిచేతిని చాచి మెడమీద కొట్టాను. కిక్కురు మనకుండా బల్లమీదకు వాలిపోయాడా వ్యక్తి.

గది తలుపులు ఓరగా వేసాను. సోనార్ అడవులు ఇన్నాళ్ళుగా వీళ్ళ చెప్పుచేతుల్లో యెలా వున్నాయో లోపల సరంజామా చూస్తే అర్థమవుతుంది ఎవరికయినా. ఈ గదిలో వున్న అమ్యూనిషన్ నిజానికి ఒక ఆర్మీ స్టోర్ లో సయితం వుండదేమో. మెషిన్ గన్స్ వంటి ఆధునికమయిన ఆయుధాలతోపాటు డైనమైట్ లు, మినీ బాంబులవంటి శక్తివంతమయిన విధ్వంసక పరికరాలు రాసులు పోయబడి వున్నాయి.

షర్టు టక్ చేసి లోపల వీలయినన్ని బాంబులు వేసాను. మెషిన్ గన్ చేతబట్టి బయటకు నడిచాను. భవనానికి అదే ఆఖరు ద్వారం. ద్వారం ప్రక్కనే ఒక టేబిలు చుట్టూ నలుగురు వ్యక్తులు కూర్చొని దీక్షగా పేకాడు తున్నారు. తెరిచి వున్న ద్వారంగుండా అడవి దర్శన

మిస్తోంది. చల్లగాలికి చెట్లు వూగుతూ చీకటిలో మునిగి వుంది బయట వాతావరణం. ఈ ఒక్క అడ్డంకి దాటితే అడవిలో పడిపోయినట్టే లెఖ్ఖ!

ఆట మంచి పట్టులో వున్నట్టుంది. లెప్పయినా వాళ్ళక ఆటలో మునిగి వున్నా రంతా. ఇంతకుమించి సమయం దొరకదు. నెమ్మదిగా అడుగులు వేస్తూ పాత కాపులా తల వంచుకుపోతున్నాను.

ఇంతలో హఠాత్తుగా లోపలినుండి కేకలు వినపడ్డాయి. లోపల నా నిర్వాకమంతా బయటపడినట్టుంది.

“ఖైదీ తప్పించుకున్నాడు.... మన వాళ్ళను చంపేశాడు.... పట్టుకోండి వాణ్ని .... నరకండి.... చంపండి....” కేకలతో పరుగులతో వాతావరణం ఒక్క సారిగా మారి పోయింది.

పేకాట గ్యాంగు ఉలిక్కి పడుతూ పేకలు జారవిడిచారు. వారి దృష్టి సరిగ్గా నామీదే పడింది.

“అడుగో.... వాడే! .... పట్టుకోండి....” నా వంక చేయి చాపి అరిచా డొకడు. పేకాట సభ్యులు ఒక్క సారిగా ముందుకు దూకారు. వాళ్ళ చేతుల్లో తుపాకులు సిద్ధంగా వున్నాయి.

క్షణం ఆలస్యమయితే నా శరీరం తుపాకీ గుళ్ళతో నిండిపోవడం ఖాయం. షర్టులో చేయి జొనిపి ఓ మినీ బాంబు లాగడం ఆ ఊపున వారిమీదకు విసరడం ఒకే క్షణంలో జరిగిపోయింది. మినీ బాంబు నా ఊహకు నాలుగురెట్లు శక్తివంతమయినది.

కళ్లు మిరుమిట్లు గొలుపుతూ భయంకరమైన విస్ఫోటనం. భవనం మొత్తం కంపించిపోయింది ఒక క్షణం. బల్ల దగ్గర మనుషులతో బాటు బల్ల సయితం కనపడలేదక్కడా!

బాంబు అదురుకు ద్వారం దగ్గర పైకప్పు కూలి ద్వారం మూసుకుపోయింది. మరి కొద్ది క్షణాల్లో ఆ ప్రాంతంలో ఏం జరుగుతుందో చెప్పడం కష్టం! వెంటనే వెనక్కి పరుగుతీశాను.

చెక్క మెట్లు కనబడ్డాయి. పైన బాస్ కీచుగొంతు వినపడుతోంది. "నరకండి వాణ్ని.... చంపండి.... పోగులు పెట్టండి!" పిచ్చివాడిలా అరుస్తున్నాడు బాస్.

చకచకా మెట్లెక్కుతుండగా పైనుండి ఓ అరడజను మంది తుపాకులు పేలుస్తూ మెట్లు దిగుతున్నారు. మెట్లు దిగే సమయంలేదు. అంత ఎత్తునుండి ప్రక్కకు గెంతి మెట్లు దిగువకు దొర్లిపోయాను. వాళ్ళంతా మెట్లు దిగి గుడ్డిగా ముందుకు పోతున్నారు. చప్పట్లు చరిచాను. వాళ్ళు వెనుతిరిగారు. నా చేతిలో మెషిన్‌గన్ నిప్పు రవ్వలు జల్లింది. ఆర్తనాదాలు చేస్తూ కుప్పలా కూలారంతా!

"వాడు మెట్ల కింద వున్నాడు .... రండి....! రాస్కెల్స్....ఎక్కడ చచ్చార్రా...." పెద్దగా అరుస్తున్నాడు బాస్. బాస్ దృష్టి చెక్క మెట్లమీదే వుంది.

అటునుండి చెక్కమూలం పట్టుకొని బాస్ కంట పడకుండా పైకెక్కాను. ముందుకు చూస్తూ తనవాళ్ళను రమ్మని అరుస్తున్నాడు బాస్. పూర్తిగా ముసుగు ధరించి వున్నాడు. ప్రక్కనుండి ఎగిరి కాళ్ళతో తన్నాను. బంతిలా ఎగిరి గోడకు కొట్టుకొని కిందపడ్డాడు. ముందుకు దూకి ఒక చేత్తో వాడి కాలరు పట్టి రెండో చేత్తో ముసుగు లాగబోతూండగా బాస్ తన చేతులతో నా ప్రయత్నాన్ని అడ్డుకోసాగాడు.

ఇంతలో ప్రక్కగదిలో నుండి బాస్ అనుచరులు బిల బిల లాడుతూ బయటపడసాగారు. బాస్‌ను వదిలి మెషిన్ గన్‌ని అటు తిప్పాను. బాస్ అనుచరులు ఎక్కడివాళ్ళక్కడే పడిపోతున్నారు. ఆ పని పూర్తి చేసి ఇటు తిరిగే సరికి బాస్ కనపడలేదక్కడ.

పిరికి విధంగా పలాయనం చిత్తగించాడు. కానీ బాస్ గోడకు కొట్టుకుపడిన చోట మెరుస్తూ కనపడిందేదో!

అంగుళం పొడవున ఎర్రరంగు వేయబడిన బొటనవ్రేలి గోరు! భద్రంగా జేబులో వేశాను.

భవనంలో మిగిలిన బాస్ అనుచరవర్గం యావత్తూ నా మెషిన్ గన్ బారిన పడి మరణించారు. భవనంలో చెలరేగిన అగ్ని క్రమేపీ దావానలమై భవనమంతా ఆక్రమిస్తోంది. ఇక కొద్ది సేపటిలో జరగబోయేది వూహించి భవనం నుండి బయటపడ్డాను.

అప్పటికి మంటలు ఆర్మ్స్ స్టోర్‌లో ప్రవేశించి వుంటాయి. భవనం చిన్నాభిన్నమవుతూ శిథిలభాగాలు ఆకాశంలోకి ఎగిరాయి. పెద్దగా నిట్టూరుస్తూ గుర్రాన్ని అదిలించాను.

# 10

తూర్పున అరుణోదయమయింది. కిలకిలారావాలతో అడవి నిద్ర మేల్కొంటోంది.

ఫారెస్టు రేంజ్ ఆఫీసు ప్రశాంతంగా వుంది. లోపలి నుండి చేతిలో పెద్ద సూట్ కేసుతో బయట అడుగు పెట్టాడు ఆఫీసర్ అగర్వాల్! కర్ర మెట్లు దిగుతూ నన్ను చూసి టక్కున ఆగిపోయాడు.

"అరె....విక్రమ్! ఎక్కడికెళ్ళావు యిన్నాళ్ళు.... నేను నీ కోసమే బయల్దేరుతున్నాను...." అన్నాడు

తబ్బిబ్బుగా.

ఆశ్చర్యం దిగకుండా చిరునవ్వు నవ్వాను.

"మిస్టర్ అగర్వాల్! నిన్ను చూస్తూంటే నాకు గజేంద్రమోక్షంలో విష్ణుమూర్తి గుర్తొస్తున్నాడు. చేతిలో యే తుపాకీ లేకుండా వెంట ఒక మనిషయినా రాకుండా కేవలం ఆ సూట్ కేసులో నన్ను ఏ విధంగా అడవి దొంగల బారి నుండి కాపాడాలని బయల్దేరి నట్టు...." అన్నాను కాస్త వెటకార ధోరణిలో.

ఆ మాటకు అగర్వాల్ నిష్ఠూరంగా "విక్రమ్! నీ మాటలు విచిత్రంగా వున్నాయి. నిన్నొకమారు అడవి దొంగలబారి నుంచి కాపాడలేదా!?" అన్నాడు....

"అవును కాపాడావు....!" అని కొద్ది సేపాగి జేబులో నుండి షికారి మహల్ లో దొరికిన వేలిగోరు ముక్కను తీసి అగర్వాల్ దిక్కుగా విసురుతూ "అందుకనే నువ్వు మహల్ లో విరగ్గొట్టుకున్న దీనిని భద్రంగా నీకు అప్పగిస్తున్నాను" అన్నాను.

అగర్వాల్ ఓ క్షణం నావంక నిశ్చేష్టుడయి చూస్తూ కిందపడిన గోరును అందుకునేలా ముందుకు వంగి కోటు జేబులో రివాల్వర్ ని మెరుపువేగంతో బయటకులాగాడు. రివాల్వర్ నా వంక తిరిగి పేలేలోగా అతని చేతిలో రివాల్వర్ గాల్లోకి ఎగిరింది.

అగర్వాల్ దొరికిపోయినవాడిలా వెర్రి మొహం వేస్తూ నా చేతిలో పొగలు కక్కుతున్న పిస్తోలువంక చూడసాగాడు. పిస్తోలును తిరిగి హోల్ స్టర్ లో వుంచుతూ గుర్రం దిగాను.

"మిస్టర్ అగర్వాల్! అమాయకుడిలా అగుపించే అసాధ్యుడివి నువ్వు. అతి తెలివికిపోయి నీ మనుషుల బారి

నుండి నన్ను కాపాడిన సంఘటనను కావాలని సృష్టించావు. నిజానికి అప్పుడే నా మనసులో యేదో మూల నీమీద కొంత అనుమానం కలిగింది.

ఆ సందర్భంలో నీ వెంట వున్న గార్డులకు రెట్టింపు అడవి దొంగలున్నారు. అయినా వాళ్ళు ఎటువంటి ప్రతిఘటనా లేకుండా పారిపోయారు. ఎందరో వుద్దండులైన పోలీసు సిబ్బందిని నిర్దాక్షిణ్యంగా వధించిన ఆ హంతకులు అంత సులభంగా వెన్నిచ్చి పోవడానికి కారణమేమిటి? అంతేకాదు! ఇందర్ని మట్టుపెట్టిన ఆ దుండగులు నిన్ను మాత్రం యెందుకు వదిలిపెట్టినట్టు? అంటే నీకు వాళ్ళతో ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంబంధం వుండి వుండాలి ....అవునా?" అన్నాను నవ్వుతూ.

ఆ తర్వాత కొద్దిసేపు అగర్వాల్ తల వంచుకొని వుండిపోయాడు. పిదప కళ్ళవెంబడి నీళ్ళు రాలుతూ వుండగా తలెత్తి గద్గదస్వరంతో...."విక్రమ్ బేటా! జరిగిందేదో జరిగిపోయింది.... పెద్దవాణ్ణి ....అన్నీ వదలుకొని ఏ మారతీరాలకో పోతాను....ఒంటరివాణ్ణి ....నీకు తెలుసుగా! నా అనుచరులంతా మరణించారు....ప్రమాణం చేస్తున్నాను....ప్లీజ్! నన్ను వదిలేయ్...." అంటూ చేతులు జోడించి ముందుకు వస్తున్నాడు.

వాస్తవానికి అగర్వాల్ పశ్చాత్తప్తుడయి హృదయపూర్వకంగా ఆ మాట అనివుంటే పరిస్థితి యే రకంగా వుండేదో! ఎందుకంటే ఈ అసైన్ మెంటులో సర్వాధికారాలూ నావే! కానీ కుక్కతోక వంకర. ఎట్టి పరిస్థితుల్లోనూ అది నిటారుగా వుండదు, వుండలేదు.

నా చేరువకు వచ్చిన అగర్వాల్ నేను వూహించని రీతిలో తన బూటుకాలితో నేలమీద తన్ని నా కళ్ళల్లో

ఇసుక పరేలా చేశాడు. అడుగుల చప్పుడుబట్టి అగర్వాల్ తొలుత తన చేతిలో నుండి నేను ఎగురగొట్టిన పిస్తోలు పడివున్న దిశగా పరుగెత్తుకున్నట్టు అర్థమయింది నాకు.

అగర్వాల్ నిజానికి చక్కని పథకమే ఆలోచించాడు. కానీ అతడు ఆలోచించక వదలిపెట్టి విషయం; అది పొరపాటున తెలియక నే అనుకోండి: ఒకటుంది!

అదేమిటంటే! తేజటిగను సయితం దాని అడుగుల ఝంకారం ఆధారంగా కళ్ళు మూసుకొని పిస్తోలుతో కాల్చి పడగొట్టగలను. ఇసుక పడిన కళ్ళు తెరిచే ప్రయత్నం చెయ్యలేదు. అగర్వాల్ తిరిగి తన పిస్తోలును పొందగలిగితే నా పని ఆఖరు.

హోల్స్టరు నుండి పిస్తోలు లాగి అగర్వాల్ కాలి సవ్వడి ఆధారంగా రెండుసార్లు షూట్ చేశాను.

కవ్వుమనే అగర్వాల్ ఆర్తనాదం వినిక అతని శరీరం నేలమీదపడుతూ దబ్బున చప్పుడయింది. దీర్ఘంగా నిట్టూర్చి దాపులనే వున్న గుర్రాలు నీళ్ళుతాగే తొట్టిలో మొహం పెట్టి ఇసుకను వదిలించుకున్నాను.

గుర్రాన్ని అధిరోహిస్తూ అగర్వాల్ శరీరం పడివున్న దిశగా చూశాను. తెరచుకున్న అతని నోటిలోకి అప్పుడే ఈగలు రాకపోకలు ప్రారంభించాయి. అగర్వాల్ అంతంతో అడవి దొంగల ముఠా పూర్తిగా నాశనమయినట్టే. రాజస్థాన్ ప్రభుత్వం ఇకమీదట నిశ్చింతగా వుండొచ్చు.

గుర్రాన్ని అదిలించాను. స్వేచ్ఛావాయువులు పీల్చుతూ పెద్దగా సకిలించి ముందుకు సాగింది అశ్వం.

—: అయిపోయింది :—

# దెయ్యాల బండి

## అపర్ణా నైటింగేల్

"క్రూ...." అంటూ ఎక్కడో దూరాన కూత విని పించింది.

"చుక్ .... చుక్ .... చుక్ .... చుక్ ...." అంటూ దయ్యాలబండి వస్తున్న చప్పుడయింది.

ఆరేళ్ళ పసివాడు రాజు బెడ్ మీద కదిలి లేచి కూర్చున్నాడు.

దెయ్యాలబండి వస్తున్న చప్పుడు చెవులు రిక్కించి విన్నాడు.

గోడ గడియారం "టంగ్ ....టంగ్ ....టంగ్ ...." మని అప్పుడే పన్నెండు గంటలు కొట్టింది.

రాజు బెడ్ దిగి నిలబడ్డాడు.

పక్క మంచంమీద దామోదర్, కవిత గాఢనిద్రలో వున్నారు.

రాజు నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ గది తలుపు దగ్గరకు వచ్చాడు.

మూసి వున్న తలుపులు వాటికవే తెరుచుకున్నాయి.

గుమ్మంలోంచి బయటకు అడుగు పెట్టి నడవాదాకా నడుచుకుంటూ వెళ్ళాడు.

పక్కనే మెట్లు వున్నాయి.

నెమ్మదిగా మెట్లు దిగాడు.

వీధి గుమ్మం తలుపులు వాటికవే తెరుచుకున్నాయి.

బయటకు అడుగు పెట్టాడు.

ప్రహారీ గేటు సమీపించాడు.

గేటు కూడా దానికదే "కిర్రు"మంటూ తెరుచుకుంది.

రాజా ముందుకు అడుగువేశాడు.

"చుక్ .... చుక్ .... చుక్ ...." దెయ్యాలబండి చప్పుడు ఆ నిశ్శబ్ద నిశీధిలో కర్ణకఠోరంగా వినిపిస్తోంది.

చుట్టూ గాఢాంధకారం.... జేబురు జేబురుగా పెరిగిన వృక్షసంపద గాలికి జీమూతాల్లా తలలాడిస్తున్నాయి.

కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి....

సమీపంలో వున్న రైలు కట్టవైపు నడక సాగించాడు రాజా.

"చుక్ .... చుక్ ..." దెయ్యాలబండి దగ్గరవుతోంది.

రైలుకట్ట ఎక్కి పక్కగా నిలబడ్డాడు.

కట్టకు అవలివైపున శ్మశానం!

కనుచూపుమేరదాకా సమాధులు.... అక్కడక్కడ కాష్టాలు కాలుతున్నాయి. చీకట్లో చితి సెగళ్ళు నింగికి ఎగుస్తున్నాయి.... ఎర్రటి జ్వాలలు ఆ ప్రదేశాన్ని భయం గొలుపుతున్నాయి.... అక్కడి చెట్లు జడల భూతాల్లా తలలూపుతున్నాయి గాలికి.

"చుక్ .... చుక్ .... చుక్ .... చుక్ ...." దయ్యాలబండి బాగా దగ్గరయింది.

హెడ్ లైటు వెలుతురులో నల్లని బొగ్గు యింజను మరింత నల్లగా నిష్ఫురత్వంతో దట్టమైన పొగ వదులుతూ రాక్షసిలా వస్తోంది.

ఆ వెనకనే కంపార్టుమెంట్లున్నాయి.

"టక ....టక ....టక ....టక ...." మంటూ చక్రాలు చప్పుడు చేసుకుంటూ రైలుకట్ట పక్క నిలబడ్డ రాజు పక్క నుంచి ముందుకు దూసుకుంటూ వెళ్ళిపోయింది దెయ్యాలబండి.

ఆఖరి కంపార్టుమెంట్ వెనక రెడ్ లైట్ ఎర్రటి మంటలా కనిపిస్తోంది.

అది క్రమక్రమంగా కనుమరుగవుతోంది.

రాజు దీక్షగా అదే చూస్తూ నిలబడ్డాడు.

అదే సమయంలో —

బంగళా బెడ్ రూమ్‌లో కవితకు హఠాత్తుగా మెళకువ వచ్చింది.

ప్రక్కకు తిరిగి చూసింది.

రాజు బెడ్ ఖాళీగా వుంది.

'బాబు యెక్కడికెళ్ళాడు?' అని అనుకుంది.

లేచి గది బయటకు వచ్చింది.

పక్కనే వున్న బాత్ రూమ్‌లోకి తొంగి చూసింది.

బాత్ రూమ్ ఖాళీగా వుంది.

ఆమె కంగారుపడింది.

మేడ మెట్లు దిగి చూసింది.

బంగళా గుమ్మం తలుపులు, ప్రహారీ గేటు బార్లా తెరిచి వున్నాయి.

'రాజు ఎక్కడికెళ్ళాడు?' గాబరాగా అనుకుంది మళ్ళీ.

ఆ సమయంలో ఆమెకు రెండురోజుల కిందట జరిగిన సంఘటన గుర్తొచ్చింది.

ఆ రోజు రాత్రి రాజు తనను నిద్రలేపాడు.

ఆ సమయంలో దూరాన ట్రైన్ కూతతోపాటు దెయ్యాలబండి వస్తున్న చప్పుడయింది.

"అమ్మా! ఇంత రాత్రిపూట వస్తోంది కదా! ఆ ట్రైన్ యే ఊరెళుతోందమ్మా?" అని అడిగాడు రాజు.

"విజయవాడ వెళుతోందమ్మా!" అని చెప్పింది కవిత.

"ఒకసారి డాడీ, నువ్వు, నేను ఢిల్లీ వెళుతున్నప్పుడు రైళ్ళకి పేర్లుంటాయని, దాని పేరు రాజధాని ఎక్స్‌ప్రెస్ అని చెప్పావు కదా! మరి ఇప్పుడు వస్తోన్న ఈ ట్రెయిన్ పేరేంటి?" అని అడిగాడు.

"దీనిని అంతా దెయ్యాలబండి అని పిలుస్తారు. అర రాత్రి తరువాత ఈ ఊళ్ళోంచి వెళుతుందని, ఈ ట్రెయిన్‌ని అంతా అలాగే పిలుస్తారు" అని చెప్పిందామె.

"అయితే ఆ దెయ్యాలబండిని నాకు చూడాలనుందమ్మా!" అన్నాడు.

"వద్దు బాబూ! రాత్రుళ్ళు చిన్న పిల్లలు యెక్కడికీ వెళ్ళకూడదు. జడుసుకుంటారు" అంది.

"పోనీ నువ్వూ తోడు రామ్మా! ఆ ట్రెయిన్ చూద్దాం!!" అన్నాడు.

"నేను కూడా వచ్చినా నువ్వు ఆ చీకటిని చూసి జడుసుకుంటావు. వద్దు, మరోసారి యెప్పుడైనా చూపిస్తానే!" అంది.

ఆ తరువాత రాజు కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

మర్నాడు కూడ అలాగే దెయ్యాలబండి వచ్చే సమ

యానికి తనని నిద్రలేపి "ఆ ట్రెయిన్ చూద్దాం పదమ్మా!" అని అడిగాడు మళ్ళీ.

ఆమె ఆ సమయానికి ఏదో సమాధానం చెప్పి రాజాని నిద్రపుచ్చింది.

కాని___

ఇప్పుడు ఆమె లేచి చూస్తే రాజా లేడు.

బంగళా తలుపులు తెరిచి వున్నాయి.

అంటే ....

అంటే ....

రాజా ఇప్పుడా రైలుకట్ట దగ్గరకు ఒంటరిగా వెళ్ళాడన్నమాట!

అంతే!

ఆమె హృదయం భయంతో తల్లడిల్లిపోయింది.

బెడ్ రూమ్‌లోకి వెళ్ళి దామోదర్ ని నిద్రలేపింది.

"మనబ్బాయి కనిపించడంలేదు దామూ!" అంటూ___ రాజా యెక్కడికి వెళ్ళి వుంటాడో తన అనుమానం వివరించి చెప్పింది.

దామోదర్ దిగ్గున మంచంమీంచి లేచాడు.

ఇద్దరు వడివడిగా సమీపంలో వున్న రైలుకట్టవైపు పరుగుతీశారు.

వాళ్ళు రైలు కట్ట సమీపించేసరికి___

అక్కడ రాజా ఒంటరిగా నిలబడి వున్నాడు.

కవిత రాజాని దగ్గరకు తీసుకుంది.

"ఇక్కడేం చేస్తున్నావు బాబూ!? రాత్రిపూట ఇలా ఒంటరిగా రావచ్చా!? తప్పుకదూ?!" అంది కవిత.

"మరి దెయ్యాలబండి చూస్తానంటే వద్దన్నావ్ గా! నిన్ను చూపించమంటే చూపించనన్నావ్ గా! అందుకే

నిన్నొక్కర్నే చూడాలని వచ్చాను" నవ్వుతూ చెప్పాడు రాజా.

"చాలు....చాల్లే...ఇంకెప్పుడూ ఇలా రాత్రుళ్ళు ఒంటరిగా రాకు! పద ఇంటికి పోదాం!" అంటూ కసిరాడు దామోదర్.

ముగ్గురూ రైలుకట్ట దిగారు.

రాజా హఠాత్తుగా వెనక్కు తిరిగి రైలుకట్ట అవతలివైపు వున్న శ్మశానం వైపు చూసి టాటా చెప్పాడు.

"ఏమిటి రాజా? ఎవరికి టాటా చెబుతున్నావ్?" అడిగాడు దామోదర్.

"డాడీ! అక్కడ చెట్లమీద యేవో తెల్లని ఆకారాలు కనిపిస్తున్నాయి, అవి నన్ను చూసి చేతులు ఊపుతున్నాయి" చెప్పాడు రాజా.

ఆ మాటలకు దామోదరం, కవితల గుండెలు జల్లుమన్నాయి.

కాళ్ళు వణికాయి.

భయం భయంగా వెనక్కి తిరిగి చూశారు.

వాళ్ళకి యేమీ కనిపించలేదు.

"వట్టిది బాబూ! అక్కడెవరూ లేరు. నువ్వు భ్రమ పడుతున్నావంతే!" అంది కవిత.

రాజా తల్లి వంక తండ్రి వంక అదోలా చూశాడు.

వంకరగా నవ్వి ఊరుకున్నాడు.

ఆ బాలుని నవ్వు కవితకు భయం గొలిపింది.

కుర్రాడిని మరింత దగ్గరగా పొదివి పట్టుకుంది.

వేగంగా అడుగులు వేస్తూ బంగళాకి తిరిగివచ్చేశారు.

రాజాని మంచంమీద పడుకోబెట్టింది కవిత.

వెంటనే నిద్రలోకి జారిపోయాడు రాజా.

"దామూ! మనబ్బాయి మాటలనుబట్టి బాబుకి ఏదో గాలి సోకి వుంటుందని నా అనుమానం" అంది కవిత.

"అవును నాకూ అదే అనుమానంగా వుంది" అన్నాడు దామోదర్.

"ఎవరైనా కోయదొరని పిలిచి చూపిద్దాం" అంది కవిత.

"అలాగే! ఇక పడుకో" అని అంటూనే నిద్రలోకి జారిగిపోయాడు దామోదర్.

కవిత కూడ నిద్ర కుపక్రమించింది.

ఆ మర్నాడు—

దామోదర్ ఓ కోయదొరను వెంటబెట్టుకుని వచ్చి రాజాను చూపించాడు.

ఆ కోయవాడు బాలుడిని పరీక్షించి—

"మీ అనుమానం నిజమే! గాలి సోకింది. తావీదు కడతాను" అని రాజాకి తాయెత్తు ఒకటి కట్టాడు.

## 2

దామోదర్, కవితలు వుంటున్న బంగళా ఊరికి దూరంగా వుంటుంది.

ఊరికి, ఆ బంగళాకి సంబంధాలు కలపడానికి దామోదర్—రాజా కవిత కడుపులో వుండగా జీపు ఒకటి కొన్నాడు.

రాజా కాన్వెంట్‌లో సెకండ్ స్టాండర్డ్ చదువుతున్నాడు.

దామోదర్‌కి ఊళ్ళో ఓ ప్రముఖ టెక్స్‌టైల్ దుకాణం వుంది.

అతను ఉదయమే షాపుకి వెళ్ళేటప్పుడు కొడుకు రాజాని జీపులో తనతోకూడా తీసుకువెళ్ళి కాన్వెంట్

దగ్గర దిగబెడతాడు. సాయంత్రం షాపుని మేనేజర్ కి అప్పజెప్పి రాజాని కాన్వెంట్ దగ్గర పికప్ చేసుకుని, ఇంటి దగ్గర దించేసి తను మళ్ళీ జీపులో షాపుకి వెళ్ళి పోతాడు. మళ్ళీ రాత్రి పదిగంటలకే తిరిగి వస్తాడు.

ఆ రోజు ఉదయం రాజా దామోదర్ జీపులో వెళ్ళి సాయంత్రం తిరిగి వచ్చేశాడు.

కవిత వంట గదిలో టిఫిన్ తయారుచేస్తోంది.

రాజా బంగళా ఆవరణలో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

ఆ పసివాని మెదడు యేదో దీర్ఘంగా ఆలోచిస్తోంది.

తనలోతనే వికృతంగా నవ్వుకుంటున్నాడు.

కళ్ళల్లో యేదో తెలియని క్రౌర్యం తొణికిసలాడుతోంది.

ఆ సమయంలో బంగళా ప్రహరీ గోడమీంచి పొడవాటి పెద్ద నాగుపాము ఒకటి బుసకొడుతూ క్రిందికి దిగింది.

రాజా దృష్టి దానిమీద నిలిచింది.

చెంగున దాని దగ్గరకు పరిగెట్టుకెళ్ళాడు.

చరచరా పాక్కుంటూ పోతోంది నాగు.

చురుగ్గా ఎడమచేత్తో దాని తోక పట్టుకొని పైకి లేపాడు.

“బుస్”మంటూ బుసకొట్టి ఆ బాలుని చేతిలో మెలికలు తిరుగుతూ ఆడసాగింది పాము.

రాజా దానిని తోక దగ్గర అలాగే పట్టుకుని బంగళా మెట్లెక్కి పైకి వెళ్ళాడు.

పాము రాజా చేతిలో ఐదారు మెలికలుగా చుట్టుకుపోయింది.

వంట గదిలోకి ప్రవేశించాడు రాజా.

కవిత అటు తిరిగి వంట చేసుకుంటోంది.

"మమ్మీ!" చిన్నగా పిలిచాడు రాజా.

"ఏం బాబూ!?" అంటూ వెనుదిరిగిన కవిత కొడుకు చేతిలో పామును చూసి "కెవ్వు"మని కేక వేసింది.

రాజా చిరునవ్వు నవ్వుతున్నాడు.

"బాబూ! రాజా! అది పాము. దానిని అలా పట్టుకో కూడదు వదిలెయ్" అంది కంగారు పడుతూ.

"ఏం మమ్మీ!? పాముని పట్టుకుంటే ఏమౌతుంది?" అమాయకంగా అడిగాడు.

"అది విషపురుగు. దానికి విషం వుంటుంది. అది కాటేస్తే చచ్చిపోతారు. తొందరగా దాన్ని వదిలేయ్!" అంది ఆత్రుతగా.

రాజా ఆ నాగుని వదల్లేదు.

పైగా—

అదోలా నవ్వాడు.

"పాముకి ఒళ్ళంతా విషం వుంటుందామ్మా?!" అని అడిగాడు.

"లేదు బాబూ! దానికి కోరల్లోనే వుంటుంది విషం. ఆ కోరలతో అది కాటేస్తే వెంటనే నురగలు కక్కుకుని చచ్చిపోతారు" కంగారు పెట్టింది కవిత.

ఆమె ముఖంలో భీతి స్పష్టంగా తొంగిచూస్తోంది.

రాజా మళ్ళీ నవ్వాడు.

"మమ్మీ! పాముకి కోరల్లోనే విషం వుంటుందని, కాని మనిషికి నిలువెల్లా విషమేనని టీచర్ చెప్పారు. నిజమేనా?!" అడిగాడు అదోలా నవ్వుతూ.

ఆమె ఆ మాటకు సమాధానం చెప్పలేకపోయింది.

కాని ఎక్కడో మారుమూలల్లో మనస్సు గతుక్కుమంది.

"బాబూ! ఆ మాటలన్నీ తరువాత మాట్లాడుదువు గాని, ముందు పాముని వదిలిపెట్టు. నీకు పుణ్యం వుంటుంది" బతిమాలిందామె.

రాజా ఈసారి పకపక నవ్వాడు.

కేరింతలు కొడుతూ—

"ఈ పాముతో నాకు ఆడుకోవాలనుంది మమ్మీ! పసిపిల్లలను విషజీవులు, క్రూర జంతువులు ఏమీ అనవట! వాళ్ళలో దేవుడుంటాడట! మా టీచరు చెప్పారు. అందుకే ఈ పాము నన్ను కాటు వెయ్యడంలేదు. మరి దీనిని బయటికి తీసుకెళ్ళి ఆడుకోనా?" అని అడిగాడు.

కవిత వణికిపోయింది.

ఆ తల్లి హృదయం తల్లడిల్లిపోతోంది.

నాగు పడగవిప్పి ఆ పిల్లవాని చేతిని "బుస్సు.... బుస్సు...." మంటూ కాటు వేయబోతూ నే మళ్ళీ పడగని వెనక్కు తీసుకుంటోంది.

"రాజా! దయచేసి దాన్ని వదిలేయ్! దాన్ని చూస్తూంటే నాకు భయంవేస్తోంది" అంది.

"నన్నేమీ చెయ్యని పాము నిన్నేంచేస్తుందమ్మా?! కావాలంటే నువ్వూ పట్టుకుని చూడు" అంటూ అడుగులు ముందుకువేశాడు.

రాజా ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తుంటే కవిత గజగజ వణికిపోసాగింది.

ఆమెకు నోట మాట రావడంలేదు.

మరో అడుగువేస్తే రాజా ఆమెకు బాగా దగ్గరవు తాడు. ఆ బాలుని చేతిలోని పాము ఆమెని తాకుతుంది.

అంతే!

కవిత కళ్ళు తిరిగి పడిపోయింది.

మరో పదినిమిషాలు గడిచాక ఆమె కళ్ళు తెరిచింది.

రాజా నవ్వుతూ ఆమె పక్కన కూర్చుని వున్నాడు.

"ప....ప....పా ...ము...." అందామె ఖంగారుగా.

"వదిలేశానమ్మా! నువ్వు భయపడ్డావని దానిని బయట పారేసి వచ్చాను" చెప్పాడు రాజా.

ఆ మాటతో కవిత మనసు కుదుటపడింది.

"అమ్మయ్యా!" అని తృప్తిగా గాలి పీల్చుకుంది.

"బాలూ! నీ మమ్మీమీద నీకు ప్రేమవుంటే ఇం కెప్పుడూ పాము జోలికి వెళ్ళనని, దానిని పట్టుకుని ఆడు కోనని మాటియ్యి" అంది రాజాని దగ్గరగా తీసుకుంటూ.

"అలాగే మమ్మీ!" అంటూ అమాయకంగా నవ్వాడు రాజా.

ఆ రాత్రి దామోదర్ షాపునుంచి తిరిగి రాగానే—

రాజా పాముని పట్టుకొని వచ్చి తనతో మాట్లాడిన సంభాషణ పూర్తిగా పూసగుచ్చినట్టుగా వివరించి చెప్పింది కవిత.

దామోదర్ తలపంకించి యేదో ఆలోచిస్తూండి పోయాడు.

"వాడు పాముతో ఆడుకొన్నా వాడి అదృష్టం బాగుండి పాము యేమీ చెయ్యలేదు. రేపు మరో పాముతో ఆడుకుంటే అదీ కాటు వెయ్యకుండా వుంటుందా? దీనికి కారణం ఆ టీచరే! టీచర్ చెప్పిన మాటల ప్రభావం మన రాజామీద బాగా పనిచేసి వుంటుంది! రేపు టీచర్‌తో మాట్లాడి అలాంటి మాటలు పసిపిల్లలకు బోధించవద్దని చెబుతాను" అన్నాడు దామోదర్.

# 3

జీప్ కాన్వెంట్ ముందాగింది.

అందులోంచి దామోదర్, రాజాలు దిగారు.

స్కూల్ బుక్స్ ఓ చేత్తో పట్టుకొని, మరో చేతితో దామోదర్ చిటికెన వ్రేలు అంచు పట్టుకొని లోపలికి అడుగు పెట్టాడు రాజా.

"గుడ్ మార్నింగ్ టీచర్!" అని టీచర్ని విష్ చేసి, తండ్రి చెయ్యి వదిలిపెట్టి తన సీట్లోకి వెళ్ళి కూర్చున్నాడు.

టీచర్ దామోదర్ని చూసి "గుడ్ మార్నింగ్ సర్! కమిన్!" అంది కుర్చీలోంచి లేచి నిలబడి వినయంగా.

"గుడ్ మార్నింగ్" తను కూడా విష్ చేసి దగ్గరగా వెళ్ళాడు దామోదర్.

"రాజా నా కొడుకు" చెప్పాడతను.

"ఐనో! రోజూ మీరు రాజాని కాన్వెంట్ గేటు ముందు జీప్లో డ్రాప్ చేయడం చూస్తూంటాను నేను" అంది టీచర్.

"చూడండి టీచర్! నేను మిమ్మల్నొక విషయం అడగాలని వచ్చాను!" అన్నాడు దామోదర్ సంభాషణకు నాందిగా.

"చెప్పండి" అంది టీచర్.

"విషజీవులు, క్రూరజంతువులు చిన్నపిల్లలని యేమీ చెయ్యవని మీరు పిల్లలకు బోధించారా?" అడిగాడు.

"అవును చెప్పాను" అంది టీచర్.

"అలా ఎందుకు చెప్పారు?"

"చందమామ కథ ఒకటి పిల్లలకు చెప్పాను. ఆ కథలో ఓ పసిపిల్లవాడు చిన్నతనంలోనే ఓ అడవిలో తప్పిపోతాడు. అప్పుడా బాలుడిని ఆ అడవిలోని క్రూర

మృగాలు, సాధుజంతువులు అన్నీ కలిసి పెంచి పెద్ద చేస్తాయి. ఉగ్రవాడు పాములతో ఆడుకునేవాడని, పులులు, సింహాలమీద స్వారీ చేసేవాడనీ చెప్పాను. ఆ సందర్భంలో కథ చెబుతూ పసిపిల్లల్లో దేవుడుంటాడని, వాళ్ళని విషజీవులు, క్రూరమృగాలు ఏమీ చెయ్యవని చెప్పాను" అంటూ వివరించింది టీచర్.

"కాని, అది కాకమ్మ కథ.... జీవితం కాదు.... మీ రలాంటి కథలు చెప్పడంవల్ల చిన్న పిల్లలపై వాటి ప్రభావం యెలా పడుతుందో మీకు తెలుసా?" అడిగాడు తీవ్రంగా.

"వాళ్ళలో సాహసం వస్తుంది, ఉత్సాహం పెరుగు తుంది. అందుకే నేను పిల్లలకు అలాంటి సాహస కథలు చెబుతూంటాను" అంది టీచర్.

"మీరు చెప్పే కథలు వాళ్ళలో ఉత్సాహాన్ని పెంచితే ఫరవాలేదు. కాని సాహసం పెంచితే కష్టం. ఆ కథ ప్రభావంవల్ల మా రాజు యేంచేశాడో మీకు తెలుసా?" కోపంగా అడిగాడు.

"ఏం చేశాడు?" అంది టీచర్.

"మా బంగళా ఆవరణలో ఓ విషనాగుని పట్టుకుని, వాడి మమ్మీ దగ్గరకు పట్టుకెళ్ళి, దాంతో ఆడుకుంటానని అన్నాడట! ఆమె కంగారుపడి భయంతో వదిలేయమని ఎంత బతిమాలినా వినలేదట! పైగా పిల్లల్లో దేవుడుంటా డని, వారిని విషజీవులు, క్రూరమృగాలు ఏమి చెయ్యవని టీచర్ చెప్పారని అన్నాడట?" చెప్పాడు దామోదర్.

"ఈజిట్!?" ఆశ్చర్యపోయింది టీచర్.

"అవును" అన్నాడు దామోదర్.

"పిల్లల్లో ధైర్యసాహసాలు పెరుగుతాయనే మే

మలాంటి కథలు చెబుతాం తప్ప వాళ్ళు అలాగే చేస్తారని మే మనుకోం కదా!" అంది టీచర్.

"ఏది ఏమైనా మీ రలాంటి నాయనమ్మ కథలు పిల్లలకు చెప్పకండి. ఉన్నది వున్నట్టుగా పిల్లలకు బోధపరచండి. పాము కాటేస్తే చచ్చిపోతారని చెప్పండి. అలాగే పులులు, సింహాలు మొదలగు క్రూరమృగాలు పిల్లలు, పెద్దలు అనే తేడాలేకుండా అందరినీ చంపి రక్తం తాగుతాయని చెప్పండి. అలా చెబితే పిల్లలకు భయం కలిగి ఇలాంటి వాటి జోలికి వెళ్ళరు. మీరు చెప్పిన ఆ కథవల్ల మా రాజు మళ్ళీ మరో పాముని పట్టుకుని ఆడుకుంటూ రేమోనని భయం వేస్తోంది మాకు" కాస్త తీవ్రంగా అన్నాడు దామోదర్.

టీచర్ మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

దామోదర్ ఆమెను మరోసారి హెచ్చరించి అక్కడి నుంచి నిష్క్రమించాడు.

## 4

"కూ...." దూరాన కూత వినిపించింది.

"చుక్....చుక్....చుక్... చుక్...." దయ్యాల బండి వస్తున్న చప్పుడు వినిపిస్తోంది.

"టింగ్....టింగ్....టింగ్...." గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

దామోదర్ బెడ్ మీద కదిలాడు.

బద్ధకంగా లేచి నిలబడ్డాడు.

బాత్ రూమ్ వైపు అడుగులు వేశాడు.

అక్కడ రాజు నిలబడి వున్నాడు.

"ఇక్కడేం చేస్తున్నావ్ రాజూ?" అడిగాడు దామోదర్.

రాజా మాట్లాడలేదు.

తదేకంగా దామోదర్ నే చూస్తూండిపోయాడు.

"మాట్లాడవేం రాజా?" అన్నాడు దామోదర్.

రాజా వికృతంగా నోరు తెరిచి నవ్వాడు. నోటిలో నాలుగువైపులా కోరలు మొలుచుకొచ్చాయి. కనుగుడ్లు బయటకు వెళ్ళుకొచ్చి గోళాల్లా మండుతున్నాయ్.

"హీ....హీ....హీ....హీ...." అని నవ్వుతూ కుడి చెయ్యి ముందుకు జాపాడు.

ఆ చెయ్యి పొడువుగా సాగుతోంది.

దామోదర్ భయభ్రాంతుడయ్యాడు.

నిలువెల్లా వణికిపోసాగాడు.

భయంతో అతని రక్తనాళాలు చల్లగా అయిపోతున్నాయి.

ఒళ్ళు జలదరిస్తోంది.

ఆ ప్రదేశం నుండి పారిపోవాలనుకుని కూడ కదలలేక పోతున్నాడతను.

రాజా చెయ్యి అతని ముఖానికి దగ్గరగా వచ్చింది.

రాజా అరచేయి దామోదర్ ముఖం దగ్గరికి వచ్చి పెద్దదిగా పెరిగింది. అతని ముఖాన్ని చేతిలో ఇముడ్చుకోబోయింది.

అప్పుడు వచ్చింది దామోదర్ కి యెక్కడలేని బలమూ!

"దెయ్యం బాబోయ్!" అని పెద్దగా గావుకేక పెట్టి శక్తికొద్దీ గదిలోకి పరుగుతీశాడు.

ఆ కేకకు గదిలోవున్న కవిత ఉలిక్కిపడి నిద్ర లేచింది.

దామోదర్ గదిలోకొచ్చి, తలుపు గడియ పెట్టి,

కవితమీద వాలిపోయి, ఆమెను గట్టి పట్టుకుని గజగజా వణికిపోసాగాడు.

"ఏమిటి దామూ!? ఏమయింది?" కంగారుగా అడిగింది కవిత.

"దె....దె....దెయ్యం" అన్నాడు తడబడుతూ.

"ఎక్కడ?" మరింత కంగారుగా అడిగిందామె.

"బాత్ రూమ్ దగ్గర రాజా దెయ్యంలా కనపడ్డాడు" అంటూ రాజు తనకి యెలా కనిపించినదీ వివరించి చెప్పాడు.

"ఛ! మనబ్బాయి అలా కనిపించడమేమిటి దామూ!? ఎవరన్నా వింటే నవ్వుతారు. నీదంతా వట్టి భ్రమ అయ్యుండొచ్చు" అంది కవిత.

"భ్రమ కాదు కవితా! యిది నిజం. నా కళ్ళారా చూశాను. నోట్లో నాలుగువైపులా మొలుచుకొచ్చిన ఆ కోరలు....బయటికి వెళ్ళుకొచ్చి ఎర్రగా జ్వాలల్లా మండుతున్న ఆ కనుగుడ్లు ...పొడవుగా సాగుతూ నా వైపు దూసుకొచ్చిన ఆ కుడిచేయి... నా ముఖానికి దగ్గరగా వచ్చి, వెడల్పుగా విచ్చుకున్న ఆ అరచేయి.... అబ్బ! ఆ దృశ్యం తలచుకుంటూంటే ఇప్పటికీ నాకు ముచ్చెమటలు పోస్తున్నాయ్" అంటూ ఇంకా గజగజ వణికిపోసాగాడు దామోదర్.

కవిత ఆలోచనలో పడింది.

ఆ ఆలోచనలో ఆమెకో ఊహ తట్టింది.

"ఓహో! అలా అయివుండవచ్చు" అని అనుకుంది సగర్వంగా.

"ఏమిటి అలా అయివుండడం?" అయోమయంగా

అడిగాడు దామోదర్.

కవిత కిలకిలా నవ్వింది.

"నా పిచ్చి దామూ!" అంటూ ప్రేమగా అతని ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకుంది.

"నువ్వు నిన్న మార్నింగ్ సినిమాకు వెళ్ళావు కదూ?" అడిగింది కవిత.

"అవును."

"ఆ సినిమా పేరేంటి?"

"ఈవిల్ డెడ్."

"అది హారర్ పిక్చర్ అని నువ్వే చెప్పావ్ గా! అందులో హీరో దెయ్యాన్ని గొడ్డళ్ళతో నరికినా దాని, శరీర భాగాలు మళ్ళీ మళ్ళీ అతుక్కుపోతూంటాయని నరకబడ్డ దాని చేతులు ఎగిరొచ్చి హీరోని గట్టిగా పట్టుకుని రక్తం వచ్చేలా రక్కుతాయని, నిజంగా ఆ సినిమా చూస్తూంటే భయంతో హడలిపోయామని, ఆ దృశ్యం యింకా నీ కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తూ ఒళ్ళు జలదరిస్తోందని చెప్పావు. గుర్తుందా?" అడిగింది కవిత.

"అవును. చెప్పాను" అన్నాడు దామోదర్.

"మనం ఏదైనా వస్తువుని కాని దృశ్యాన్ని కాని చూసి విపరీతంగా చలిస్తే వాటి తాలూకు ప్రభావం మన మనసులమీద పనిచేసి, ఆ వస్తువులు దృశ్యాలు మన కళ్ళ ముందు నిజంగానే కనిపిస్తాయి. అది మనసుపడే భ్రమ. అంతే! ఆ సినిమాలోని భయంకర దృశ్యాలే నీ మదిలో మెదులుతున్నాయి. నువ్వు బాత్ రూమ్ కి వెళుతున్నప్పుడు ఆ సినిమా దృశ్యాలని తలుచుకుంటూ భయపడుతూనే వెళ్ళుంటావు. అవునా?"

అవును. నిజమే! తను బాత్ రూమ్ కి వెళుతున్నప్పుడు

"ఈవిల్ డెడ్" సినిమా దృశ్యాలే తన మదిలో మెదులు తున్నాయి. భయపడుతూ నే బాత్‌రూమ్‌వైపు అడుగులు వేశాడు తను. ఆ సమయంలో రాజాని అక్కడ చూసి దెయ్యంలా భ్రమపడి భయపడి వుంటాడు తను. కవిత చెప్పిందే నిజం! తన మానసిక భ్రమే తనని భయ పెట్టింది! కేవలం తన వూహే తనని ఆందోళనపరిచింది.... అని అనుకున్నాడు దామోదర్.

"నిజం కవితా! నీ వన్నది నిజం. ఆ సమయంలో 'ఈవిల్ డెడ్' సినిమా దృశ్యాలే నా మదిలో మెదిలాయి. బహుశా రాజాని చూసి నేనలా భ్రమపడి వుంటానంతే!" అన్నాడు దామోదర్.

అతని మనసు కుదటపడింది.

"నే చెప్పలేదూ! నీదంతా భ్రమని.... రా! రాజాని చూద్దాం" ఆమె బాత్‌రూమ్‌వైపు అడుగులు వేసింది.

దామోదర్ ఆమెను అనుసరించాడు.

అక్కడ—

బాత్‌రూమ్ తలుపులు తెరుచుకుని రాజా బయటకు వస్తున్నాడు.

ఆ బాలుని వదనం ప్రశాంతంగా వుంది.

కళ్ళు నిర్మలంగా వున్నాయి.

తల్లిని చూసి చిరునవ్వు నవ్వాడు.

"ఇక్కడేం చేస్తున్నావ్ రాజా?" ఆ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా అడిగిందామె.

"బాత్‌రూమ్‌కి వెళ్ళాను మమ్మీ!" చెప్పాడు రాజా.

"ఇందాక డాడీ వచ్చినప్పుడు కూడ యిక్కడే ఉన్నావు కదూ!"

"అవును మమ్మీ! నేను బాత్ రూమ్‌కి వెళుతున్నాను. అప్పుడే డాడీ కూడ వచ్చారు. డాడీకి అర్జెంట్ ఏమో నని నేను తలుపుదగ్గరే ఆగిపోయాను. కాని, డాడీ నన్ను చూసి భయపడినట్టుగా ఎందుకో వెనక్కు పరిగెట్టు కుంటూ వెళ్ళిపోయారు" అని చెప్పి "ఏం డాడీ!? బాత్ రూమ్‌కి వచ్చి అలా ఎందుకు గదిలోకి పరిగెత్తి వెళ్ళి పోయారు?" అంటూ తండ్రిని అడిగాడు.

రాజు ముఖం అమాయకంగా వుంది.

ముఖంలో ఎక్కడా ఇందాకటి వికృతత్వం యే కోశానా కానరాలేదు.

ఇది నిస్సందేహంగా తన భ్రమే!

పూర్తి నమ్మకం కలిగింది దామోదర్‌కు.

"ఊరికే అలా పరిగెట్టానంతే! ఏంలేదు" అన్నాడు దామోదర్ తృప్తిగా నవ్వుతూ.

# 5

జూలోంచి మూడురోజుల క్రితం వున్న నల్ల చిరుత ఒకటి బోనులోంచి తప్పించుకుపోయింది.

అది సమీపంలోనే వున్న కొండలమీదికి పారిపోయి ఉంటుందని అధికారుల భావన.

జూ అధికారులు ఆ నల్లచిరుతను ఆఫ్రికా నుండి తెప్పించారు.

అది నల్లగా ఉంటుంది. దాని ఎత్తు మూడడుగులు. పొడవు నాలుగడుగులు వుంటుంది. కళ్ళు ఎర్రగా చింత నిప్పుల్లా ఉంటాయి. అది "గాండ్రు" మని అరిచిందంటే చూపరుల గుండెలు దాని అరపులకు దడదడ లాడుతూ భయంతో అదురుతాయి. అది బోనులో ఉన్నప్పుడు చిన్నపిల్లలు దానిని చూడటానికే జడిసి వాళ్ళ తల్లి

చంద్రుల వెనుక దాక్కునేవారు.

ఆ నల్ల చిరుత మెరుపువేగంతో కన్నుమూసి తెరిచే లోగా శత్రువుమీద దాడిచేసే లాఘవం కలది. ఎంత పెద్ద చెట్టునైనా అమాంతంగా పిల్లిలా ఎక్కి ఛెంగున దూకేయగలదు.

అది తప్పించుకుపోయిన మరుక్షణమే జూ అధికారుల గుండెల్లో రాయిపడింది.

ఒకప్పుడు ఆ జూకి సమీపంలో ఉండే కొండమీద పులులు, సింహాలు, ఎలుగుబంట్లు, దుమ్ములగొండులు మొదలైన క్రూరమృగాలుండేవి.

ఆ సమయంలో అక్కడ ఊరు వెలిసింది.

జనాలు పెరిగారు.

వేటగాళ్ళు వచ్చి వాటినన్నిటినీ వధించేశారు.

చాలా ఏళ్ళు గడిచాయి.

ఊరు బాగా అభివృద్ధి చెందింది.

ఇప్పుడా కొండమీద మచ్చుకి ఒక్క క్రూరమృగం కూడా కానరాదు. కేవలం నక్కలుమాత్రమే ఆ కొండలో కాపురముంటున్నాయి. అవి అయినా పగలు యెవరికీ కని పించవు. ఏ చెట్ల పొదలచాటునో నక్కివుంటాయి. రాత్రయ్యేసరికి ఆ పొదలలోంచి బయటికి వచ్చి కొండ మీద యథేచ్ఛగా సంచరిస్తూ కిందికి దిగివస్తాయి. కొండ దిగువున కట్టబడివున్న యిళ్ళ చుట్టుపక్కల తిరుగుతూ లోపలికి జొరబడి యిళ్ళలో వాళ్ళు పెంచుకునే కోళ్ళు, పావురాలు మొదలగువాటిని ఎత్తుకుపోతుంటాయి.

పశువుల కాపరులు పశువులమందలను కొండమీదికి మేతకు తోలుకుపోయి, సాయంకాలందాకా వాటిని మేపుకొని, చీకటిపడే సమయానికి ఆ మందలని దిగువకు

తోలుకువచ్చేస్తారు. పశువులను నక్కలవాత పడకుండా జాగ్రత్తగా వాటిని కర్రలతో కాపలా కాసుకుంటారు.

ఇప్పుడా కొండ అంటే ఆ వూళ్ళోవాళ్ళకు ఎలాంటి భయమూలేదు. ఆ కొండ నిడివి దాదాపు వూరు పొడవు మించి వుంటుంది.

కొండమీదికి తప్పించుకొని పోయిన నల్లపులి ఏ క్షణంలోనైనా వూళ్ళోకి ప్రవేశిస్తుందేమోనని జా అధికారుల భయం.

పశువుల కాపరులను కొండమీదికి వెళ్ళొద్దని, వూళ్ళో ప్రజలని అప్రమత్తంగా వుండమని మైకుల ద్వారా హెచ్చరించి పేపర్లలో ప్రకటించారు.

పులికోసం కొండమీద పోలీసులు, వేటగాళ్ళు తీవ్రంగా గాలిస్తున్నారు.

అది వూళ్ళోకి జొరబడుతుందని ప్రతీ వీధిలోను సాయుధులైన పోలీసులు కాపలా కాస్తున్నారు. తడవ తడవకు నాలుగు పోలీసు జీపులు వూరంతా తిరుగుతున్నాయి.

కాలేజీలు, స్కూళ్ళు, మూసేశారు.

ఆఫీసులు కూడా చాలావరకు తెరవబడలేదు.

ఊళ్ళో దుకాణాలు చాలామట్టుకు మూసి వేయబడ్డాయి.

దామోదర్‌కు ఈ విషయం తెలిసే కూడ అతను పెద్దగా పట్టించుకోలేదు.

అతను ఆ రోజు షాపు తెరుద్దామనుకున్నాడు.

గేరేజ్ లోంచి జీపు బయటకు తీస్తూండగా తానూ వస్తానని మారాం చేశాడు రాజు.

"నువ్వు రావొద్దు! బాబూ! ఈరోజు నీకు కాన్వెంట్

లేదుగా! హాయిగా యింట్లో కూర్చుని ఆడుకో! వచ్చేటప్పుడు నీకు బొమ్మలు, చాక్లెట్లు తెస్తాన్లే!" అన్నాడు.

"నా కవేమీ వద్దు డాడీ! నీతో పాటు నేనూ వస్తాను. నన్ను తీసుకెళ్ళు" అంటూ మంకుపట్టు పట్టాడు.

ఇక దామోదర్ కు కూడా తీసుకువెళ్ళక తప్పలేదు.

"సరే రా" అంటూ రాజుని జీప్ ఎక్కమన్నాడు.

జీప్ దామోదర్ టెక్స్ టైల్ షాపు ముందు ఆగింది.

దామోదర్ షాపు తెరిచి కేష్ బాక్స్ ముందు కూర్చున్నాడు. రాజు పక్కనే వున్న మరో కుర్చీలో కూర్చున్నాడు. మరో ఐదు నిముషాలు గడిచాక —

ఆ షాపు మేనేజరు, మరో యిద్దరు సేల్స్ మెన్ మాత్రమే పనికి హాజరయ్యారు. మిగతా సేల్స్ మెన్ పనికి హాజరు కాలేదు. పులి భయంవల్ల.

దామోదర్ లాగే పులి గురించి పట్టించుకోని మరి కొందరు యజమానులు తమ దుకాణాలని కూడా తెరిచారు.

రోడ్లమీద జనం పలచగా తిరుగుతున్నారు.

తెరిచివున్న కొద్దిపాటి దుకాణాలలో షాపింగ్ కూడ ఏమంత రద్దీగా జరగడం లేదు.

ఆ సమయంలో దామోదర్ టెక్స్ టైల్ వున్న వీధి చివర దూరంగా పోలీసుల ఈలల శబ్దాలతో పాటు జీపు మోతలు....

ఆ వెనువెంటనే రివాల్వర్లు మోగిన చప్పుడు....

ఆ వెనుకనే "గాండ్రు....గాండ్రు" మంటున్న పులి అరుపులు....

ఒకదాని వెనుక ఒకటి గందరగోళంగా వినిపించ

సాగాయి.

రోడ్డుమీద పలచగా వున్న జనం భయవిహ్వలులై అటూ ఇటూ పరుగెత్తసాగారు.

రివాల్వర్ బులెట్లు పక్కనుంచి దూసుకుపోతూంటే నల్లచిరుత పరుగుపెడుతూ దామోదర్ షాపులోకి ప్రవేశించింది.

షాపులో వున్నవాళ్ళంతా కొయ్యబారిపోయారు. కాళ్ళు గజగజ వణుకుతున్నాయి.

అది షాపులోకి ప్రవేశిస్తూనే ఎదురుగా వున్న దామోదర్ మీదికి పంజాతో దుముకబోయింది.

అంతే!

దామోదర్ తన పని అయిపోయిందనే అనుకున్నాడు.

కాని—

కన్నుమూసి తెరిచేలోగా మరో విచిత్రం జరిగింది.

తండ్రి పక్కన కూర్చున్న రాజా చిరుతమీదికి చెంగున ఒక్క గెంతు గెంతాడు. దాని పంజాని చేత్తో పట్టుకుని వెనక్కు విసురుగా తోసేశాడు.

ఆ విసురుకు అది రెండు గజాలదూరం వెనక్కు వెళ్ళింది.

మళ్ళా గాండ్రుమంటూ రాజామీదికి ఉరికింది.

ఆ బాలుడు దాని రెండు కాళ్ళని ఒడిసిపట్టుకుని గిర గిరా తిప్పాడు. అది నోటితో రాజా ముఖాన్ని పట్టుకో బోయింది. కానీ రాజా లాఘవంగా దాని నోటికి దొర క్కుండా రెండు చేతులతో దాని మెడ గట్టిగా పట్టుకుని కిందికి వేలాడాడు.

ఆ పట్టుకి పులి ఎటూ కదలలేకపోయింది.

గిల గిలా గింజుకో సాగింది.

ఎటూ కదలలేక "గాండ్రు గాండ్రు" మని అరుస్తూ అచేతనంగా వుండిపోయింది.

పోలీసులు లోపలికి అడుగు పెట్టారు.

ఆ దృశ్యం చూసి నిశ్చేష్టులయ్యారు.

ఇక షాపులో వున్నవాళ్ళలో అసలు చలనమే లేదు. కళ్ళు తేలవేసి అలాగే చూస్తూండిపోయారు.

ఓ క్షణం తరువాత అంతా తేరుకున్నారు.

రాజు ఆ పులిని గట్టిగా పట్టుకుని వుండగా, మరో నలుగురైదుగురు కానిస్టేబుల్స్ దాని కాళ్ళు గట్టిగా తాళ్ళతో కట్టేశారు.

పులి నిస్సహాయంగా "గాండ్రు గాండ్రు" మంటూ ఇంకా అరుస్తూనే వుంది.

దానిని మోసుకెళ్ళి వాన్‌లో పడేశారు.

ఇన్‌స్పెక్టర్ రాజుకి షేక్‌హాండిచ్చాడు.

"బాబూ! ఇంత భయంకరమైన పులిని నువ్వొక్కడివే ఎలా పట్టుకుని ఆపగలిగావ్? నీకు భయం కలగలేదా?" భుజం తడుతూ అడిగాడు ఇన్‌స్పెక్టర్. అతనింకా ఆశ్చర్యంలోంచి తేరుకోలేదు.

ఆరేళ్ళ బాలుడు ఓ పులిని ఒంటరిగా ఎదుర్కొన్నాడంటే ఎవ్వరూ నమ్మరు. కాని, అది వాళ్ళ కళ్ళెదురుగానే జరిగిన దృశ్యం. నమ్మక తప్పడంలేదు.

"భయం దేనికి సార్!? మా టీచర్ స్కూల్లో టార్జాన్ కథలెన్నో చెప్పారు. టార్జాన్ సినిమాలు కూడ డాడీ నాకు చూపించారు. అందుకే ఆ పులిని చూడగానే టార్జాన్‌లా దాంతో దెబ్బలాడాలనిపించింది. అంతే! పులిని పట్టుకున్నాను వెంటనే" అంటూ నవ్వుతూ

చెప్పాడు రాజు.

"వెరీగుడ్! బ్రేవో మై బాయ్" అని భుజం తట్టాడు ఇన్‌స్పెక్టర్.

పక్కనే వున్న పోలీసు ఫోటోగ్రాఫరు రాజు ఫోటోని కెమేరాలో బంధించాడు.

దామోదర్ కొడుకువంక కృతజ్ఞతగాను, ప్రేమగాను చూస్తూండిపోయాడు.

ఆ నాడు తను టీచర్‌కి వార్నింగివ్వడం గుర్తొచ్చింది. నిజంగా టీచర్ అలాంటి సాహస కథలు చెప్పబట్టే ఈ వాడు ధైర్యంగా తన కొడుకు పులితో దెబ్బలాడి తన ప్రాణాలు కాపాడాడు.

'అవును. టీచర్లు పిల్లలకు సాహసోపేతమైన కథలు తప్పకుండా చెప్పాలి. ఆ కథలు విని రాజులా ప్రతీ పిల్లవాడు ఓ టార్జాన్ కావాలి' అని అనుకున్నాడు మనసులో.

ఆ మర్నాడు 'బాలుని సాహసం' అనే హెడ్డింగుతో రాజుని ప్రశంసిస్తూ పేపర్లో రాజు ఫోటో పడింది.

ఆ వూరి కలెక్టరు గారు స్కూలులో చిన్న మీటింగు యేర్పాటు చేసి రాజుకి ఐదువందల రూపాయలు బహుమానంతో పాటు ఒక గోల్డు రింగు కూడా ప్రెజెంట్ చేశారు. ఆ మొత్తం జూ అధికారుల ద్వారా రాజుకి ఇప్పించబడింది.

(ముగింపు వచ్చే సంచికలో)

సీరియల్

వి.యస్.రావ్




(గత సంచిక తరువాయి)

"లేదు" కరుణాకర్ కంఠం నిర్లక్ష్యంగా ధ్వనించింది.

"మిష్టర్ రామానుజం!" గజాననరావు కంఠం కోర్టు హాల్లో మారు మ్రోగింది.

కాస్సేపట్లో పంచా, జుబ్బా ధరించిన వృద్ధుడు మెల్లిగా నడుస్తూ బోనులో ఎక్కాడు. దళసరి కళ్లద్దాలు మాసిన గడ్డం, విచారం నిండిన మొహం.

"రామానుజంగారూ, గీత మీకు యేమవుతుంది?" ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

రామానుజం బాధ నిండిన కళ్ళతో చూశాడు. అదురుతున్న అతని పెదవులు మెల్లిగా కదిలాయి. "గీత .... గీత నా .... నా పెద్ద కూతురు...."

"విచారంలో మునిగిపోయిన మిమ్మల్ని కష్టపెడుతున్నందుకు చింతిస్తున్నా. గీతను కరుణాకర్ దగ్గర మీరే అప్రెంటిస్ గా చేర్పించారా?"

రామానుజం మాట్లాడకుండా తన చూపుల్ని కరుణాకర్ వైపు తిప్పాడు. అసహ్యం, ఆగ్రహం అతని కళ్ళల్లో ప్రతిఫలిస్తున్నాయి. పెదవులు మళ్ళీ ఆదరడం ప్రారంభించాయి.

"లేదు .... ఎవరో లేడీ అడ్వొకేట్ దగ్గర చేరమన్నాను. కానీ అమ్మాయి నా మాటల్ని పెడచెవిని పెట్టింది. ఏదో కేసు సందర్భంలో ప్రతిరోజూ అతని పేరు పేపర్లలో కనిపించడమే దాని వ్యామోహానికి కారణం. అతను....అతను చాలా తెలివైన లాయరని దాని నమ్మకం....పిచ్చి అపోహ...."

"రామానుజంగారూ, మీకు ముద్దాయి కరుణాకర్ తో బాగా పరిచయం వుందా?"

"అమ్మాయి రెండుసార్లు నన్ను అతని దగ్గరకు తీసుకెళ్ళింది. అతను తరచుగా మా ఇంటికి వచ్చేవాడు. అంతే."

"మీ అమ్మాయి అతనిపట్ల యే విధంగా ప్రవర్తించేది?" ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

రామానుజం బరువుగా నిట్టూర్చాడు. "అమ్మాయి... అతన్ని చాలా గౌరవంగా చూసేది. అతనంటే దానికెంతో అభిమానం. తను ప్రేమించే అన్నయ్య ముందు, అమాయకురాలైన ఆడపిల్ల ఎలా ప్రవర్తించేదో, అతని ముందు అమ్మాయి అలా ప్రవర్తించేది. కానీ....పైకి కనిపించే అతని మానవ రూపం వెనక నక్కి దాక్కున్న దానవుణ్ణి ఆ పసిది చూడలేకపోయింది...."

"మీరు చూశారా?" ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

రామానుజం తల వెనక్కీ ముందుకీ ఆడించి. నిట్టూర్పు అతని వ్యధని వెలికి చిమ్మింది. "చూశాననే అనుకుంటున్నాను. అతను అమ్మాయిపట్ల అవసరాన్ని మించిన అభిమానాన్ని ప్రదర్శించేవాడు. అనవసరంగా అమ్మాయిని పొగిడేవాడు. ఆర్నెల్లలో మా ఇంటికి చాలాసార్లు వచ్చాడు. అతను ప్రదర్శించిన అభిమానం, మెప్పు మోతాదు మించినవిగా నాకు అనిపించేవి. అతని కళ్ళు అసిస్టెంట్ ని చూసే లాయరు కళ్ళలా నాకు అవుపించేవి కావు ...."

"ఐసీ....మీరు అమ్మాయిని హెచ్చరించలేదా?" ప్రాసిక్యూటర్ ప్రవాహానికి అడ్డు తగిలాడు.

"చాలాసార్లు. కానీ అమ్మాయి మొండి. లా చదవొద్దని యెంత మొత్తుకున్నా వినలేదు. తన గురువు విషయంలో నేను పొరబడుతున్నానని వాదించేది. గొర్రె కసాయివాడ్ని నమ్మినట్టు అది అతన్ని నమ్మింది!" రామానుజ కంఠం బొంగురుపోయింది.

"అయామ్ సారీ. మూడో తారీఖు రాత్రి టాక్సీ ఆమెకోసం వచ్చినప్పుడు మీరు ఇంట్లో వున్నారా?"

"ఉన్నాను."

"టాక్సీ డ్రైవర్ని చూశారా?"

"చూశాను. ఇందాకా ఇక్కడ నుంచున్నతనే."

"అంత రాత్రివేళ అమ్మాయిని వెళ్ళొద్దనలేదా?" ప్రాసిక్యూటర్ అడిగాడు.

"వెళ్ళొద్దన్నాను. మర్నాడు ట్రయల్ కి రాబోయే కేసు గురించి డిస్కస్ చేయడానికి అతను రమ్మన్నాడంది. దానిమీద అతనేదో మత్తుమందు చల్లాడు. నేను

యెప్పుడేనా హెచ్చరిస్తే అతని తరఫున నాతో వాదించేది. చివరికి తన అజ్ఞానానికి అది బలైపోయింది!"
రామానుజం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"రామానుజంగారూ, అమాయకురాల్ని బలితీసుకున్న దుష్టుల్ని త్వరలో చట్టానికి బలైపోతుంది; విచారించకండి!" ప్రాసిక్యూటర్ ఉద్రేకంతో అన్నాడు.

రామానుజం దీనంగా చూశాడు. "ఇక మాకు మిగిలింది విచారమే!"

ప్రాసిక్యూటర్ గజాననరావు కరుణాకర్ వైపు చూశాడు.

"యూ మే క్వెశ్చన్ ది విట్నెస్!" అన్నాడు సవాలు చేస్తున్నట్టు.

"నో క్వెశ్చన్" కరుణాకర్ తల అడ్డంగా ఊగింది. అతని చేతులు బోను ఫ్రేమ్‌మీద బిగుసుకున్నాయి. కన్నీళ్ళతో, తన ఎదురుగా బోనులో నిలబడ్డ గీత తండ్రిని అతను సానుభూతితో చూశాడు.

అతని మాటలు తనలో ఆగ్రహాన్ని పుట్టించడంలేదు. గీతపట్ల తనకున్న ఆదరాభిమానాల్ని ఆయన అపార్థం చేసుకున్నట్టు తనకి అప్పట్లో తెలీదు. కానీ, కూతురు దారుణంగా చెరచబడి హత్య చేయబడ్డాక, తను హంతకుడిగా చిత్రించబడ్డాక ఆయన తన ప్రవర్తనని అపార్థం చేసుకొనేలా సన్నివేశాలు చిత్రించబడ్డాయి. సాక్ష్యాలు రూపొందించబడ్డాయి. తను అబద్ధాలుగా నిరూపించలేని సన్నివేశాలూ; సాక్ష్యాలూ!

కానీ, నిజాన్ని నిజంగా, అబద్ధాన్ని అబద్ధంగా నిరూపించే అవసరం తనకిలేదు. తనని నర్మద దగ్గరకు తీసుకెళ్ళే తీర్పుకోసం, జడ్జిమెంట్‌కోసం తను యెదురు

చూస్తున్నాడు!

"నర్మద... నర్మద.... నర్మదా. ఈ చేతుల్తో, నిన్ను అక్కున చేర్చుకున్న ఈ చేతుల్తో నిన్ను ఆరాధించిన ఈ చేతుల్తో, గుడ్డివాడిలా నీకు విషం తాగించాను! నర్మదా, నా ప్రేమలో యేదో లోపం వుంది. లేకపోతే నా ప్రేమ ఆ విషాన్ని అమృతంగా మార్చివుండేది...."

కరుణాకర్ హృదయం బావురుమంటోంది. కరిగిపోతో, కన్నీరుగా మారుతోన్న హృదయాన్ని రాయిలా మార్చుకుంటూ అతను ఈ లోకంలోకి వచ్చాడు.

ప్రాసిక్యూటర్ విజయోత్సాహంతో వున్నాడు. ఉపన్యాసం ప్రారంభించబోయే రాజకీయ నాయకుడు సభను కలయజూసినట్టు, హుందాగా కోర్టంతా కలయ జూశాడు.

"మిస్టర్ జస్టిస్ అండ్ మెంబర్స్ ఆఫ్ ది జ్యూరీ.." గంభీరమైన కంఠంతో ప్రాసిక్యూటర్ ప్రారంభించాడు: "ముద్దాయి కరుణాకర్ తన భార్యను ప్రేమించలేదనీ, తన దగ్గర అప్రెంటిస్ చేస్తున్న కుమారి గీతను అక్రమంగా ప్రేమిస్తూ వచ్చాడనీ సాక్ష్యాలవల్ల రుజువైంది.

"న్యాయశాస్త్ర పట్టభద్రుడైన ముద్దాయి, రాక్షసుడుగా మారి, గర్భవతి అయిన భార్యనూ, అభం శుభం యెరగని, గీతను, భవిష్యత్తు గురించి బంగారు కలలు గంటున్న కన్నెపిల్లనూ తన స్వార్థానికి బలి తీసుకున్నాడు. చట్టప్రపంచానికీ, మహిళాలోకానికీ ఇది ఘోరమైన అవమానం! ఈ నేరాల్ని ముద్దాయి చేశాడని నిర్ద్వంద్వంగా, పటిష్టమైన సాక్ష్యాధారాల్తో, సందేహానికి తావు లేకుండా నిరూపించబడింది.

"కామంతో, స్వార్థంతో నిండు ప్రాణాల్ని—ఒకే

రాత్రి రెండు నిండుప్రాణాల్ని బలిగొన్న ముద్దాయిని దాక్షిణ్యం లేకుండా తగిన శిక్ష విధించాలని కోర్టువారిని కోరుతున్నా. ఇదీ ప్రాసిక్యూషన్ కేసు!" ఉద్రేకంతో ఏకబిగిని చెప్పి ముగించాడు గజాననరావు ఠీవిగా నడుస్తూ వెళ్ళి తన కుర్చీలో కూర్చున్నాడు.

జడ్జి గోస్వామి కరుణాకర్ వైపు చూశాడు. "డిఫెన్స్ తరఫున సాక్ష్యాల్ని ప్రవేశ పెట్టొచ్చు" అన్నాడు.

కరుణాకర్ వెర్రివాడిలా జడ్జి వైపు చూశాడు. "సాక్ష్యాలు లేవు మిస్టర్ జస్టిస్ ..." అన్నాడు మెల్లగా.

జడ్జి గోస్వామి సానుభూతితో తల పంకించాడు. "మీరు చెప్పుకోవాల్సింది ఏమైనా వుందా?"

కరుణాకర్ రెప్పలెత్తి అతన్ని చూశాడు. మండుతున్న నిజానికి ప్రతిరూపాల్లా, ఎర్రగా వున్నాయి అతని కళ్ళు. "మిస్టర్ జస్టిస్.... నేను చెప్పేది నేది ఒక్కటే: ఈ నేరాలేవీ నేను చేయలేదు!"

జడ్జి గోస్వామి అతన్ని తీక్షణంగా చూశాడు. "మీ మాట—మీ మీద ఆరోపించబడి, నిరూపించబడిన నేరాల్ని తుడిచివేయలేదు! తగు విధంగా దాన్ని నిరూపించుకోవాలి ...."

"నిజాన్ని నిరూపించాల్సిన అవసరంలేదు! మిస్టర్ జస్టిస్, మీ తీర్పు యివ్వండి!" కరుణాకర్ కంఠం గంటలా మ్రోగింది.

జడ్జి గోస్వామి జ్యూరీ సభ్యులతో యేదో చెప్పాడు. అందరూ లేచి లోపలి ఛాంబర్‌లోకి వెళ్ళారు. నిమిషాలు గడుస్తున్నాయి. ఎవరో అడ్వొకేటు తన ముందు నిలబడి తగ్గుస్వరంలో యేదో చెప్తున్నాడు.

కానీ, అతని మాటలు తన చెవుల్ని తాకటంలేదు. తన చెవుల్లో ఇందాకా సాక్షులు పలికిన మాటలు కఠోరంగా ప్రతిధ్వనిస్తున్నాయి. తనకు తెలిసినవాళ్ళూ, తెలీనివాళ్ళూ అందరూ అబద్ధాలాడుతున్నారు!

ఈ అబద్ధాల్ని పలికిస్తున్న శక్తి యేది? ఆ శక్తికి తనేం అపకారం చేశాడు? తనని ఇంట్లోంచీ తీసుకెళ్ళి, తన చేతుల్లో గీత మొహంమీది తలగడను అదిమిపెట్టి దారుణంగా ఆమెని చంపిన ఆ రాక్షసులిద్దరూ యెవరు? కోర్టులో వాళ్ళు కూడా తనకి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడానికి రావొచ్చని తను ఊహించాడు. కానీ వాళ్ళు మళ్ళీ తనకి కనిపించలేదు.

వాళ్ళే హార్లిక్స్‌లో సైనైడ్ కలిపివుంటారు! తనమీద అంత శత్రుత్వం ఎవరికివుంది? దారితప్పి సాగిపోతున్న ఆలోచనల్ని బలవంతంగా అదుపులో పెట్టుకున్నాడు కరుణాకర్. ఎవరు యెవరైనా తనకి అవసరంలేదు. తన నర్మదని తననుండీ దూరంచేసిన వ్యక్తులున్న లోకంతో తనకి పనిలేదు....

కరుణాకర్ తల మెల్లిగా కొద్దిగా పక్కకు తిరిగింది. జడ్జి గోస్వామి యేదో చదువుకుపోతున్నాడు. ప్రాసిక్యూటర్ ఉద్రేకంతో గొంతెత్తి బొబ్బలెట్టిన విషయాన్నే, యేమాత్రం ఉద్రేకం లేకుండా సాదాగా అప్పజెప్తున్నాడాయన. జ్యూరీ సభ్యులు చేతులు ఎక్కడ పెట్టుకోవాలో తాత్కాలికంగా మరచిపోయిన గాంధీమహాత్ముడి కోతుల్లా కూచున్నారు.

జడ్జి గోస్వామి ఇండియన్ పీనల్ కోడ్‌లోని వివిధ అధికరణాల్ని ఏకరువు పెడుతున్నాడు. ప్రాసిక్యూషన్

సాక్ష్యాన్నీ, తన చేతగాని తనాన్నీ గౌరవపూర్వకమైన భాషలో వివరించాడు. ఒకసారి తలెత్తి జడ్జి గోస్వామి తనవైపు చూసి మళ్ళీ తన ముందున్న కాగితాల మీదికి తల వాల్చాడు.

“....ప్రకారం ముద్దాయి కరుణాకర్‌కి యావజ్జీవ కారాగార శిక్ష విధించబడింది....”

కరుణాకర్ తల చివాల్న పైకి లేచింది. యావజ్జీవ కారాగార శిక్ష! తను యింకా జీవించాలా? అన్యాయం!

“నో!” కరుణాకర్ కంఠం శంఖంలా కోర్టు హాల్లో మారు మ్రోగింది. అతని తల పిచ్చిగా అటూ యిటూ ఊగుతోంది. బోను ఫ్రేమ్ చుట్టూ అతని చేతులు బిగుసుకున్నాయి.

నివురు తొలగిపోయిన నిప్పుల్లా వున్న కళ్ళతో అతను జడ్జి వేపు రౌద్రంగా, ఆవేశంగా చూశాడు.

“నో! నన్ను బతకనివ్వకండి! నాకు మరణశిక్ష విధించండి! నన్ను ఉరితీయండి!”

కరుణాకర్ పూనకం వచ్చినవాడిలా అరవసాగేడు. అతని మొహం చెమటతో తడిసిపోతోంది. కళ్ళు రక్తంలో ముంచినట్టున్నాయి. జడ్జి అయోమయంగా చూస్తూ సుత్తితో చరిచాడు. కోర్టులో కలకలం.

కరుణాకర్ అరుస్తూ తలని బోనుకేసి గట్టిగా కొట్టుకోసాగాడు. నుదురు చిట్లుతోంది. రక్తం కారుతోంది.

“నన్ను ఉరితీయండి! ఉరితీయండి!” కరుణాకర్ అరుపుల్నీ, బోనుకి తాకుతున్న అతని తల చేస్తున్న శబ్దం పంక్చుయేట్ చేస్తోంది.

రెండు చేతులు వెనకనుంచీ అతన్ని బలంగా లాగి

పట్టాయి. అతని కళ్ళముందు యేవో మెరుపులు మెరుస్తు న్నాయి. రిపోర్టర్స్ కూచున్నవైపు నుండీ ఫ్లాష్‌లు జిగేల్ జిగేల్ మంటున్నాయి.

కరుణాకర్ ముఖం రక్తసిక్తంగావుంది. అతని తలలో యేవో రాకెట్లు దూసుకెళ్తున్నాయి. తనని బలంగా పట్టుకున్న చేతులకి తన శరీరాన్ని అప్పగించి, కళ్ళు మూసుకుని, తన తలలో దూసుకెళ్తున్న రాకెట్లో ప్రయాణం చేయసాగా డతను....

• • •

నల్ల కళ్ళజోడు; నిక్కరు. ఎండిపోయిన చింపిరి జుట్టు. ఒత్తుగా పెరిగిన గడ్డం. కొడిగట్టి, ఆరిపోడానికి సిద్ధంగా వున్న దీపాల్లాంటి కళ్ళు. ఇసుక జెల్లడలాంటి మెష్ వెనుక నుంచున్న కరుణాకర్‌ని మనోజ్ విచారంతో చూశాడు. కరుణాకర్ పెదవులు అదురుతున్నాయి.

"అన్నయ్యా...." మనోజ్ కంఠంలో విచారం బరువుగా ధ్వనించింది.

ఉద్రేకాన్ని అణుచుకుంటూ, వెర్రివాడిలా చూశాడు కరుణాకర్. తను తమ్ముణ్ని చూసి రెండేళ్ళయింది. ఈ రెండేళ్ళలో మనోజ్ ఆకారం బాగా మారింది. పొడుగ్గా వున్న మనోజ్ శరీరం కండలు తిరిగి బాగా గట్టిపడింది. మొహం ఆరోగ్యంతో మెరుస్తోంది. పొట్టిగా కత్తిరించిన క్రాఫు సన్నటి మీసాలు పెదవుల చివర్లదాకా సాగేయి. మిలిటరీ క్రమశిక్షణ మనోజ్ శరీరంమీద తన ప్రభావం చూపిస్తోంది....

"నీ తమ్ముడు చచ్చిపోయాడనుకున్నావా?" మనోజ్ కంఠం విని, కరుణాకర్ ఉలిక్కిపడ్డాడు.

"తమ్ముడూ...."

"ఆయన ఉత్తరం రాయకపోతే, ఈ దారుణంగురించి తెలిసేది కాదు. నీ కష్టసుఖాలతో నాకు పని లేదను కున్నావా, అన్నయ్యా!" మనోజ్ కంఠంలో ఆక్షేపణా విచారం కలిసివున్నాయి.

"తమ్ముడూ" కరుణాకర్ కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

మనోజ్ అతని మొహంలోకి చూశాడు. "ఈ ఘోరం ఎందుకు జరిగింది? ఎవరు చేశారు?"

కరుణాకర్ తల బలహీనంగా కదిలింది. "తెలీదు...."

"నీ భార్యనూ, నీ అసిస్టెంట్‌నూ పొట్టన పెట్టుకుని, నిన్ను ఇలా జీవచ్ఛవంలా మార్చే శత్రువులు నీకున్నా రని నాకు తెలీదన్నయ్యా!"

"తమ్ముడూ!" కరుణాకర్ ఎర్రటి కళ్ళలో ఆశ్చర్యం.

"అన్నయ్యా, నిజం చెప్పు. నువ్వు ఎవ్వరికి ఏ అప కారం చేశావు?"

"నేను ఎవ్వరికీ అపకారం చేయనని నీకు తెలుసు?"

"తెలుసు. అయితే ఈ అన్యాయం యెందుకు జరి గింది? యేదో బలమైన కారణం లేకుండా యెవ్వరూ ఇలాంటి దారుణం చెయ్యరు."

"తమ్ముడూ....నువ్వన్నది నిజమే. అయితే ఎవరు, ఎందుకు చేశారో నేను ఊహించలేకుండా వున్నాను" కరుణాకర్ నీరసంగా అన్నాడు.

"నీ మూలంగా కోర్టులో వోడిపోయి, శిక్ష అనుభ వించిన వ్యక్తి, విషంలా పగని పెంచుకున్న వ్యక్తి— యెవరేనా వుండొచ్చు. గుర్తుచేసుకో అన్నయ్యా...."

కరుణాకర్ తల బలహీనంగా, అడ్డంగా ఊగింది. అతని చూపుల్లో నిరాశా, నిస్పృహాలు రూపందాల్చాయి.

"ఎవ్వరూ లేరు....అయినా దేన్నీ గుర్తుచేసుకోడం నాకు

ఇష్టం లేదు!"

"ఎందుకు ఇష్టంలేదు?" మనోజ్ తీక్షణంగా అడిగాడు.

"విరిగిపోయిన పాలని పూర్వస్థితికి తీసుకురాలేవు. అంతా మరిచిపో, తమ్ముడూ...." కరుణాకర్ కంఠం దీనంగా వుంది.

మనోజ్ అతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "వదిననూ, వదిన హత్యనూ, నువ్వు బతుకుతున్న నీడ బతుకునూ మరిచిపోలేనన్నయ్యా!"

కరుణాకర్ తమ్ముణ్ని సానుభూతితో చూస్తూ నిట్టూర్చాడు.

"కొన్ని విషయాల్ని మరిచిపోవడం మంచిది, మనోజ్. గుర్తుంచుకొని నువ్వు చేయగలిగిందేమీ లేదు. యేదో తెలీని వస్తువుకోసం చీకట్లో వెతకలేవు!"

"అన్నయ్యా!"

కరుణాకర్ ఉలిక్కిపడ్డాడు. మనోజ్ కళ్ళు చంద్ర నిప్పుల్లా తయారయ్యాయి. పిడికిళ్ళు బిగుసుకున్నాయి. మెడమీది నరాలు పురెక్కిన నులకల్లా అవుపించసాగేయి.

"ఎవరో తెలుసుకుంటాను. చీకటిని వెల్తురుగా మార్చి వెతుకుతాను? వెతికి...."

"మనోజ్!" కరుణాకర్ కంగారుగా అరిచాడు. మనోజ్ అతన్ని తీక్షణంగా, రెప్పవేయకుండా చూశాడు.

"అన్నయ్యా, నువ్వు నేరం చేశావా?"

కరుణాకర్ దెబ్బతిన్నట్టు చూశాడు. కళ్ళల్లోంచి వ్యథ తొంగిచూస్తోంది. "నేను నేరం చేయలేదనీ, చేయ

నని నీకు తెలుసు!" .

మనోజ్ కళ్ళు సానబట్టిన వజ్రాల్లా మెరుస్తున్నాయి. "నువ్వు చేయలేదు. ఎవరో చేశారు. వదిననూ గర్భంలోని పసిబిడ్డనూ, అమాయకమైన గీతనూ హతమార్చారు. నిన్ను హంతకుడిగా చిత్రించి, నిరూపించి ఇక్కడికి సరఫరా చేశారు. పెసిమిస్టిక్‌గా, బలహీనంగా ప్రవర్తించి నువ్వు వాళ్ళకి పరోక్షంగా సహాయం చేశావు. నిన్ను జెయిల్లో పడేయాలన్న వాళ్ళ ప్రయత్నానికి చేతులారా సాయం చేశావు! వాళ్ళెవరో—ఎవరైనా సరే, నానుండి తప్పించుకోలేరు!"

"తమ్ముడూ!" కరుణాకర్ కంఠంలోని ఆందోళన మనోజ్‌ని ఆశ్చర్యంలో నింపింది. అతను ప్రశ్నార్థకంగా చూశాడు.

"మనోజ్, నీ మాటలు నాకెంతో ఆనందాన్నీ, తృప్తినీ ఇస్తున్నాయి. నాకెంతో గర్వంగా వుంది. నా మాట విను; జరిగిన నష్టం భర్తీకాదు. జరిగిందంతా మర్చిపో. నన్ను మరిచిపో. ఉద్యోగం చేసే ప్రదేశానికి వెళ్ళిపో. పెళ్ళాడు హాయిగా బతుకు. ఇటు వేపు....ఇటు వేపు రావొద్దు...."

"అన్నయ్యా!"

"నర్మద పోయాక నాలోంచీ అంతా వెళ్ళిపోయింది. ఉరిశిక్ష పడుతుందని ఎంతో, ఎంతో ఆశించాను. ప్రయత్నించినా, ప్రయత్నించికపోయినా నాకు శిక్ష తప్పదని తెలుసు. కానీ.... నేను ఆశించిన శిక్ష నాకు లభించలేదు!"

"అన్నయ్యా ..."

"నేను దారుణంగా, భయంకరంగా వోడిపోయాను.

ఇంక ఎలాంటి గెలుపైనా, ఎవరు సాధించినా నాకు ఉపయోగించదు, తమ్ముడూ!"

మనోజ్ అతన్ని సానుభూతితో చూశాడు.

"ఇదికూడా వేరే సంగతే! నువ్వు సహించిన, సహిస్తున్న అన్యాయాల్ని నేను సహించను అన్నయ్యా!" మనోజ్ కంఠం నయాగరాలా ధ్వనించింది.

"మనోజ్, బడుద్దాయిలా మాట్లాడకు వెళ్ళు!" కరుణాకర్ గద్దించాడు.

మనోజ్ అతన్ని చిరునవ్వుతో చూశాడు. "చిన్నతనంనుంచీ అందరూ నన్ను బడుద్దాయి అన్నారు చదువు అబ్బని నేను అందరికీ. చివరికి నీకు కూడా బడుద్దాయిలా కనిపించాను. అందుకే ఆర్మీలో జవానుగా చేరిపోయాను. చదువూ, సంస్కారం లేకపోయినా నేను లోకం చూశాను. పుస్తకాలు చదవకపోయినా మనుషుల్ని చదివాను. అయినా లా చదువుకున్న నీ దృష్టిలో నేనింకా బడుద్దాయిలాగే వున్నాను! ఆల్ రైట్ ...."

"తమ్ముడూ, అయాం సారీ. నాకు తెలీని, అర్థం కాని ఊబి యేదో నన్నిలా చేసింది. ఆ ఊబిలోకి దిగితే నువ్వు తిరిగి పైకి రాలేవు...."

మనోజ్ చిన్నగా నవ్వాడు. "నాకు పిరికిమందు పోస్తున్నావా, అన్నయ్యా?"

"మనోజ్, నా అజ్ఞాత శత్రువు ఆరితేరిన చదరంగం ఆటగాడిలా చాకచక్యంగా అంతా ముందే ప్లాన్ చేసి సిద్ధం చేసుకున్నాడు. మనిషిని చంపే ముందే చితి పేర్చి సిద్ధంగా వుంచాడు. అతను ...."

"నా శత్రువుని నువ్వు పొగడుతూంటే నేను సహించలేను, అన్నయ్యా!"

"మనోజ్, అతన్ని మరిచిపో. నన్ను మరిచిపో...."

"అసంభవం!" మనోజ్ ఉద్రేకంతో అరిచాడు. నిదానించి కరుణాకర్‌ని చూశాడు. "అన్నయ్యా, మళ్ళీ అడుగుతున్నా! వదిననీ, గీతనీ నువ్వే హత్య చేశావా?"

"మనోజ్!"

"ఈ దారుణం చేసిన రాక్షసుడికోసం నేను అన్వేషిస్తాను. ఈ చేతుల్తో నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తాను. నా అన్వేషణ నన్ను నీ దగ్గరకి తీసుకువచ్చినా అంతే!" మనోజ్ కంఠంలో పట్టుదల ధ్వనించింది.

"తమ్ముడూ...."

"దీనికంతా కారణమైన రాక్షసుడి శవం తప్ప ఈ లోకంలో యేదీ నన్ను ఆపలేదు అన్నయ్యా!" మనోజ్ గిరుక్కున వెనుదిరిగాడు.

"మనోజ్ ...." కరుణాకర్ గాబరాగా అరిచాడు.

మనోజ్ ఆగలేదు. వెనక్కి తిరగలేదు, హుందాగా, వేగంగా నడుస్తూ తననుంచీ దూరంగా వెళ్ళిపోతున్న తమ్ముణ్ని చూస్తూ తలని తనముందున్న మెషీకి ఆన్చాడు కరుణాకర్. అతనిలో సుళ్ళు తిరుగుతున్న దుఃఖం అశ్రుకణాలుగా మారింది.

• • •

అప్పుడే చీకటి పడుతోంది. గేటు తోసుకొని ఇద్దరూ లోపల ప్రవేశించారు. పెద్ద కాంపౌండు మధ్యలో చిన్నగా, అందంగా కట్టించిన ఇంటిని పరిశీలనగా చూస్తూ పొడుగాటి వ్యక్తి ముందు నడుస్తున్నాడు. పొట్టిగా, సన్నగా వున్న వ్యక్తి గేటుని మునుపట్లా మూసేసి, అతన్ని అనుసరించాడు.

ఇద్దరూ వరండా చేరుకున్నారు. గ్లవ్స్ ధరించిన

చేతులో పొడగాటి వ్యక్తి తలుపుకి వేళ్ళాడుతున్న తాళాన్ని పట్టుకున్నాడు. గాడ్రెజ్ తాళం! అతని మొహంమీద చిరునవ్వు మెరిసింది. మనుషులకి గాడ్రెజ్ తాళాలమీద నమ్మకం జాస్తి. తనలాంటి వాళ్ళు చిటికెన వేలి గోటితో ఆ తాళాల్ని చిటికెలో తెరిచేస్తారని వాళ్ళకి తెలీదు!

జేబులోంచీ అవసరమైన ఆయుధాన్ని తీస్తూ అతను తన అనుచరుడిని సాభిప్రాయంగా చూశాడు. పొట్టి వ్యక్తి గబగబా కదిలాడు. వరండా దిగి ఇంటిని ప్రదక్షిణం చేస్తూ నడవసాగేడు.

కొసలో స్క్రూడ్రైవర్ లా వెడల్పుగా వున్న కమ్మీని అతను తాళం రంధ్రంలోకి దూర్చాడు. అతని నాలుక కొద్దిగా ఇవతలికి పొడుచుకు వచ్చింది. కమ్మీని పట్టుకున్న చెయ్యి జాగ్రత్తగా, కొద్దిగా కదిలింది.

రెండు నిమిషాల్లో లివర్స్ చిన్నగా చప్పుడు చేస్తూ తప్పుకున్నాయి. సగర్వంగా నవ్వుకుంటూ అతను, అప్పుడే తన పక్కకి చేరుకున్న అనుచరుణ్ని చూశాడు. రెండు గొగ్గిరిపళ్ళు చూపిస్తూ అతను నవ్వాడు.

తలుపు తెరుచుకుంది. పొట్టిగా వున్న వ్యక్తి ఇంట్లోకి దూరాడు. తలుపు మూసుకుంది. పొడుగాటి వ్యక్తి కమ్మీని ఉపయోగించి యథాప్రకారం తాళం వేసేశాడు. ఖాళీగా వున్న రోడ్డుని వోసారి చూసి, వరండాలోంచీ ఇంటి వెనక భాగంవేపు చకచకా నడిచాడు.

చిన్న శబ్దంతో పెరటి తలుపు తెరుచుకుంది. అనుచరుడు అతనివైపు పళ్ళికిలించాడు. పెంకుల వసారాలోంచీ అతను గుమ్మం దాటి ఇంట్లోకి ప్రవేశించాడు. తలుపు మూసి, గొళ్ళెం పెట్టేసి, అతన్ని దాటుకుని

పొట్టి వ్యక్తి గునగున నడుస్తూ ముందు దారితీశాడు. మరో రెండు తలుపులు దాటి యిద్దరూ హాలు చేరుకున్నారు.

హాలు మధ్యలో స్తంభంలా నిలబడి, పొడుగాటి వ్యక్తి చుట్టూ కలయజూశాడు.

ఖరీదైన ఫర్నీచర్, కిటికీలకి తెరలు, గోడవారగా కలర్ టెలివిజన్ సెట్, టేప్‌రికార్డర్. ఎడంవైపున మూసిన తలుపుమీద అతని చూపులు పడ్డాయి. పెద్ద పెద్ద అంగలో సమీపించి, తలుపుల్ని లోపలికి తోస్తూ తొంగిచూశాడతను. ఆఫీసు గది. ఎత్తుగా వున్న స్టీల్ రాక్స్‌లో వరసగా పేర్చిన పుస్తకాలు. మరోవైపున దొంతరలుగా పెట్టిన ఫైల్సు. గది మధ్యలో వెడల్పాటి ఫైల్సా. తలుపులు మూసి అతను వెనక్కి తిరిగాడు.

టైమ్ చూసుకున్నాడు. ఆమె రావడానికి మరో పది నిమిషాల వ్యవధి వుంది.

హాలు మధ్యలో వున్న బాస్కెట్ ఛెయిర్ని గోడవారగా లాగి, తలుపు పక్కకి జరిపి, కాళ్ళు ముందుకి చాస్తూ కూచున్నాడతను. జేబులోంచి జర్దాబీడా తీసి నోట్లో దోపుకుని సావధానంగా రుబ్బడం ప్రారంభించాడు. అనుచరుడిని చిరునవ్వుతో చూస్తూ మరో కుర్చీ వైపు సైగ చేశాడు.

పొట్టివ్యక్తి తల అడ్డంగా ఆడిస్తూ కదిలాడు. తలుపుకి కుడివైపున గోడకి జార్లాపడ్డాడు. సగం నమిలిన చుట్టను జేబులోంచి తీసి, పళ్ళఇరకించి, తృప్తికరంగా నమలడం ప్రారంభించాడు.

* * *

ఆటో ఆగింది.

మోటర్ పెకం చెల్లించి కాంత కిందికి దిగింది. గేటు తోసుకుని తోటలోకి ప్రవేశించింది.

వరండా ముందు కారు లేదు. తన భర్త యింకా యింటికి యెందుకు రాలేదా అనుకుంటూ కాంత అడుగులు వేయసాగింది.

తనూ, భర్తా స్వయంగా నీళ్ళుపోసి పెంచుతోన్న మొక్కల్లోంచీ పూలు వెదజల్లుతున్న సువాసనల్ని ఆఘ్రాణిస్తూ మెట్లెక్కి వరండా చేరుకుంది. కూనిరాగం తీస్తూ, పర్సులోంచీ తాళంచెవి తీసి తలుపు తెరిచింది. లోపల అంతగా వెల్తురు లేదు. గుమ్మం దాటి తలుపు మూసి, పక్కనేవున్న స్విచ్చి కోసం చెయ్యి చాచింది.

కొంచెందూరం సాగిన ఆమె చెయ్యి మధ్యలో ఆగింది. కాంత శరీరం వొక్కసారి జలదరించింది.

నునుపుగా రబ్బరులా వున్న చెయ్యి ఆమె చేతిని పట్టుకుంది. మరో చెయ్యి ఆమె నోటిని బలంగా, ప్రెషర్ కుక్కర్ మూతలా కప్పేసింది. మూడో చెయ్యి ఆమె తల వెనుకభాగాన్ని పట్టుకుంది. రెండు చేతుల మధ్య ఆమె తల కదలడానికి వీల్లేకుండా ఇరుక్కుంది.

చటుక్కున లైటు వెలిగింది. కాంత భయంతో, ఆందోళనతో విడిలించుకునే ప్రయత్నం చేసింది. ఆమె కనుగుడ్లు అటూ యిటూ, యిటూ అటూ వేగంగా కదిలాయి.

"మిసెస్ రంగనాథ్, భయపడకండి!" ఏదో కంఠం ఆమె చెవిలో రహస్యం చెప్తున్నట్టు బుసకొట్టింది.

జర్దా వాసన ఘాటుగా ఆమె ముక్కుకి సోకింది. ఆమె గుండె డప్పులా మ్రోగడం ప్రారంభించింది.

తనకి కనిపించేలా కొంచెం ముందుకి జరిగిన పొడుగాటి

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

వ్యక్తిని కంగారుగా చూసిందామె. అప్రయత్నంగా ఆమె చేతులు కదిలాయి. రెండు చేతుల్నీ కలిపి యెవరో వెనక్కి విరిచి పట్టుకున్నట్టు ఆమె భయంతో గుర్తించింది.

“టేకిటీజీ మిసెస్ రంగనాథ్” అన్నాడు ఎదురుగా నుంచున్న వ్యక్తి.

సన్నగా, బలిష్టంగా పొడుగ్గా వున్నాడతను. చిందర వందరగా వున్న క్రాపు అతని నుదుర్ని పూర్తిగా కప్పేసింది. గుబురుగా వున్న కనుబొమల కిందినుంచీ పాము కళ్ళు ఆమెనే తీక్షణంగా చూస్తున్నాయి. పొడుగాటి ముక్కు మీద ఎర్రటి పులిపిరికాయ. పది రోజుల క్రితం గీసుకుని వుండాల్సిన గెడ్డం. జర్దా మూలంగా ఎర్రగా, తడిగా—రక్తంతో తడిసినట్టున్న పల్చటి పెదవులు. కాంత శరీరం వణకడం ప్రారంభించింది.

ఆమె రెండు మణికట్లనీ ఒక్కటిగా కలుపుతూ సన్నటి తాడు. ఆమె వెనకవైపున బిగుసుకుంటోంది. కాంత అసంకల్పితంగా చేతుల్ని గింజుకుంది. ఆమె కళ్ళల్లోకి నవ్వుతూ చూస్తున్నాడతను. ఆ నవ్వు ఆమెని భయంతో, కంపరంతో నింపుతోంది.

“ఆ గదిలో లాయరుగారి పొడుగు చేతుల చొక్కా వుంటుంది పట్రా!” అనుచరుడికి ఉత్తరువిచ్చాడతను.

చేతుల్ని కట్టేయడం ముగించిన అనుచరుడు గబగబా గదిలోకి వెళ్తున్నాడు. కాంత పొట్టిగా వున్న అతన్ని వోరగా చూస్తోంది. చొక్కాతో అతను తిరిగొస్తున్నాడు. అతను కూడా గెడ్డం గీసుకోలేదు. ఎడమ చెంప మీద ప్లస్ ఆకారంలో ప్లాస్టర్ వుంది. ఏనుగు కళ్ళు. గొగ్గిరి పళ్ళ మధ్య చుట్ట నలుగుతోంది.

గట్టిగా అరవాలనీ, వాళ్ళకి ఏంకావాలో కనుక్కొని, పారేసి వెళ్ళిపొమ్మవాలనీ కాంతకి యెంతగానో వుంది. కానీ అతని అరచెయ్యి నోటిని మూసేసింది.

అతను ఆమెవైపు చిరునవ్వు నవ్వాడు. "మిసెస్ రంగనాథ్, కాసేపట్లో మీ నోటిమీదినుంచీ చేతిని తీసేస్తాను. అరిచే ప్రయత్నం చేయకండి. మీ అరుపు మీకు ప్రమాదం!" అతను కర్కశంగా అరవడంలేదు. అయినా అతని కంఠం ఆమెలో యేదో భయాన్ని పుట్టిస్తోంది.

"మిసెస్ రంగనాథ్, మీరు తొందరపడి, అరిచి, అమూలంగా గాయపడకుండా వుండటానికి, మీ నోట్లో మీ ఆయన చొక్కా కూరి, గట్టిగా మూసేస్తాం. ఈ ముందుజాగర్త మీ కోసమే. భయపడకండి. అరవకండి. చెప్పినట్టు వింటే మీకు యెక్కువ ప్రమాదం జరగదు!"

చెప్పినట్టు వింటే ఎక్కువ ప్రమాదం జరగదు. అంటే తక్కువ ప్రమాదం జరుగుతుందా? కాంత ఖంగారుగా ఆలోచిస్తోంది. చొక్కాని పట్టుకుని పొట్టివ్యక్తి ఆమె దగ్గరగా ఆగాడు. తన అనుచరుడి సైగను గుర్తించి చొక్కాని గుండ్రటి బంతిలా చుట్టడం ప్రారంభించాడు.

ఆమె పెదవులమీదా, బుగ్గలమీదా అతని చెయ్యి వొత్తిడి యెక్కువయింది. అతని ఎడమచెయ్యి ఆమె తలని వదిలేసింది. రెప్పపాటులో అతని పాంటు జేబులో దూరి యివతలకి వచ్చింది. అతని వేళ్ళ మధ్య యేదో ఎర్రగా మెరుస్తోంది. అతని మణికట్టు తటాలున కదిలింది. ఎర్రటి పిడిలోంచీ పదునైన కత్తి ఇవతలకి దూకింది. తళుక్కున మెరిసిన కత్తిని చూసి కాంత ఉలిక్కిపడింది. అతను కత్తిని తృప్తికరంగా చూసి కాంతవైపు నవ్వాడు.

(ఇంకా వుంది)

